శ్రీః
శ్రీమత్

# ఆంధ్రకుమారసంభవము

**కూచిమంచి సాంబశివకవి విరచితము**

పరిష్కరణము – పీఠిక

## గరిమెళ్ళ సోమయాజులు శర్మ



ప్రకాశకులు

## శ్రీశ్రీశ్రీ జగద్గురు పుష్పగిరి శంకర మఠము

పుష్పగిరి – 516 162

2015



శ్రీః
శ్రీమత్
ఆంధ్రకుమారసంభవము
కూచిమంచి సాంబశివకవి విరచితము

పరిష్కరణము – పీఠిక
గరిమెళ్ళ సోమయాజులు శర్మ

ప్రతులకు
శ్రీశ్రీశ్రీ జగద్గురు పుష్పగిరి శంకర మఠము
పుష్పగిరి – 516 162

ప్రథమ ముద్రణ : 22–10–2015
ప్రతులు : 400
పుటలు : 210
వెల : రు. 30/–

D.T.P.:
**MR LASER PRINTS**
Chirala
Cell: **9849976054**



Printed at :
**KARSHAK ART PRINTERS**
Hyderabad.

# విజ్ఞాపనము

ఈ గ్రంథమును నేను వ్రాయుటకుఁ గారణము పీఠికలో వివరించియున్నాను. ఇది నేను వ్రాయ దొరఁకొనునప్పటి కొక కుగ్రామములోఁ గరణముగా నుంటిని. ఈ కుమారసంభవకథను స్వతంత్ర కావ్యముగాఁ గాని లేక కాళిదాసుని సుప్రసిద్ధ కావ్యమున కనువాదముగాఁ గాని తెనుఁగున నెవ రేమి వ్రాసినదియు నే నీ గ్రంథమును బూర్తిచేసిన తరువాతను గూడఁ గొంతకాలము వఱకును నాకుఁ దెలియదు. ఇటీవలఁ గ్రమక్రమముగా మిత్రులవల్లను బత్రికలవల్లను దెలిసినది. కాని మొదటినుండియు నేవిధమైన ప్రకటనోద్దేశము లేశమును లేకుండ వ్రాసిన నా కందువలన నాశాభంగ మెట్లు కలుగును? అందువలననే మాతమ్ముఁడు చి॥మహాదేవునకు నతని వ్యవహార మప్పగించి రామవరమునుండి నే నిచ్చటికి వచ్చునప్పుడు దీని నచట నముఖ్యమైన కాగితములతోఁ బాటు దిగఁబెట్టి వచ్చితిని. కాని తరువాతఁ గొన్నాళ్ళకు నది మాతమ్ముఁడు చూచి, చదివి దీని నచ్చొత్తింపుమని నన్నుఁ బ్రేరేపఁగా నీపేరింటి గ్రంథము లెన్నో యిదివఱకే యచ్చుపడిన వుండగా మనమిపు డిది ముద్రింపించుట కోనసీమకుఁ గొబ్బరి యెగుమతి చేయుటవలె వృథావ్యయప్రయాసై కప్రయోజనము గాఁ గల దని మందలించితిని గాని యతఁ డంతటితో నూరకుండక చంపూ రామాయణములోని "వాల్మీకిగీతరఘుపుంగవకీర్తిలేశైః" అను శ్లోకార్థమును నాకు జ్ఞాపకము చేయుచు మఱలమఱలఁ బ్రేరేపింపఁగా నతని మాటలయందు నాకుఁ గల సహజాదరాతిశయముచే నిందుల కీయకొంటిని.

మూల వ్యాఖ్యానములు యథామతి సావధానముగాఁ జదివి, చూచి తదర్థమున కీయనువాదము శక్యమైనంత సదృశతమప్రతిబింబముగా నుండునట్లు పాటుపడినాఁడను. "ప్రమాదో ధీమతా మపి" యను నట్లు బుద్ధిమంతులకు సైతము పొరపాటు కలదన నాబోంట్లమాట యిఁకఁ జెప్ప నేల? అచ్చయిన తరువాత





మాతమ్ముఁడు పైని జెప్పిన చి॥మహాదేవుఁ డిందులోని కొంతభాగము తిరిగి చదివి చూచి మొదటి యాశ్వాసములోని 29వ శ్లోకమైన "మందాకినీ సైకత వేదికాభిః" యను దాని కీయనువాదమున వ్రాయఁబడిన "మినువాక సైకతంబుల" అను పద్యములోఁ గొన్ని న్యూనతాధిక్యము లున్న వని చూపింపఁగా దానికి బదులు తిరిగి యీ దిగువ పద్యమును వ్రాసినాఁడను.

క. గగనధునిపులినములఁ దగు
జగతులఁ బ్రతిమలను జెండ్లసారెఁ జెలులతో
నగసుత బాల్యంబున నిం
బుగ నాడెను నాటచవుల భోగించె ననన్.

ఇట్లే పాఠకమహాశయ లెవరైన ఇందలి పద్యముల మూలశ్లోకములతోఁ బోల్చి చూచి సవరింపఁదగిన యించుమించు లేవైనఁ జూపించినచో నందులకు వారికి బహువందనము లర్పించుచు నవియెల్ల ముందుకూర్పులో సవరించుకొనెదను. అట్టివారి సౌకర్యార్థమే యీగ్రంథములోఁ బద్యాంతములందు మూలములోని శ్లోకములయంకెలే వేయఁబడినవి. ఆశ్వాసాద్యంతములయందుఁ జేర్పఁబడిన కృతిపద్యములకు నంకెలు వేయఁబడలేదు.

ఇట్లు విన్నవించు విధేయుఁడు,
గ్రంథకర్త.

---

## అవతారిక

### సంస్కృతాంధ్ర కుమారసంభవములు

కవికులగురు వగు కాళిదాసమహాకవి రచించిన కావ్యములలోఁ గుమార సంభవమునకు విశిష్టస్థానము గలదు. కాళిదాసు 1. రఘువంశము 2. కుమారసంభవము 3. మేఘసందేశమునను 3 కావ్యములు రచించినాఁడు. వీనిలో రఘువంశ మేక నాయకాశ్రయము గాదు. బహునాయకము. దీనిలో దిలీపుఁడు మొదలుకొని యగ్నివర్ణుని వఱకుఁ గల 27 మహారాజుల కథలు 19 సర్గములలో 1570 శ్లోకములలో వర్ణింపఁ బడినవి. ఇది కథాప్రధాన మైన కావ్యము, కాని వర్ణన ప్రధాన మైన కావ్యము కాదు. వస్త్వైక్యము లేనిది. ఏకరసప్రధానము గాదు. మేఘసందేశము ఖండకావ్యము. దీనిలో నసలు కథ లేదు. కావ్య మంతయు వర్ణనాత్మకమే. కథ, వర్ణనలు సమప్రధానముగా నడచిన కావ్యము కుమార సంభవము. ఆలంకారికులు చెప్పిన మహాకావ్య లక్షణములు దీనిలోఁ బుష్కలముగాఁ గలవు. ఇది యేకనాయకాశ్రయము. ఇందలి నాయకుఁడు శ్రీకుమారస్వామి. కుమారస్వామి తారకాసురుని వధించుట యిందలి యితివృత్త మగుటచే వస్త్వైక్యము గలదు. ఆలంకారికులు నిర్దేశించిన యష్టాదశ వర్ణనములలోఁ బెక్కు వర్ణనలు దీని యందుఁ గలవు. 'కవృ-వర్ణనే' యను ధాతువునుండి కవిశబ్దము పుట్టినది. వర్ణించువాఁడు కవి. వర్ణనాత్మక మైనది కావ్యము. ఇందలి ప్రధానరసము వీరము. శృంగారాదు లంగరసములు. ఈ విధముగాఁ గుమార సంభవమునకు మహాకావ్యలక్షణము లన్నియు సిద్ధించుచున్నవి.

నేఁడు లభించుచున్న కుమారసంభవములో 17 సర్గములు మొత్తము 1046 శ్లోకములు గలవు. ఈ కావ్య మంతయుఁ గాళిదాసవిరచితమా? కాదా? యను విషయములో విద్వద్విమర్శకులలో మతభేదము గలదు. కుమార సంభవమునకు సుమారు 46 వ్యాఖ్య లున్నట్లు శ్రీమాడభూషి కృష్ణమాచార్యులు నిర్దేశించిరి. వీనిలో వల్లభదేవుఁడు, చారిత్రవర్ధనుడు మొదలగు ప్రాచీనులు రచించిన వ్యాఖ్యలు 7వసర్గము వఱకే లభించుచున్నవి. మల్లినాథుఁడు 8వ సర్గము వఱకు వ్యాఖ్యానించెను. ఆనందవర్ధనాచార్యులు, క్షేమేంద్రుఁడు మొదలగు నాలంకారికులు 8వసర్గముల వఱకుఁ గల కుమారసంభవమునే యుదాహరించిరి. దీనిని బట్టి ప్రాచీనకాలములో 8 సర్గముల కుమారసంభవమే ప్రసిద్ధమైనట్లు తెలియుచున్నది. సీతారామకవి, జీవానందవిద్యాసాగరుఁడు మొదలగు నాధునికులు తక్కిన 9 సర్గముల కావ్యమునకు వ్యాఖ్యానములు వెలయించిరి.

భట్టోజీదీక్షితులు సిద్ధాంతకౌముదిలో,ఁ బ్రౌఢమనోరమలోఁ గుమారసంభవ శ్లోకముల నుదాహరించెను. ఉజ్జ్వల దత్తుఁ డుణాదిసూత్రవృత్తిలోఁ దక్కిన 9 సర్గములలోఁ గల శ్లోకముల నుదాహరించెను. ఉజ్జ్వలదత్తుని కాలము 14వ శతాబ్ద మని శ్రీయుధిష్ఠిరమీమాంసకులు సంస్కృతవ్యాకరణ శాస్త్రేతిహాసములోఁ జెప్పినారు. దీనినిబట్టి యుజ్జ్వలదత్తుఁడు మల్లినాథునకు సమకాలికుఁడు గాని కొంచెము పూర్వుఁడు కాని కావచ్చును. కాఁబట్టి 14వ శతాబ్ది నాఁటికే సంపూర్ణ కుమారసంభవము గలదు. నేఁడు 17 సర్గముల కుమారసంభవము కాళిదాసు పేరు తోడనే చెలామణి యగుచున్నది.

కాళిదాసమహాకవి రఘువంశములోఁ బద్మపురాణము ననుసరించినట్లే కుమారసంభవములో శివపురాణము ననుసరించినాఁడు. కుమారసంభవములో శివపురాణము





ననుసరించినాఁడు. అనుసరించుటయే కాదు. కొన్ని శ్లోకములను యథాతథముగా ననుకరించినాఁడు. ఆ శ్లోకములు తులనాత్మకముగా శ్రీరావిమోహనరావుగారు రచించిన 'మృణాళినీ' వ్యాఖ్యతో వెలువడిన కుమారసంభవములోఁ బ్రతిసర్గాంతము నందుఁ బరిశిష్టముగాఁబ్రదర్శింపఁబడినవి.

ఈ కుమారసంభవము ప్రాచీనకాలము నుండియుఁ బలువురు మహాకవుల దృష్టి నాకర్షించినది. సంస్కృతాంధ్రభాషలలో ననేకకుమారసంభవములు వెలసినవి. వానినిఁ గ్రమముగాఁబరిశీలింతుము.

### సంస్కృత కుమారసంభవములు

**1. ఉద్భటుఁడు (8శ.)**

ఇతఁడు కావ్యాలంకారసార సంగ్రహమును రచించిన గొప్ప యాలంకారికుఁడు. ఈయన యలంకారగ్రంథములోఁ గొన్ని కుమారసంభవశ్లోకము లుదాహరింపఁబడినవి. ఇవి యుద్భటుఁడే రచించిన కుమారసంభవములోని వని కావ్యాలంకారసారసంగ్రహ వ్యాఖ్యాత యగు ప్రవీహారేందురాజు స్పష్టముగాఁజెప్పినాఁడు.

శ్లో॥ తదానీం స్ఫీతలావణ్యచంద్రికాభరనిర్భరః।
కాంతాననేందురిందుశ్చ కస్య నానందకోఽభవత్॥ (కా.సా.సం 1-17)

'అనేన గ్రంథకృతాస్వోపరచితకుమారసంభవైకదేశోఽత్రోదాహరణత్వేనోపన్యస్తః'
ఈ కుమారసంభవము నేఁడు లభింపదు. దీనికే 'హరలీల' యను నామాంతర మున్నట్లు కొందఱు చెప్పుచున్నారు. నన్నెచోడుని కుమారసంభవములో నిట్లు కలదు-

కం॥ క్రమమున నుద్భటుఁడు కవి
త్వము మెఱయఁ గుమారసంభవమ్ము నలంకా
రము గూఢవస్తుమయకా
వ్యముగా హరులీల చెప్పి హరు మెచ్చించెన్. (కుమా-1-2)

**2. శరభోజీమహారాజు (19శ.)**

శరభోజీ మహారాజు 1800-1832 కాలములోఁ దంజావూరును భావించినాఁడు. ఇతఁడే సరస్వతీ మహలు తాళపత్ర లిఖిత పుస్తక భాండాగార సంస్థాపకుఁడు. 1. స్మృతసారసముచ్చయము 2. స్మృతిసంగ్రహము 3. ముద్రారాక్షసచ్ఛాయ 4. కుమారసంభవ చంపువు నితని రచనలు. కుమారసంభవ చంపూకావ్యములో 4 ఆశ్వాసములు; గద్యములు కాక 33+30+60+79 మొత్తము 202 శ్లోకములు గలవు. ఈ గ్రంథము ప్రాయికముగాఁ గాళిదాస కుమారసంభవమునే యనుసరించినది. చక్కని రచన.

శ్లో॥ మాతర్వాగ్దేవి! కిం తే? శరభనరపతే! వత్స! కార్యమ్ మమాస్తేఽ
సౌ బ్రహ్మణ్యోద్భవార్థే రుచిరమృదుపదే చంపుకావ్యేఽభిలాషః।
విజ్ఞాతం హైమశైలస్ఫటికమణిశిలాసంఘసంపాతజాత-
స్ఫీతాటోపాభ్రగంగాప్రవహణసదృశాః సంతు తే వాగ్విలాసాః॥

'ఇతి శ్రీ భోసలజలధి కౌస్తుభ చోలవసుంధరాధురంధర తులజమహారాజకుమార శరభోజిమహారాజవిరచితే కుమారసంభవచంపుకావ్యే చతుర్థ ఆశ్వాసః'-అని గ్రంథాంత గద్యము. ఈ కావ్యము శ్రీవాణీవిలాస ముద్రణాలయము వారిచే 1939లోఁ బ్రకటింపఁబడినది.

**ఆంధ్రకుమారసంభవములు**

**1. నన్నెచోడుఁడు (11శ.) :**

తెలుఁగులో నన్నెచోడుని కుమారసంభవము ప్రసిద్ధ మైనది. దీనిలో 12 ఆశ్వాసములు 2005 గద్యపద్యములు గలవు. ఇది నన్నెచోడుని స్వతంత్రరచన గాని కాళిదాసకావ్యమున కనువాదము గాదు. అక్కడక్కడఁ గాళిదాసశ్లోకములకు ఛాయలు గలవు. ఇతఁడు కాళిదాసమహాకవి నిట్లు స్తుతించినాఁడు-

కం॥ భాసురమతి వాల్మీకి - వ్యాసాదులు చనిన జగతి వరకవితాసిం
హాసన మెక్కి కవీంద్రుల-దాసులఁగా నేలెఁ గాళిదాసుఁడు పేర్మిన్ (కుమార1-19)

**2. శ్రీనాథుఁడు (15శ.) :**

ఆంధ్రసాహిత్యములో శ్రీనాథమహాకవి రచించిన 'హరవిలాసము' ప్రసిద్ధ మైనది. ఇందలి 3-4 ఆశ్వాసములలో గౌరీకల్యాణము చెప్పఁబడినది. ప్రాయికముగాఁ గాళిదాసకుమారసంభవ శ్లోకములు తెనిఁగింపఁబడినవి. మొత్తము కుమారసంభవ మంతయు శ్రీనాథునిచే ననువదింపఁబడినచో నెంత బాగుండెడిదో! యన్నంత విధముగా నీరచన సాగినది.

శ్లో॥ మనీషితాః సంతి గృహేషు దేవతా
స్తపః క్వ? వత్సే! క్వచ? తావకం వపుః।
పదం సహేత భ్రమరస్య పేలవం
శిరీషపుష్పం న పునః పతత్రిణః॥ (కుమార - 5-4)

ఉ॥ ఎక్కడ లేరె వేల్పులు? సమీప్సితదాతలు ముద్దుఁగూన! నీ
వెక్కడ? ఘోరవీరతప మెక్కడ? యీ పటుసాహసిక్యముల్
తక్కు శిరీషపుష్ప మవధానపరత్వమునన్ మధువ్రతం
బెక్కిన నోర్చునో! విహగ మెక్కిన నోర్చునొ! నిశ్చయింపుమా! (హర-4-6)

శ్లో॥ అథాజినాషాఢధరః ప్రగల్భవాగ్
జ్వలన్నివ బ్రహ్మమయేన తేజసా!
వివేశ కశ్చిజ్జటిలస్తపోవనం
శరీరబద్ధః ప్రథమాశ్రమో యథా॥ (కుమార-5-30)

మ॥ అజినాషాఢధరుండు ప్రౌఢతరభాషాతిప్రగల్భుండు నీ
రజబంధుప్రతిమానతేజుఁడు జటారాజిచ్ఛటాతామ్రమూ
ర్ధజుఁ డేకాకి వటుండు బ్రాహ్మణుఁడు విశ్రామార్థముం బోలె నా
త్రిజగన్మోహనమూర్తి సన్నిధికి నేతెంచెన్ వనాంతంబునన్. (హర-4-15)





**3. వక్కలంక వీరభద్రకవి (18శ.) :**

కూచిమంచి తిమ్మకవికి సమకాలికు లగు కవులలో వక్కలంక వీరభద్రకవి ప్రధానుఁడు. ఇతఁడు రచించిన వాసవదత్తాపరిణయము - సుబంధుమహాకవి వాసవదత్తాగద్యకావ్యమున కనువాదము. రెండు మూఁడు ముద్రణము లంది ప్రచారము గాంచినది. ఈ కవి బాల్యమునందే కాళిదాసు కుమారసంభవము నాంధ్రీకరించినాఁడు.

తే॥గీ॥ చదువకే శ్రీసతీశప్రసాదగరిమ
బాల్యముననే కుమారసంభవము తెనుఁగుఁ
జేసి కవులెంచఁ బ్రఖ్యాతిఁ జెందితీవు
కలరె? నీ సము లాధునికులు కవీంద్ర! (వాసవ-1-27)

అని వాసవదత్తాపరిణయములోఁ జెప్పుకొనినాఁడు.

ఇది యింతవఱకు నముద్రితము. శ్రీకందుకూరి వీరేశలింగము పంతులు గారు కవులచరిత్రలో 4 పద్యములు నుదాహరించినారు.

శ్లో॥ ప్రత్యర్థిభూతామపి తాం సమాధేః
శుశ్రూషమాణాం గిరిశోఽ నుమేనే!
వికారహేతౌ సతి విక్రియంతే
యేషాం న చేతాంసి త ఏవ ధీరాః॥ (కుమార-1-59)

చ॥ హరుఁ డఖిలేశుఁ డద్వనరుహాక్షి తపఃప్రతిఘాతహేతువై
పరఁగిన తత్సపర్యలకు భావమునం గడు మెచ్చి యొప్పెఁ దా
నరయ వికారకారణము లంటిన నిశ్చలతం దనర్చు నె
వ్వరి హృదయారవిందములు వారలె ధీవరు లెంచి చూడఁగన్.

ఇతఁడు కొన్నితావులలో మల్లినాథుని సంజీవనీవ్యాఖ్యలోని విశేషములనుగూడ జోడించినాడు

శ్లో॥ వపుర్విరూపాక్షమలక్ష్య జన్మతా
దిగంబరత్వేన నివేదితం వసు।
వరేషు యద్బాలమృగాక్షి! మృగ్యతే
తదస్తి కిం? వ్యస్తమపి త్రిలోచనే॥ (కుమార-5-72)

శ్లో॥ 'కన్యా వరయతే రూపమ్ మాతా విత్తమ్ పితా శ్రుతమ్।
బాంధవాః కులమిచ్ఛంతి మృష్టాన్నమితరే జనాః॥

ఇతి లోకానా మాభాణకమ్। తత్ర కించిదపి నాస్తీత్యాహ-' అని మల్లినాథుని యవతారిక.

దీనిని వీరభద్రకవి యిట్లు తెలిఁగించినాఁడు -

ఉ॥ అన్ను తలంచు రూపము హితాళి తలంచుఁ గులంబు తల్లి దా
నెన్ను సువస్తువుల్ వరుల నేర్చు తఱిన్ బురవైరి నెంచినన్

గన్నులు మూఁడు పుట్టుటయె కానఁగ రాదు దిగంబరుండునుం
జిన్నము సొమ్ము లేదు తెలిసెం దగఁ డాతఁడు నీకు మానినీ!

దీని ప్రతి లభించినచోఁ బ్రకటింప వలసిన కావ్యము. వీరభద్రకవి స్కాందపురాణము నందలి సేతుఖండమును గూడ నాంధ్రీకరించినాఁడు. ఇది కూడ నముద్రితమే. సూర్యరాయాంధ్ర నిఘంటువు సేతుఖండము నుండి ప్రయోగములను స్వీకరించినది.

**4. మిన్నికంటి గురునాథ శర్మ (1960)**

మిన్నికంటి వారు సంస్కృతాంధ్రభాషాప్రవీణులు. వేదాంత విద్యా పారీణులు. గొప్ప యవధానులు. వీరు 'గౌరీకల్యాణ' మను ప్రబంధము రచించినారు. దీనిలో 6 ఆశ్వాసములు 607 పద్యములు గలవు. ఇది కాళిదాసకుమారసంభవమున కనువాదము కాదు. స్వతంత్ర రచనము. కాని కొన్ని తావులలోఁ గాళిదాస భావములు గలవు. కొన్ని కుమారసంభవ శ్లోకములు యథాతథముగా ననువదింపఁబడినవి.

శ్లో॥ ప్రభామహత్యా శిఖయేవ దీప
స్త్రిమార్గయేవ త్రిదివస్య మార్గః।
సంస్కారవత్యేవ గిరా మనీషీ
తయా స పూతశ్చ విభూషితశ్చ॥ (కుమార-1-28)

తే॥గీ॥ కాంతిశిఖ చేత దీపికాకళిక వోలె
గగనగంగచేఁ ద్రిదివమార్గమ్ము వోలె
శుద్ధసంస్కారవాక్కుచే సూరి వోలెఁ
బుత్త్రిచేఁ దండ్రి పూతుండు భూషితుండు. (గౌ.క-1-34)

శ్లో॥ కంపేన మూర్ధ్నః శతపత్రయోనిం
వాచా హరిం వృత్రహణం స్మితేన।
ఆలోకమాత్రేణ సురానశేషాన్
సంభావయామాస యథాప్రధానమ్॥ (కుమార - 7-46)

ఆ॥వె॥ హరిని మాట తోడ నంబుజాసనుఁ దల
యూపు తోడ హరిహయుని స్మితంబు
తోడఁ గడమ సురల వేడుక చూపుతో
నాదరించెను బ్రమథాధిపుండు. (గౌ.క.6-26)

దీనిలోఁ జిత్రకవిత్వము కూడఁ గలదు. ద్వ్యక్షరి ( మ-న)

కం॥ మేనా నామమ్మున ము - న్మౌనీనానూన మాననన్మన్న నమ
న్నానాముని మానిని నను - మానమ్మును మాని మాని మనమున నూనెన్. (గౌ.క.-1-11)

5



**సప్తస్వరకందము :**

కం॥ మాపని సరిగాఁగాఁగని - మాపాపారి గరిమపసమాపఁగఁ దగదా
పాపారిగదా నీ గద - మాపా నిగమపదపాద మానిసదాదా. (గౌ.క.6-57)

దీనిలో 'దా'కు బదులుగా 'ధ' వర్ణమును వాడినచో బాగుండెడిది.

'స-రి-గ-మ-ప-ధ-ని' సప్తస్వరములు ధ = ధైవతము.

చక్రబంధద్వయ - మాలికాబంధ - గోమూత్రికాబంధగర్భము :

ప్రమాణి॥ హరా సురా సురా దరా। పరాత్పరా గరా ద్మరా।
ధర ధరా కరా వరా। అరాళరాజరాద్ధరా!
స్థిరా జరా మరా క్షరా। పురా సురా సురా జిరా
స్థిరా ధురా హరా పరా। పురా గిరా స్తరా కరా! (గౌ.క.6-62)

ఈ గౌరీకల్యాణము శ్రీ దివాకర్ల వెంకటావధాని గారి వంటి విద్వద్విమర్శకుల ప్రశంసల నొందిన కావ్యము.

1. గురుభాగవతము (11-12 స్కంధములు) 2. భాగవతమహిమ 3. దత్తాత్రేయశతకము 4. అడవిపువ్వులు మొదలగునవి శ్రీమన్నికంటి శర్మగారి యితరరచనలు.

**5. చర్ల గణపతిశాస్త్రి (1909-1996)**

'కవిసార్వభౌమ' శ్రీశ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారి వలెఁ; 'గవిసమ్రాట్' శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారివలె; మహామహోపాధ్యాయ 'శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుఁడు గారి వలె శ్రీ గణపతిశాస్త్రిగారు శతాధికగ్రంథకర్తలు. 'కళాప్రపూర్ణ' బిరుదాంకితులు. కేంద్రసాహిత్య అకాడమీ బహుమానగ్రహీతలు. సంస్కృతాంధ్రములలో నుద్దండపండితులు. బహుభాషాకోవిదులు. వీరు రచించినవి సుమారు 30 గ్రంథములు నా యొద్దఁ గలవు. వీరి తండ్రి గారగు శ్రీ చర్ల సూర్యనారాయణ శాస్త్రి గారు 'నారాయణీయాంధ్రవ్యాకరణము'ను బద్యములలో రచించిరి. ఇది సంపూర్ణాంధ్రవ్యాకరణము. వీరు రచించిన 'సాహిత్యసౌందర్య దర్శనము' సమగ్రాలంకారశాస్త్రము. వీరి 'దర్శనములు-దర్శనకర్తలు' శ్రీమాధవాచార్యుల సర్వదర్శనసంగ్రహమున కాంధ్రానువాదము. షడ్దర్శన సూత్రగ్రంథములకు వ్యాఖ్యలు రచించిరి. వేద-ధర్మశాస్త్ర-వ్యాకరణ-ఉపనిషద్ గ్రంథముల నాంధ్రభాషలో వెలయించిరి. అనేక పద్యకావ్యములు, నాటకములు, శతకములు వీరిచేఁ దెనిఁగింపఁబడినవి.

వీరు 'కుమారస్వామివిజయము'ను (1977) రచించిరి. దీనిలోఁ గుమారసంభవము నందలి మొదటి 8సర్గములు యథామాతృకగా ననువదింపఁబడినవి. 9వ సర్గములోఁ దారకాసురవధ వఱకుఁ గల కథ సంగ్రహముగాఁ జెప్పఁబడినది.

శ్లో॥ అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా
హిమాలయో నామ నగాధిరాజః।
పూర్వాపరౌ వారినిధీ విగాహ్య
స్థితః పృథివ్యా ఇవ మానదండః॥ (కుమార-1-1)

తే॥గీ॥ ఉత్తరపు దిక్కున హిమాలయుం దనంగ
దేవతామూర్తి యొక పర్వతేశుఁ డుండె
అతఁడు దిగి తూర్పు పడమర యబ్ధు లందు
భూమి కొలిచెడి కొలకొఱ్ఱు వోలె నుండె. (కు.సం. 1-8)

శ్లో॥ తం వీక్ష్య వేపథుమతీ సరసాంగయష్టి
ర్నిక్షేపణాయ పదముద్ధృతముద్వహంతీ।
మార్గాచలవ్యతికరాకులితేవ సింధుః
శైలాధిరాజతనయా న యయౌ న తస్థౌ॥ (కు.సం. 5-85)

మ॥ అతనిం జూచి వణంకుచున్ గిరి భావైక్యంబునన్ జెమ్మగి
ల్లు తనూవల్లిక తోడఁ బోవుటకుఁ గాలున్ బైకి వే యెత్తి యా
గతి నిల్వంబడి కొండ యడ్డుపడ మార్గంబందు వెన్వెన్క వై
పు తటాల్నన్ దిరుగాడు పెన్నది వలెన్ బోలేదు నట్లుండదున్. (కు.వి 5-62)

1. రఘువంశలహరి 2. మేఘసందేశము 3. బుద్ధచరిత్ర 4. వర్ధమానమహావీరచరిత్ర 5. బిల్హణవిలాసము 6. శ్రీకృష్ణహృదయామృతము 7. నీలకంఠవిజయము 8. హరిహరమహిమ్నఃస్తోత్రము 9. మహిషశతకము మొదలగునవి వీరి పద్యకావ్యములు. 10. మధురశాకుంతలము 11. భర్తృహరినిర్వేదము మొదలగునవి నాటకములు. 12. భారతమాత 13. శాసనంలేని రాజ్యం 14. ఝాన్సీరాణి మొదలగునవి నాటికలు.

చర్ల వారి సాహిత్యసృష్టి బహుముఖీనము. ఇట్టి గ్రంథములు ప్రచారములో లేక మఱుఁగునఁ బడిపోవుటకుఁ బ్రధాన కారణము మన యాంధ్రులకు సాహిత్యము పట్ల నున్న నిర్లక్ష్యము.

**6.మల్లంపల్లి శరభయ్య (20శ.) :**

శ్రీ శరభేశ్వరశాస్త్రిగారు కాశీఖండ-మణికర్ణికావ్యాఖ్యాతలుగా విఖ్యాతి నొందినారు. శ్రీవిశ్వనాథవారికి నసుంగు ననుయాయులు, వీరు కుమారసంభవమునకు గద్యానువాదము గావించినారు. ఇది పెక్కుతడవలు 11,12 తరగతుల విద్యార్థులకుఁ బాఠ్యాంశముగా వన్నె కెక్కినది.

ప్రస్తుతము పాఠకుల కరకమలముల నలంకరించినది కూచిమంచి సాంబశివకవి యాంధ్రకుమారసంభవము.

**కూచిమంచికవులు**

ఆంధ్రసాహిత్యములోఁ గూచిమంచి కవులకుఁ బ్రత్యేకస్థానము గలదు. కూచిమంచి వారి కుటుంబములు గోదావరీ మండలములో నెక్కువగా విస్తరించినవి. కోనసీమ యందలి యమలాపురములోఁ గూచిమంచి వారి యగ్రహారము ప్రత్యేకముగాఁ గలదు.





'కవిత పుట్టిల్లు వెన్నెలకంటి యిల్లు' అని చెప్పినట్లే 'వాణి పుట్టిల్లు కూచిమంచి వారి యిల్లు' అని చెప్పవచ్చును. ఆంధ్ర వాఙ్మయమునకుఁ గూచిమంచి కవులు గావించిన సేవ సాటి లేనిది.

హరదత్తుఁడు సంస్కృతములో వామన-జయాదిత్యులు రచించిన 'కాశికా' వృత్తికిఁ 'బదమంజరి' యను బృహద్ వ్యాఖ్యను సంతరించినాఁడు. ఇతఁడు గౌతమధర్మసూత్రములకు నాపస్తంబకల్పమునకుఁ గూడ వ్యాఖ్యలు రచించినాఁడు. ఆంధ్రుఁడు. ఇతఁడు పదమంజరిలో దేశ్యపదములను గూర్చి చెప్పు సందర్భములో - 'కూచీ-మంచీత్యాదయః' అని యుదాహరించినాఁడు. హరదత్తుని కాలము 11వ శతాబ్దము. దీనినిబట్టి 11వ శతాబ్ది నాఁటికే కూచిమంచి వారి కుటుంబములాంధ్రదేశములో నెలకొన్న వని తెలియుచున్నది. ఈ కూచిమంచి కవులను గూర్చి శ్రీబుద్ధవరపు మహాదేవకవి రచించిన యాంధ్రమాఘమునకు నేను రచించిన 'భూమిక' (1974)లోఁ గొంత వివరించితిని. శ్రీకూచిమంచి వేంకటరాయఁడు రచించిన సుకవిమనోరంజనమునకు శ్రీకోవెల సంపత్కుమారా చార్యులు రచించిన పీఠిక (1982)లోఁ గొంత వివరించిరి.

**1. కూచిమంచి తిమ్మకవి (17-18శ.)**

ఇతఁడు పిఠాపుర శ్రీ కుక్కుటేశ్వరస్వామి భక్తుఁడు. దెందులూరి లింగనారాధ్యుల శిష్యుఁడు. వక్కలంక వీరభద్రకవి సహాధ్యాయుఁడు. అనేక మృదుమధుర ప్రబంధములు రచించినవాఁడు.

| | | | |
|---|---|---|---|
| 1. | రాజశేఖరవిలాసము | 2. | రుక్మిణీపరిణయము (1715) |
| 3. | సింహశైలమాహాత్మ్యము | 4. | నీలాసుందరీపరిణయము |
| 5. | అచ్చతెలుగు రామాయణము | 6. | ద్విపద సారంగధరచరిత్ర |
| 7. | సాగరసంగమాహాత్మ్యము | 8. | లక్షణసారసంగ్రహము (1740) |
| 9. | రసికజనమనోఽభిరామము | 10. | సర్పపురమాహాత్మ్యము |
| 11. | శివలీలావిలాసము (1756) | 12. | కుక్కుటేశ్వరశతకము |
| 13. | చిరవిభవశతకము | 14. | భర్గవశతకము |
| 15. | శ్రీకృష్ణదండకము | | |

మొదలగునవి యితని కృతులు. ఇతఁడు సర్వలక్షణసారసంగ్రహమును రచించి 'యభినవవాగనుశాసన' బిరుదము నందినాఁడు. రావు నీలాద్రి నృపాలునిచేఁ 'గవిసార్వభౌమ' బిరుదము పొందినాఁడు. తిమ్మకవి వార్ధకములో దేహము చాలించుటకు మూఁడు దినములు ముందు సన్న్యసించి 'శివరామతీర్థ' నామముతో శ్రీకుక్కుటేశ్వరస్వామిని సేవించి దివ్యపదము నలంకరించినాఁడు.

కం॥ హాటకగర్భవధూలీ - లాటనచలితాంఘ్రినూపురావశ్రీ
పాటచ్చరములు తేనియ - తేటలు మా కూచిమంచి తిమ్మయ మాటల్.

**2. కూచిమంచి జగ్గకవి (18శ.)**

ఇతఁడు తిమ్మనకవి తమ్ముఁడు.

| | | | |
|---|---|---|---|
| 1. | జానకీపరిణయము | 2. | సుభద్రాపరిణయము |
| 3. | నర్మదాపరిణయము | 4. | ఉమాసంహిత |
| 5. | సోమదేవపరాజీయము | 6. | చంద్రరేఖావిలాపము |
| 7. | రాధాకృష్ణచరిత్ర – ద్విపద | 8. | భక్తమందారశతకము |

మొదలగునవి వీని రచనలు. వీనిలోఁ 'జంద్రరేఖావిలాపము' తిట్టుకావ్య మైనను బ్రచురప్రచారము గాంచినది. దీని వ్రాఁత ప్రతు లింటింట నుండెడివి. దీనికి మూఁడు నాల్గు ముద్రణములు గలవు.

**3. కూచిమంచి గంగకవి (18శ.) :**

ఇతఁడు జగ్గకవి కుమారుఁడు. 'తారకబ్రహ్మరామాయణము'ను రచించినాడు.

**4. కూచిమంచి రెండవ తిమ్మకవి (19శ.) :**

ఇతఁడు కూచిమంచి జగ్గకవి మునిమనుమఁడు.

1. వాసవదత్త (తెలుఁగు) 2. కాదంబరి (తెలుఁగు)
3. సుజనమనఃకుముదచంద్రిక (సంస్కృతము) ఇతని రచనలు.

**5. కూచిమంచి వేంకటరాయఁడు (19శ.) :**

ఇతఁడు రెండవ తిమ్మకవి మనుమఁడు. సుప్రసిద్ధ 'కవిసార్వభౌమ' తిమ్మకవికి 6వ తరము వాఁడు. ఇతఁడు 'సుకవిమనోరంజన' మను లక్షణగ్రంథమును రచించినాఁడు. దీనిలో నప్పకవీయమును, అహోబలపండితీయమును దీవ్రముగా విమర్శించినాఁడు. తన సిద్ధాంతముల కనుగుణముగా ననేకప్రాచీనగ్రంథముల నుండి యపురూపములైన ప్రయోగముల నుదాహరించినాఁడు. తెలుఁగు లక్షణ గ్రంథములలో నిదియే చివరిది.

**6. కూచిమంచి సోమసుందరకవి (19శ.) :**

వీరు పలివెల వాస్తవ్యులు. 1. భక్త చింతామణి శతకము 2. శ్రీ కొప్పులింగేశ్వరశతకము 3. శ్రీ కొప్పులింగేశ్వర దండకము 4. శ్రీ కొప్పులింగేశ్వరకీర్తనలు వీరి రచనలు.

**7. కూచిమంచి సాంబశివకవి (20శ.) :**

ఇతఁడు సోమసుందరకవి పెద్ద కుమారుఁడు. ప్రస్తుత గ్రంథకర్త. వీరిని గూర్చి తరువాత విన్నవింతును.

**8. కూచిమంచి (బుద్ధవరపు) మహాదేవకవి (1889–1968) :**

ఇతఁడు సోమసుందరకవి మూఁడవ కొడుకు. సాంబశివకవి తమ్ముఁడు. బుద్ధవరపు వారు దత్తునిగా స్వీకరించుటచే బుద్ధవరపు మహాదేవకవి యైనాఁడు.

1. ఆంధ్రమాఘము (శిశుపాలవధ) 2. సూతసంహిత
3. భోజచంపూరామాయణము 4. కువలయానందము





వీరి రచనలు. వీరి యాంధ్రమాఘము బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి గారి పరిష్కరణములో వెంపరాల వారి 'సమీక్ష'తో నేను రచించిన 'భూమిక'తో 1974లోఁ బ్రకటింపఁబడినది. సూతసంహితను నేను పరిష్కరించి, శేషపూరణము గావించి 'న్యాసము'ను రచింపఁగా 1984లో వారి కుమారులచేఁ బ్రచురింపఁబడినది. భోజరామాయణమును ముద్రణమునకు సిద్ధము చేయుచున్నాను. కువలయానందము లభింపవలసియున్నది.

**9. కూచిమంచి వేంకటశాస్త్రి (1954) :**

ఇతఁ దమలాపురవాస్తవ్యుఁడు. 1. చంద్రమౌళీశ్వరశతకము 2. శ్రీవేంకటేశ్వర శతకము వీరి రచనలు.

**కూచిమంచి సాంబశివకవి (20శ.) :**

మహాదేవకవికి (1889) వీ రన్నగారు. వారి కంటె వీరు 4 సంవత్సరములు పెద్ద యైనచో వీరి జననము సుమారు 1885 అగును. వీరు కుమారసంభవమును (8సర్గములు) 1926లోఁ బ్రకటించిరి. తక్కిన కావ్యమును దరువాతఁ బూర్తి చేసిరి. వ్రాఁత ప్రతిలో 9 సర్గము చివర compared by brother 30–5–30 అని కలదు. తక్కిన 9 సర్గములను రచించుటకు 9 సంవత్సరములు పట్టిన వనుకొన్నచో దీని రచనాకాలము 1920–1940 అనియు; వీరి జీవితకాలము సుమారు 1885–1960 అనియు నిర్ణయింపవచ్చును. వీరు కొత్తపేఁట, అమలాపురము మొదలగు తావులలో నున్నతపాఠశాలలలో నుపాధ్యాయులుగా నుద్యోగించిరి. వీరి కనర్ఘరాఘవము, లక్ష్మీసహస్రము వంటి యుత్తమ సాహిత్యగ్రంథములు జిహ్వాగ్రమున నుండెడి వని వాడుక. కనుకనే కుమారసంభవము వంటి మహాకావ్యమును సుందరముగాఁ దెనిఁగింపఁ గలిగినారు. ఇది కాళిదాసు 17 సర్గముల కావ్యమునకు సంపూర్ణానువాదము. శ్లోకమునకుఁ బద్యము చొప్పున యథామాతృకానువాదము. నిర్వచన కావ్యము. కొన్నిచోట్ల నొకే శ్లోకమునకు రెండేసి యనువాద పద్యములు గలవు. ఇప్పుడీ యాంధ్రకుమారసంభవము పాఠకుల చేతిలో నున్నది గావున సంస్కృత మూలముతోఁ బోల్చి తులనాత్మకముగాఁ బరిశీలించుకొనవచ్చును.

తిక్కనగారి భారతము నందలి స్త్రీపర్వములో వలె; నిందలి 16వ సర్గములో ఛందోవైవిధ్యము మిక్కుటముగాఁ గలదు. దీని కొక కారణము గలదు. కూచిమంచి సాంబశివకవి పూర్వులలో (ముత్తాత తండ్రి) గోపాలకృష్ణ మంత్రి పలివెలకుఁ గరణముగా నుండెడి నాఁడు. ఇతఁడు పరులయనేకభూములనాక్రమించినాఁడు. ఈ భూస్వాములలో నేనుఁగులమహలు వాస్తవ్యుఁడగు కనకదండి రామస్వామియొకరు. వీరి మామగారు కోటిపల్లి వాస్తవ్యు లగు శ్రీపన్నాల బ్రహ్మయశాస్త్రిగారు. బ్రహ్మయశాస్త్రి తన యిల్లుని భూమి నాక్రమించిన కూచిమంచి గోపాలకిష్టమ్మను దూషించుచు 'ఖలకర్ణవిషాయణ' మను నధిక్షేపద్వ్యర్థి కావ్యమును రచించెను. దీనిలో రామాయణకథ, కవికథ జోడింపఁబడినవి. ఇది పిండిప్రోలు లక్ష్మణకవి రచించిన 'రావణదమ్మీయము' (లంకావిజయము) వంటి కావ్యము. దీనిలో బ్రహ్మయశాస్త్రి గారు సుమారు 40 విశేషచ్ఛందస్సులను వాడినారు. దానితో స్పర్ధగాఁ గూచిమంచి సాంబశివకవి కూడ సుమారు 40 విశేషచ్ఛందస్సుల నుపయోగించినాఁడు. ఈవిధముగా ఛందోదృష్టితోఁ గడ నీకుమారసంభవమున కాంధ్రసాహిత్యములో విశిష్టస్థానము గలదు. ఇప్పుడిందలి ఛందస్సులను గ్రమముగాఁ బరిశీలింతము.

**కుమారసంభవచ్ఛందస్సులు**

**1. అర్ధపంచచామరము -1 (జ-ర-ల-గ)**

పరస్పరప్రమాపితుల్ (16-48)

దీనికే 'ప్రమాణి(కా)' వృత్త మని పేరు. ప్రమాణిలోఁ బ్రతిపాదమునందు 'జ-ర-ల-గ' - గణము లుండును. యతినియమము లేదు. పంచ చామరములోఁ బ్రతిపాదమునందు 'జ-ర-జ-ర-జ-గ' - గణములుండును. ప్రమాణి పంచచామరములో సగ ముండుటచే దీని **నర్ధపంచచామర** మని సాంబశివకవి పేర్కొనినాఁడు.

'ప్రమాణికన్ జరల్ లగల్' అని చిత్రకవి పెద్దన లక్షణసారసంగ్రహము.

**2. ఆటవెలఁది (3సూ.2ఇం; 5 సూ)**

బాల్యమునను జదువు -ప్రథమ యౌవనమున
సరసకావ్యరచన - నెర పరువున
రాజసేవ యివల - బ్రాణమున్నంతకు
నుపనిషద్విచార - యోగనిష్ఠ (అవతా-64)

ఆటవెలఁదిలో బేసి (1,3) పాదములందు 3 సూర్యగణములు; 2 ఇంద్రగణములు; సరి (2,4) పాదములలో 5 సూర్యగణములు నుండును. 'న-హ' - ఇవి సూర్యగణములు. 'నల-నగ-సల-భ-ర-త'- ఇవి యింద్రగణములు. నాల్గవ గణము మొదటి యక్షరము యతి స్థానము. ప్రాసయతి చెల్లును. ప్రాసనియమము లేదు.

సూర్యుఁ డొక్కరుండు - సురరాజు లిద్దఱు
దినకరద్వయంబు - తేటగీతి
ఇనగణత్రయంబు - నింద్రద్వయంబును
హంసపంచకంబు - **నాటవెలఁది** అని లక్షణము.

**3. ఇంద్రవజ్రము - 1 (త-త-జ-జ-గ-గ-8)**

సారంబులౌ కాళుల - సాళువంబుల్ (16-28)

**'ఇత్తాజగాలై తగు - నింద్రవజ్రన్'** - అని లక్షణసారసంగ్రహము.

8వ యక్షరము యతిస్థానము.

**4. ఇంద్రవంశస్థము -1 (త-త-జ-ర-8)**

వేదండముల్ చండత- వీఁకఁ దాఁక నెం. (16-29)

**'ఈ తాజముల్ రేఫయు - నింద్రవంశకున్** - ల.సా.సం

ఇది యింద్రవంశ మని లాక్షణికులు చెప్పినారు. ఇంద్రవంశస్థ మని సాంబశివకవి పేర్కొనినాఁడు.

**5. ఉత్సాహ -3 (5-85) (8-91) (12-60) (7సూ 1గ)**

అతనిఁ గాంచి జలదరించి - యంగలత సెమర్పఁగా (5-85) - **ఉత్సాహములోఁ**





బ్రతిపాదమునందు 7 సూర్యగణములు (న-హ) 1 గురువు నుండును. 5వ గణము మొదటి యక్షరము యతిస్థానము.

గ్రాహవైరి యిర్వు రినులు - గలసి యైన వేఱుగాన
నీహఁ గూర్చి యైన గణము - లేడు చేసి గురువుతో
నాహితోక్తి నాల్గుగణము - లైన యతులు గూర్చ **ను**
**త్సాహ** యయ్యె విషమసీస - సంజ్ఞ నిది వహింపఁగాన్ - ల.సా.సం.

**6. ఉత్పలమాల (భ-ర-న-భ-భ-ర-వ-10)**

ఆ లసమానధీనిధికు - లాబ్ధి జనించిరి లోకవేదవిన్ (అవ-26)
పంకజభూయతుల్ - భరనభారవ **లుత్పలమాలికన్** దగున్ - ల.సా.సం.

**7. ఉత్సుకము (భ-భ-ర)**

వారణదంతయుగం బసిన్ (16-39)
భారల **నుత్సుక**మౌఁ గృతిన్ - ల.సా.సం. దీనికి యతి లేదు.

**8. ఉపేంద్రవజ్రము -1 (జ-త-జ-గ-గ-8)**

సితాసి నిర్దారిత - శీర్షులైరా (16-26)
కృతిన్ జతజ్జల్ గ **ము - పేంద్రవ్రజన్** - ల.సా.సం.

**9. కవిరాజవిరాజితము -1 (న-జ-జ-జ-జ-జ-జ-వ-8-14-20)**

అపుడు పురాంతకు - నల్క భయంపడి - యక్షినిమీలన - మంది కదున్ (3-76)
ప్రతిరసషడ్యతి - రా నము షడ్జ్వలు - రాఁ **గ విరాజవి- రాజితమునే** - ల.సా.సం.
ప్రతిపాదమునందు 3 యతులు.

**10. కందము : (3 + 5. గగ-భ-జ-స-నల)**

కందములో బేసి (1,3) పాదములలో 3 గణములు; సరి (2,4) పాదములలో 5 గణములు నుండును. అనఁగాఁ బూర్వార్ధములో 8 గణములు, నుత్తరార్ధములో 8 గణములు నుండును. అవి, గగ-భ-జ-స-నల- గణములలో నేవి యైనను గావచ్చును. బేసిగణముగా జగణమును వాడఁగూడదు. 6వ గణము 'నల' ముగాని; 'జ' గణము గాని యుండవలయును. 2,4 పాదములు గురువుతో ముగియ వలయును. 2-4 పాదములలో 4వ గణము మొదటి యక్షరము యతిస్థానము. ప్రాస నియమము గలదు.

కం॥ అగు నేను గులాచారా - నుగతిన్ గవితాకళావి-నూత్నాభ్యాస
ప్రగుణాభిలాష నుండెడి - పగిదిఁ గనుంగొనుచుఁ దాత-పాదులు నెమ్మిన్. (అవ-3)

కం॥ గగభజసనలము లేనునె -యగు దీనికి నొండు గణములమరవు బేసిన్
జగణము గా దిలలో నా - అగు నెడ నలమైన జగణమైనన్ నిలుచున్.
ల.సా.సం.

**11. చంద్రకళ -1 (న-న-ర-ల-గ-9)**

హతు లయి రథులా ర - థాధ్యబా (16-46)

దీనిని 'భద్రిక' యని లాక్షణికులు పేర్కొనిరి.

ననరవలు పె-నంగు భద్రికన్. ల.సా.సం.

లాక్షణికుల మతములో 7వ యక్షరము యతిస్థానము.

సాంబశివకవి 9వ స్థానములో యతి నుంచినారు. 1-3-4 పాదములలో 7వ స్థానములోఁ గూడ యతి కలదు. అప్పకవి 7వ యతిస్థానము గల దానిని 'భద్రక' మని 9వ యతిస్థానము గల దానిని 'చంద్రిక' యని పేర్కొనినాఁడు.

**12. చంద్రవర్మ -1 (ర-న-భ-స-7)**

వైరికుంతహతిఁ - బాసియు నుసుఱుల్ (16-42)

**చంద్రవర్మ** యనఁ - జన్ రన భసలన్. ల.సా.సం.

**13. చంద్రిక - 1 (న-న-ర-ల-గ-7)**

త్వరఁ గరి తనుఁ - బట్ట రా రుషన్ (6-38)

దీనిని గూర్చి చంద్రకళలోఁ జెప్పఁబడినది. చంద్రకళ భద్రిక - భద్రకము - చంద్రిక - వీనిలో గణములు సమానమే. యతిస్థానములలో మార్పులు గలవు.

**14. చంపకమాల (న-జ-భ-జ-జ-జ-ర-11)**

అతనిని లేఁగగాఁ గొని న - గాగ్రణు లెల్లను ధేనురూపసం. (1-2)

నజభజజార దిగ్విరమ - ణంబులఁ **జంపకమాలికం** దగున్. ల.సా.సం.

**15. జలోద్ధతగతి -1 - (జ-స-జ-స-8)**

అరాత్యసిహృతాసు - నాశ్వికవరున్ (16-43)

**జలోద్ధతగతిన్** జ - సంబులు జసల్. ల.సా.సం.

**16. తరలము - 3 (1-62) (2-64) (5-86) (న-భ-ర-స-జ-జ-గ-12)**

నిరతి నిత్యసుకృత్యరాజికి - నీరదర్భల పూజకై (1-62)

భవయతిన్ **దరళం** బెసంగు న - భంబులున్ రసజాగముల్. ల.సా.సం.

**17. తేటగీతి** (1సూ + 2 ఇం + 2సూ. 4 గణము మొదటియక్షరము యతి.)

వరకవిత్వప్రపంచధూ-ర్వహనసహత (అవ-7)

దీని లక్షణ మాటవెలఁది లక్షణములో నంతర్గత మైనది.

**18. తోటకము -2 (16-32) (16-45) (స-స-స-స-9)**

ఉరురోషమిథోమిళ - దుద్ధతకుం (16-32)

తుది దాఁక ససాసలఁ - **దోటకమౌ**. ల.సా.సం.





**19. తోదకము -1 (భ-భ-భ-గగ-7)**

ఎక్కుచుఁ బోరియె - పెక్కుర తోడన్ (16-20)

**తోదక** భాభల - తో గగ మొందున్. ల.సా.సం.

ఇది 'దోదక' మని యప్పకవి. దీనికే 'పాదప' మని నామాంతరము.

**20. దోధకము -1 (న-జ-జ-య-8)**

నిరవధికాగ్రధు - నీఝరి నుచ్చైః (16-25)

అగయతి **దోధక** - మయ్యె నజాయల్. ల.సా.సం.

దీని నప్పకవి తోదక మనినాఁడు. దీని పేరే 'తామరస' మని చిత్రకవి పెద్దన చెప్పినాఁడు.

**21. ద్రుతవిలంబితము -1 (న-భ-భ-ర-10)**

తను బొరింగొన వచ్చెడు - దండి జె(ట్టి) (16-19)

**ద్రుతవిలంబిత** - దోఁచు నభారలన్. ల.సా.సం.

లాక్షణికులు 7వ స్థానములో యతిని విధించిరి.

సాంబకవి 10వ స్థానములో యతిని బాటించెను.

**22. ధ్రువకోకిల -3 (11-50) (12-61) (14-51) (న-భ-ర-స-జ-జ-గ-12)**

అమితనైకవిధం బపూర్వము - నంద మింపును మోదసాం (11-50)

ఇది 'తరళ' వృత్తమే. 'ధ్రువకోకిల' యని సాంబశివకవి వ్యవహరించినాఁడు. 'మత్తకోకిల' యందలి మొదటి గురువును రెండు లఘువులు చేసినచో 'ధ్రువకోకిల' (తరళ) యగును.

**23. పంచచామరము 6 (4-45) (5-87) (7-95) (7-96)(8-92) (14-50) (జ-ర-జ-ర-జ-గ-10)**

కనంగ రాని రూపుతో నొ - కానొకం డటంచుఁ గా (4-45)

లగాష్టకాత్మ భూయతుల్ చె - లంగుఁ **బంచచామరన్**. ల.సా.సం.

పంచచామరలో 8 లగములు వచ్చు నని చిత్రకవి పెద్దన చెప్పినాఁడు. ఎట్లు చెప్పినను గణములు సమానమే.

**24. ప్రభాతము -1 (న-జ-జ-ర-గ-8)**

పగులఁగఁ గంచుక - పాళి రోమహర్షో (17-54)

మొనసిన జారగ - ముల్ తగుం **బ్రభాతన్**. ల.సా.సం.

**25. ప్రమితాక్షర -1 (స-జ-స-స-9)**

గురునాగముల్ పెనఁగఁ - గూడఁ బర(స్ప) (16-31)

**ప్రమితాక్షరన్** సజస-పంక్తి సమున్. ల.సా.సం.

**26. ప్రహేయము -1 (న-న-మ-య-7)**

అతిరథయుగ - మన్యోన్యార్ధచంద్రా (16-49)

అగయతులఁ బ్రహే - **యం** బయ్యె నామ్యల్. ల.సా.సం.

**27. ప్రియంవద - 1 (న-భ-జ-య-8)**

కరటు లెత్తి దవుఁ గా దివిఁ జిమ్మన్ (16-34)

నభజరల్ దగు వి- నం **బ్రియంవదన్.** ల.సా.సం.

ప్రియంవదలోఁ బ్రతిపాదమునందును 'న-భ-జ-ర' గణము లుండును. కాని సాంబశివకవి 'న-భ-జ-య' గణములు వాడినాఁడు.

దీని లక్షణము తెలుఁగు ఛందోగ్రంథములలో లేదు. ఇది 'కలహంసా' వృత్త మని హేమచంద్ర - జయకీర్తులు ఛందోஉనుశాసనములలోఁ జెప్పినారు. (వృత్తమౌక్తికపరిశిష్టము - 5. పుట 486.)

**28. భద్రకము -1 (ర-న-ర)**

చండతుండిగురుశుండచే (16-40)

**భద్రకంబు** రనరంబులన్. ల.సా.సం.

దీనికి యతినియమము లేదు. పాదమునకు 10 అక్షరములు గల పంక్తిచ్ఛందము నుండియే యతినియమ మారంభమైనది. దీనికి విద్యున్మాలాదు లపవాదములు.

**29. భుజగశిశురుతము - 1** (న-న-య)

కరులు దివికిఁ బదాతో (16-36)

**భుజగశిశురుతన్ నామల్.** ల.సా.సం.

భుజగశిశురుతములో'న-న-మ'-గణములుండునని చిత్రకవి పెద్దనచెప్పినాఁడు

నిజమున 'ననయ' లొప్పన్

**భుజగశిశురుత** మయ్యెన్.

అని యప్పకవి 'న-న-య' గణములు చెప్పినాఁడు. సాంబశివకవి యప్పకవి ననుసరించినాఁడు. దీని పేరు 'భుజంగశిశురుత'మని కూడ నప్పకవి పేర్కొనినాఁడు. దీనిలో యతినియమము లేదు.

**30. భుజంగప్రయాతము - 1 (య-య-య-య-8)**

అసిచ్ఛిన్నులైనన్ ని - జారోహకుల్ బల్ (16-30)

యయాయల్ **భుజంగప్ర - యాతన్** వడేళ్ళన్. ల.సా.సం.

**31. మత్తకోకిల - 4 (3-77)(4-47)(10-60) (16-51) (ర-స-జ-జ-భ-ర-11)**

సోమసుందర ధైర్యమందర - సూరిలోకపురందరా (3-77)

మారుతీ! రసజాభరల్ తగు - **మత్తకోకిల** దిగ్యతిన్. ల.సా.సం.

**32. మత్తేభవిక్రీడితము (స-భ-ర-న-మ-య-వ-14)**

అమరాంధ్రాంగలవాగజప్రపరిచ - ర్యాధుర్యుఁడన్గూచిమం (అవ-2)

వడి పద్మూట సభల్ రనల్ మయవలున్ -వైపొందు **మత్తేభకున్.** ల.సా.సం.





**33. మనోరమ - 1 (న-ర-జ-గ)**

రథి నిజోరుశస్త్రమూర్ఛితున్ (16-47)

నరజగల్ దగున్ **మనోరమన్.** ల.సా.సం. దీనికి యతి నియమము లేదు.

**34. మయూరసారి - 1 (ర-జ-ర-గ-7)**

శ్వేతధారహేతి - భిన్నతుండి (వ్రా) (16-35)

రజ్రగల్ **మయూర - సారి** కొప్పున్. ల.సా.సం.

**35. మహాస్రగ్ధర - 1 (స-త-త-న-స-ర-ర-గ-9-16)**

వరసంతానప్రసూనా - వళి పఱచిన పెన్ - బాట లొప్పారుచుండన్ (7-3)

కరిమౌనుల్ వళ్ **మహాస్ర-గ్ధర** సతతనసల్ -గల్గి రాగంబు లుండున్. ల.సా.సం.

**36. మంగళమహాశ్రీ - (భ-జ-స-న-భ-జ-స-న-గ-గ-9-17)**

ఈ రహిని జిష్ణుఁ డస - మేషుహరసూనువరుఁ డేడ్తెఱ సమిద్ధరణినెంతే (17-55)

ఆ భసనద్వయగ - గాన్వితములై యతి గ - జాహులగు **మంగళమహాశ్రీ.** ల.సా.సం.

**37. మాలిని - 6 (4-46)(6-95)(9-52)(10-61)(12-58) (16-18) (న-న-మ-య-య-9)**

తను వటఁ బెను వంతన్ - దద్దయుం గార్శ్య మందన్. (4-46)

మహి గజయతి మించెన్ - **మానినిన్** నామయాప్తిన్. ల.సా.సం.

**38. రథోద్ధతము (?) - 2 (12-59)(16-23)(ర-న-భ-గగ-7)**

ఆనతాత్మ శిర- మం దల సూనుం (12-59)

దీనిని **రథోద్ధత** మని సాంబశివకవి పేర్కొనినాఁడు. దీనిలోఁ బ్రతిపాదమునందు 'ర-న-భ-గగ' గణములు గలవు. ఇది స్వాగతవృత్తము గాని రథోద్ధతము గాదు.

**స్వాగతన్** రనభ-సంగగగంబుల్ ల.సా.సం.

స్వాగతములోఁ బ్రతిపాదమునందు 'ర-న-భ-గగ' గణము లుండును.

రెండవ పద్యము మాత్రము రథోద్ధతమే.

వీరఘోరరవ - భీతిచే మహా (16-23)

ఆ రనల్ రవము - లౌ రథోద్ధతన్. ల.సా.సం.

రథోద్ధతములోఁ బ్రతిపాదమునందు 'ర-న-ర-వ' - గణము లుండును.

**39. రుగ్మవతి - 1 (భ-మ-స-న-6)**

వైరి శితాగ్ర - ప్రాసహితుండై (16-44)

**రుగ్మవతిన్** బే -ర్చున్ భ్మసనంబుల్. ల.సా.సం.

**40. వసంతతిలకము - 1 (త-భ-జ-జ-గగ-8)**

కోదండి సాదుల ల - కోరులఁ దాము నొంచన్ (16-37)

కల్గున్ **వసంతతిలకన్** దభజాగగంబుల్. ల.సా.సం.

దీనికే 'సింహోద్ధతము'; 'ఉద్ధర్షిణి'; 'శోభావతి'; 'మధుమాధవి' యను పేళ్ళు గలవు.

సింహోద్ధతం బగుఁబ్ర–సిద్ధిగ దీని పేరే.
ఉద్ధర్షిణీ గరిమ – నొప్పు నిదే పఠింపన్.
శోభావతిన్ గిరులఁ – జూపు విరామమిట్లే.
మంజూక్తిఁ జెందు మధు – మాధవి రా నిదెన్నన్.

అని చిత్రకవిపెద్దన సర్వలక్షణసారసంగ్రహము.

**41. వంశస్థము – 1 (జ–త–జ–ర–8)**

సితాసినిర్ధారిత – సింధురేంద్రకుం. (16–22)
జమొంది **వంశస్థ త** – జంబు రేఫమౌ. ల.సా.సం.

**42. శార్దూలవిక్రీడితము (మ–స–జ–స–త–త–గ–13)**

శ్రీకారుణ్యరమాస్పదన్నయనరా – జీవాంచలోదంచితా (అవ – 1)
కంజాతాప్తయతిన్ మసల్ జసతతల్ – గంబుంప **శార్దూలమౌ**. ల.సా.సం.

**43. శ్యేని – 1 (ర–జ–ర–వ–7)**

జాతరుడ్ద్విపేంద్ర – శస్తహస్తసం. (16–33)
కీశనాథ! సేని–కిన్ రజల్ రవల్. ల.సా.సం.
**శ్యేనికిన్** రజల్ వ – యిన్ రవంబులున్. అప్పకవీయము.

**44. సీసము** (6ఇం + 2సూ = 4ఇం + 2ఇం+2సూ. తే.గీ. (లేక) ఆ.వె.)

తన పంట ధ్యానంబు – తగఁ బంచి యింటింటి
కిడె నూరఁ గఱ వేరు – నెఱుఁగకుండ (అవ–51)

సీసపద్యములో నాలుగు పాదము లందు 6 ఇంద్రగణములు (నల–నగ–సల–భ–ర–త) 2 సూర్యగణములు (న–హ) ఉండును. పాదమును రెండు ఖండములుగాఁ జేసినచో 8 పాదము లగును. అప్పుడు బేసి (1–3–5–7) పాదములలో 4 ఇంద్రగణములు; సరిపాదములలో (2–4–6–8) 2 ఇంద్రగణములు 2 సూర్యగణములు నుండును. ప్రతిపాదము నందు 3వ గణము మొదటి యక్షరము యతిస్థానము. ప్రాసనియమము లేదు. ప్రాసయతి పనికివచ్చును. ఇట్లు 8 పాదములు ముగిసిన పిమ్మట తేటగీతినిగాని, యాట వెలఁదిని గాని చేర్చవలయును. ఈ విధముగా సీసపద్యములో మొత్తము 12 పాదము లుండును.

కం॥ అనిమిషపతిషట్కముపై
నినయుగ మగు నంఘ్రి దాన – నిరుచోట్ల యతుల్
చనునవి నా ల్గడుగులపైఁ
గొన నొక గీతియు నమర్చి – కొన సీస మగున్. ల.సా.సం.





**45. స్రగ్విణి – 1 (ర–ర–ర–ర–7)**

ఆరివేరంబు సే – యన్ సమిద్దర్పదు (ర్వా) (16–21)
షద్యతిన్ రారల్ – **స్రగ్విణీవృత్తమౌ**. ల.సా.సం.

**46. స్వాగతము –1 (ర–న–భ–గగ–7)**

శూరవారశిర – సుల్ దెగి శస్త్రీ (16–27)
స్వాగతన్ రనభ – సంగ – గగంబుల్. ల.సా.సం.

**47. హలముఖి – 1 (ర–న–వ)**

ఈటె సాటి తురగి ఔ(మ్మూ) (16–41)
దీనిలో 'ర–న–వ' గణములు గలవు.

లాక్షణికులు 'ర–న–స' గణములు చెప్పినారు. ఔ రనల్ సము – **హలముఖిన్.** ల.సా.సం.

సాంబశివకవి వాడినది పాదమునకు 8 అక్షరములు గల యనుష్టుప్ ఛందములోఁ బుట్టిన వృత్తము. లాక్షణికులు చెప్పినది పాదమునకు 9 అక్షరములు గల బృహతీ ఛందములోఁ బుట్టిన వృత్తము. పై పద్యములోఁ బాదమునకు 8 అక్షరములే యుండుటచే యతి నియమము లేదు.

సాంబశివకవి యీ కావ్యమును శ్రీకారముతో మొదలుపెట్టి మంగళమహాశ్రీ వృత్తముతో ముగించినారు. ఈ సంప్రదాయమునకు శ్రీకారము చుట్టిన వాఁడు నన్నెచోడ మహాకవి. మంగళమహాశ్రీతో ముగించిన కావ్యముల పట్టికను శ్రీనిడుదవోలు వెంకటరావుగారు కుమారసంభవపీఠికలో నిచ్చినారు.

1. కుమారసంభవము – నన్నెచోడుఁడు
2. అనుభవసారము – పాలకుఱికి సోమనాథుఁడు (తరువోజ)
3. విక్రమార్కచరిత్ర – జక్కన
4. విష్ణుపురాణము – వెన్నెలకంటి సూరన
5. పారిజాతాపహరణము – నంది తిమ్మన
6. అధ్యాత్మికారామాయణము – కాణాదం పెద్దన సోమయాజి

ఇవి కాక నా దృష్టికి వచ్చినవి మఱికొన్ని కలవు –

7. కామందకము – జక్కరాజు వేంకటకవి
8. ముకుందవిలాసము – కాణాదం పెద్దన సోమయాజి
9. పుష్పాచలఖండము – శ్రీకాళహస్తి లింగకవి
10. శంకరవిజయము – వెంపరాల సూర్యనారాయణశాస్త్రి
11. రామాయణకల్పవృక్షము – విశ్వనాథ సత్యనారాయణ
12. పురుషోత్తమచరిత్ర – పోతరాజు పురుషోత్తమరాజు
13. శ్రీవేంకటరామయశోవికాసము – గరిమెళ్ళ సోమయాజులుశర్మ

ఈ చివరి కావ్యము నేను రచించినది. కావ్యమును శ్రీకారముతో నారంభించి మంగళమహాశ్రీతో ముగించుటయొక ఛందశ్చమత్కారము. ప్రాచీనులు తాళపత్రగ్రంథములలో గ్రంథము చివర 'మంగళమహాశ్రీ' యని వ్రాసెడివారు.

**ఇతర రచనలు**

సాంబశివకవి యీ కుమారసంభవమునే కాక 1. రామలింగేశ్వర శతకమును 2. చూళిమౌళీశ్వరశతకమును గూడ రచించినట్లు ముఖపత్రముపైఁ గలదు. ఇవి యెంత ప్రయత్నించినను నాకు లభింపలేదు.

కాళిదాస సంస్కృతకుమారసంభవమును గూర్చి సాంబకవి యాంధ్రకుమార సంభవమును గూర్చి చెప్పవలసిన విశేషములెన్నియో కలవు. అయినను రెండు ముఖ్య విషయములను జెప్పి దీనిని ముగింతును.

**కుమారజననము**

శ్రీకుమారస్వామి మార్గశిర శుద్ధ షష్ఠి నాఁ డవతరించినట్లు ప్రసిద్ధము.

"మార్గశిరశుద్ధషష్ఠీ చంపాషష్ఠీతి మహారాష్ట్రేషు ప్రసిద్ధా.... ఇయమేవ స్కందషష్ఠీ" – అని నిర్ణయసింధువు. ఇదియే 'సుబ్రహ్మణ్యషష్ఠి' యని లోకములోఁ బ్రసిద్ధము. కాళిదాసు కుమారసంభవములో షట్కృత్తికలు మాఘమాసములో గంగాస్నానము చేసి గర్భము ధరించినట్లు చెప్పినాఁడు.

శ్లో॥ జగచ్చక్షుషి చండాంశౌ కించిదభ్యుదయోన్ముఖే।

జగ్ముః షట్కృత్తికా మాఘే మాసి స్నాతుం సురాపగామ్॥ (10–43)

దీనిని సాంబశివకవి యిట్లు తెనిగించినాఁడు–

కం॥ పరఁగ జగచ్చక్షుండగు

నరుణకిరణుఁ డించు కభ్యు – దయోన్ముఖుఁడౌ

తఱి మాఘమాసమున నా

ర్గురు వచ్చిరి కృత్తికల్ మ – రున్నదిఁ గ్రుంకన్. (10–43)

దీనిని బట్టి కృత్తికలు మాఘములో గర్భము ధరించి రని నవమాసములు నిండిన పిమ్మట 10వ నెలలోఁ గుమారస్వామి యవతరించెనని భావింపవలయును. మాఘము నుండి మార్గశీర్షము 10వ నెల యగును.

**బాల్యచేష్టలు**

కాళిదాసు కుమారస్వామి బాలక్రీడలను 7 శ్లోకములలో (11–42...48) వర్ణించినాఁడు. ఈ శ్లోకము చూడుఁడు–

శ్లో॥ శంభోః శిరోఽ తః సరితస్తరంగాన్

విగాహ్య గాఢం శిశిరాన్ రసేన।

స జాతిజాడ్యం నిజపాణిపద్మ

మతాపయద్బాలవిలోచనాగ్నౌ॥ (11–47)





దీనిని సాంబకవి యి ట్లనువదించినాఁడు–

కం॥ శశిధరశిరస్సరిద్వర

శిశిరోర్ముల నీఁది యీఁది – శిశువు తమి హిమా

తిశయజడస్వశయాబ్జము

భృశకుశలతఁ గ్రాఁచె భాల – వీక్షణకీలిన్. (11–47)

కుమారస్వామి బాల్యములో శివుని జటాజూటములో నెగసిపడు గంగాతరంగములలో మునకలు వేసి యా చలి బాధ భరింప లేక శివుని నుదుటి కంటి మంటల దగ్గఱ జేతులతోఁ జలి కాఁచు కొనుచున్నాఁడఁట! ఎంత యద్భుతకల్పనము!

సాంబశివకవి యాంధ్రకుమారసంభవమును బఠించునప్పుడు ప్రాచీనప్రబంధమును జదువుచున్నట్లుండును గాని 20 శతాబ్ది కావ్యమువలె నుండదు.

**గ్రంథపరిష్కరణము**

శ్రీపన్నాల బ్రహ్మయశాస్త్రి రచించిన 'ఖలకర్ణవిషాయణము' నకు; శ్రీకూచిమంచి సాంబశివకవి 'యాంధ్రకుమారసంభవము'నకు వ్రాఁతప్రతులు నా దగ్గఱఁ గలవు. వీనిలో ఖలకర్ణవిషాయణమును బరిష్కరించి విపులపీఠిక వ్రాయఁగా దానిని హైదరాబాదు ప్రభుత్వప్రాచ్యలిఖిత గ్రంథాలయమువారు ప్రకటించినారు. ఇది మదీయచిరకాలమిత్రులు, వ్యాకరణ – తర్క – వేదాంత పండితులునగు డా॥ శ్రీశ్రీపాదసుబ్రహ్మణ్యముగారి కృషివలన వెలుఁగు లోనికి వచ్చినది.

శ్రీసాంబశివకవి కుమారసంభవమును దెనిఁగించి 8 సర్గముల వఱకుఁ గల గ్రంథమును 1926లోఁ బ్రకటించినారు. తరువాతఁ దక్కిన 9 సర్గములు కూడఁ బూర్తి చేసినారు. 1974లో మహాదేవకవి యాంధ్రమాఘమునకు నేను భూమిక వ్రాయు సందర్భములో దీని వ్రాఁతప్రతి నా చేతికి వచ్చినది. ఇది యప్పటి నుండి యయముద్రితముగానే యుండిపోయినది.

నా చిరకాల మిత్రులు, శతాధిక గ్రంథప్రకాశకులు శ్రీ రావి మోహనరావు (రామోరా) గారు కాళిదాస కుమారసంభవమునకు 'మృణాళిని' యను పేరుతో విస్తృతాంధ్రవ్యాఖ్యను సంతరించిరి. ఇందలి 3వ సర్గమునకు నేను లఘుపీఠికను రచించితిని. ఆ సందర్భములో శ్రీకూచిమంచి సాంబశివకవి రచించిన శ్రీమదాంధ్రకుమార సంభవము – వ్రాఁతప్రతిని గూర్చి వారితోఁ బ్రస్తావించితిని. దీనిని బ్రచురించుటకు వారు వెంటనే యామోదమును దెలిపిరి. దీని ప్రకటమునకు శ్రీనడిపినేని సూర్యనారాయణగారు ధనసాహాయ్యము గావించిరి. ఈ మహానుభావు లిరువురకు ననేక కృతజ్ఞతాభినందనములు సమర్పించుచున్నాను.

ఈ కుమారసంభవ ముద్రితప్రతి (8 సర్గములు); 9వ సర్గమునుండి 17వ సర్గము వఱకుఁ గల వ్రాఁతప్రతి రెండును మిక్కిలి శిథిలావస్థలో నున్నవి. కాగితములు ముట్టుకున్నచో ముక్కలగుచున్నవి. దీనికిఁ దోడు వ్రాఁతప్రతిలో దిద్దుబాటులు కొట్టివేఁతలు నెక్కువగాఁ గలవు. కొన్ని కాగితములు చిరిఁగిపోయినవి. చివరి కాగితముపై నీరుపడి చివరి మంగళమహాశ్రీ వృత్తము చెరిగిపోయినది. ఈ పద్యమును నేను మాఘభూమికలో నుదాహరించుట వలన నిక్కడఁ జేర్పఁగల్గితిని. శ్రీసాంబశివకవి సంస్కృతాంధ్రములలో మాఱుమూల పదముల

నెక్కువగాఁ బ్రయోగించినారు. శబ్దరత్నాకరాది నిఘంటువులు దగ్గఱ పెట్టుకొన్నఁ గాని యివి యవగతములు గావు. అయినను వ్రాఁతప్రతిని సాధ్య మయినంత వఱకు నిర్దుష్టముగాఁ బరిష్కరించుటకుఁ బ్రయత్నించితిని. అర్ధబిందువులు, శకటరేఫములు మాత్రము సవరించితిని. కవిప్రయోగములలో దేనిని మార్పు చేయలేదు. అది పరిష్కర్త పని కాదు. సాంబకవి పెక్కు తావులలో నొకే శ్లోకమునకు రెండేసి యనువాదపద్యములు రచించినారు. మొదటి పద్యమును మూలములో నుంచి రెండవ పద్యమును పాఠాంతరముగా నిచ్చితిని. ఈ పరిష్కరణము నందలి గుణదోషములకు సహృదయులే ప్రమాణము. ఈ గ్రంథమును బఠించి పాఠకు లేమాత్ర మానందము పొందినను నా శ్రమము ఫలించును. శ్రీరామోరా గారి, శ్రీ నడిపినేని వారి కృషి సార్థక మగును.

ఈ కావ్యనాయకుఁ డగు శ్రీకుమారస్వామిని మాటిమాటికి ధ్యానించుచు నీయవతారిక నింతటితో ముగించుచున్నాను.

శ్రీమత్పరమేశ్వరార్పణమస్తు

| | |
|---|---|
| విజయవాడ, | ఇట్లు |
| శ్రీమన్మథనామసంవత్సరాధికాషాఢ కృష్ణషష్ఠీ | సకలసుకవి బుధజనవిధేయుఁడు |
| మంగళవారము | గరిమెళ్ళ సోమయాజులు శర్మ |
| 07-07-2015 | పుష్పగిరి మహాసంస్థాన పండితుఁడు |

---







డా॥ నడిపినేని సూర్యనారాయణ మరియు శ్రీమతి కోటేశ్వరమ్మగార్ల ఆర్థిక సహాయంతో ఈ గ్రంథము ముద్రింపబడినది

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర కుమారసంభవము

---

## అవతారిక

శ్రీకారుణ్యరమాస్పదన్నయనరాజీవాంచలోదంచితా
లోకప్రాపితసేంద్రభోగవిమలశ్లోకోజ్జ్వలన్మోక్షల
క్ష్మీకా! స్వాశ్రితసాపరాధజనతాశ్రేయోఽ ర్పణాక్షీణకాం
క్షా!కైలాసితపల్వలాఖ్యపురముఖ్యా! చూళిమౌళీశ్వరా!

మ. అమరాంధ్రాంగలవాగజస్రపరిచర్యాధుర్యుఁడం, గూచిమం
చి మహావంశజసోమసుందరకవిశ్రీవేంగమాంబాసుతో
త్తముఁడన్, సాంబశివాభిధానుఁడ, సముద్యత్తాతపాదప్రసా
దముఖప్రాప్తసుధామధురుకవితాధారాశయాస్యాబ్జుఁడన్. 2

క. అగు నేను గులాచారా
నుగతిన్ గవితాకళావినూత్నాభ్యాస
ప్రగుణాభిలాష నుండెడి
పగిదిఁ గనుంగొనుచుఁ దాతపాదులు నెమ్మిన్. 3

క. తా రపుడు నాదుపట్టికి
సారకృపామతిఁ గుమారసంభవకృతిబో
ధారంభనిరతి నుండుచు
దారోక్తుల నిట్టు లనిరి దయ ననుఁ గనుచున్. 4





క. తెనిఁగింపుము నీ విది యీ
పని నగుఁ గవికాళిదాసపరమజ్ఞపదా
ర్థనికరభావన మందున
మనోవచశ్శుద్ధి నీ కమరుఁ జుమ వత్సా! 5

క. అనుటయు మహాప్రసాదం
బని పతి యీకృతికిఁ గాఁగ నరుహుఁడు నాకున్
జనకుఁడును గురుఁడు నగు నీ
యనుపమకార్యోపదేష్ట యని మొనకొనుచున్. 6

తే.గీ. వరకవిత్వప్రపంచధూర్వహనసహత
మించుకవిదిక్కరుల మున్ భజించి మివుల
దానిఁ జిందఱవందఱ గా నొనర్చు
చెడుగరులఁ గుకవులఁ బరిత్యజించి దవుల. 7

క. అనఘమతి మల్లినాథుని
యనుపమసంజీవనీసమాఖ్యవ్యాఖ్యన్
దనరిన యెనిమిదిసర్గలఁ
దెనిఁగించితి నే యథామతిన్ దదనుసృతిన్. 8

క. మూలము లవమును విడువను
మూలార్థస్ఫురణకై యమూలకపదముల్
వాలె మగుచోట వాడితిఁ
జాలఁగ మన్నింపరే రసజ్ఞులు దీనిన్. 9

తే.గీ. ఇది మొదట నేను వ్రాసి యిర్వదియు నొండు
నేఁడు లయ్యెను ముద్రింప నేఁడు పూని
నాఁడ నాయన్నుఁ దమ్ముఁడు న్యాయవాది
బుద్ధవరపు మహాదేవు బోధనమున. 10

క. కృతిముఖమునఁ గృతిపతి సం
తతివర్ణన కార్య మంద్రు; తద్వంశ సరి
త్పతివివృతి తలమె నావా
జ్మతులకుఁ గలశక్తి కొలఁది మలయుదు నైనన్. 11

మ. చతురామ్నాయసరస్వతీవిహృతి కంచద్రమ్యహర్మ్యభవ
చ్చతురాస్యుం డయి, సృష్టి పుష్టి లయముల్ సల్పుద్రిమూర్త్యాత్ముఁడై,

శ్రుతజీవేశవరాకృతిద్వితయుఁడై, సుజ్ఞానభానూజ్జ్వల
ద్ద్యుతిచేనారయ నద్వితీయుఁడయి, యాధ్యుండై యజుం డొప్పెడున్

క. వారిజజనిముఖసారస
భూరుచిరమరందబిందువులుఁబలె శ్రుతివా
క్సారథ్యేందిర తోడుత
భూరిధరామరఋషీందువులు గలిగి రటన్. 13

క. ఆ మహనీయులు భారత
భూమందిరవివిధభూవిబుధవరవంశ
స్తోమముల కెల్లఁ బ్రభవము
లైమలసిరి సంతతోద్యదభిజనవృద్ధిన్. 14

క. ఆ ఋషిభవులకుఁ బ్రాపయి
వారక కంటికిని ఱెప్పవలె బాహుజభూ
దారులు ప్రోచిరి చిరమ
వ్వారు కలిన్ జెడిరి స్వమతవైరినృపులచేన్. 15

ర. రక్షకులు లేమి విప్రా
ధ్యక్షులు గని విపదుపేక్ష దగ దని నిశిత
ప్రేక్షతఁ దరణోపాయది
దృక్షారతిఁ గూడి వగచునెడ ధీస్ఫురణన్. 16

క. అం దొక కొందఱు నృపులకుఁ
జందుగ సాయపడి పౌరుషప్రార్జితవి
త్తేందిర మిగిలిన భూమీ
బృందారకబృందమును భరింతు మని రొగిన్. 17

క. వారలు లౌకికు లనఁగా
ధారుణిపై నెగడి నైజధరణీపతులన్
వారక కాచిరి శాత్రవ
వారము దరిఁజేరకుండ వరదోర్మతులన్. 18

క. దూరీకృతప్రతిగ్రహు
లూరీకృతపౌరుషులు, రణోర్వీజలము
గ్వారీకృతదుర్వృదస్ప
గ్ధారాప్లవదసినిశాతధారులు వారల్. 19



క. ద్రోణకృపాశ్వత్థామల
పోణిమితో వారు సమరభూములను ధను
ర్బాణకృపాణీదంష్ట్రిత
పాణిఫణాంచత్స్వ బాహుఫణిపతు లగుచున్. 20

క. అమరాచార్యోపమమతి
భ్రమరాహిత్యాత్యమోఘబహుళోపాయ
క్రమ మెఱిఁగించుచు నృపతుల
విమతాజయ్యుల నొనర్చి పేర్చిరి ధరణిన్. 21

క. ఈ రహి మహిపతికార్య
స్ఫారాదృతి వారి కొదవు శ్రౌతస్మార్త
ప్రారంభలోపవితతిన్
దీరుతు మని వైదికులు ననిరి గా కదియున్. 22

మ. క్షమ రాజుం బ్రజ నేఁచు దైవికవిపత్సంజాతనానావిధ
శ్రమలన్ శాంతికపౌష్టికాదికసమంచద్వేదమంత్రోక్తక
ర్మమహాస్త్రంబులఁ ద్రుంచి వారిఁ బొదలింపన్ బూని రావైదికో
త్తమమార్గైకవలంబిసర్వహితతాత్పర్యాతిధుర్యాత్మకుల్. 23

తే. వైదికనియోగివృత్తివిభాగమిట్లు
పరఁగె సకలహితార్థతత్పరతఁ దొలుతఁ
బ్రస్తుతవిభేదసంభవాపాటవాబ్ధ్యు
దరము పునరైక్యసేతుసుతరము కరము. 24

క. ఆ రాణ్మంత్రికులము పలు
పేరుల వేఱుపడె భిన్నవిషయనిలయతన్
స్ఫారావరణైకపయః
పూరమె నానాబ్ధు లైనపోలిక దనరన్. 25

ఉ. ఆ లసమాసధీనిధికులాబ్ధి జనించిరి లోకవేదవి
న్మౌళులు, పాల్యపాలకసమానహితార్థులు, జ్ఞానకర్మసా
మ్యాలఘుశేముషీందిరు, లిహార్థపరార్థసదృక్షదీక్షు లా
ర్వేలకులుల్ స్వపాణి బదరీకృతిదేశ్యమరుత్సరస్వతుల్. 26

తే.గీ. ఒనర నిఁకఁ గృతిపతిచంద్రు నుదయలక్ష్మి
చేత సమలంకృతమ్ము, ప్రాచీనము నయి

సరసఘనరత్న సంతతాకరత మించు
ప్రాంశుగోత్రక్రమంబు వర్ణన మొనర్తు. 27

శా. చండాంశుప్రతిమానతేజుఁ డయి యుచ్చండస్ఫురద్వేదవా
క్కాండార్థోత్తమతత్త్వపూర్ణమతియై ఖండేందుచూడార్చనా
చండీశోపముఁడై యమర్త్యగురుధీచాతుర్యధుర్యాత్ముఁ డై
కౌండన్యర్షి జనించె వారిజభవాఖండాన్వయాబ్ధీందుఁడై. 28

క. ఆ ఋషికులాబ్ధిఁ దనరుపఁ
గా రాజవతంసమస్తకన్యస్తకళా
హీరు లుదయించి మించిరి
స్ఫారశ్రీకూచిమంచివంశప్రభవుల్. 29

సీ. శ్రితరాజశేఖరార్పితపూజ్య పదు లయి
యినలబ్ధవాసవాహీనలక్ష్మిఁ
దదసాధ్యశార్వరతామసోద్ధతి మాన్పి
స్వాశ్రితకవివిబుధాళి మనిచి
తారాధిపత్యంబు దాల్చి యజ్వహితప్ర
వృత్తులై, ద్విజరాజ విశ్రుతిగని
కావించి పితృతృప్తి జైవాతృకతఁ గాంచి
కువలయోల్లసన వైభవత మించి

తే.గీ. భారతపదాభివర్ణితవంశ మహిమ
వఱలు సత్పథగామాత్యవరకళాని
ధులకుఁ బ్రభవంబు కూచిమంచ్యలఘుకులసు
ధాబ్ధి గలిగెఁ దదమితగోత్రాంబురాశి. 30

క. అమర నధృష్యము నభిగ
మ్యము గాఁ దైక్ష్ణ్యంబుతోడి మంచితనమునన్
గొమ రగునీవంశము కూ
చిమంచిసమభిఖ్య వినుతి సేసిరి విబుధుల్. 31

సీ. నిజసుతాయితభవానీకు ండగ్రజపాల
పేరరా జేవంశవిభవకర్త
యసువసుధీశివైకార్పకుల్ పేర రా
ట్పృథురాజు లేకులాబ్ధిని జనించి





రష్టదిఙ్నాగాగ్రయాయి సీతారామ
శాస్త్రి యే యన్వయజలధిఁ గలిగె
నృపతిసత్కృతినిరాదృతి తిమ్మకవిసార్వ
భౌముఁ డేసంతతివార్ధిఁ బొడమె

తే.గీ. నేయభిజనాబ్ధి గోపాలకృష్ణమంత్రి
గలిగె సంతతివిచ్ఛేదవిలయజలధి
మగ్నగోపాలపురసుసంస్థానభూస
ముద్ధరణదంష్ట్రిమూర్తిసముజ్జ్వలహరి. 32

సీ. కొప్పులింగాగారగోపురావృతి శిలా
కుడ్య మంటపములు గూర్చె నెవఁడు
స్థిరభూవసతితోఁ దనర నన్నసత్రమ్ము
నెలకొల్పె నధ్వనీనులకు నెవఁడు
క్ష్మాసురేంద్రులకుఁ బెక్కండ్ర కెవ్వఁడు గృహ
క్షేత్రరత్నములిచ్చెఁ బాత్రతఁగని
తనమనోముకురంబుఁ జెనయనీఁ డెవ్వఁడ
న్యారూపశోభావిచారమషిక

తే.గీ. యాతఁ డమరగురుప్రతిభాభిరాముఁ
డవితథాతిచిరానుగ్రహాగ్రహుండు
నాస్తనంధయగోపనిత్యస్మృతాత్మ
కీర్తివిభవుండు గోపాలకృష్ణమంత్రి. 33

తే.గీ. మొదటినుండియు నది దెల్పఁ బూనుకొన్న
గ్రంథమునకన్నఁ బొడ వనుబంధమె యయి
యుర్విలోఁ జలిది కంటెను నూరుగాయ
బల మనెడుసుద్ది యగును నిబద్ధి గాన. 34

తే.గీ. తరము లైదాఱు మాత్రమే తగ వచింతు
నదియుఁ గుదియింతు నౌచితి కనువు పడఁగ
నింతమాత్రము దీని సహించు టొప్పు
కవికులాచార మారసి కావ్యవిదులు. 35

క. ఆ యభిజనఖని నృపసమ
వాయవతంసీకృతాత్మవచనఘృణిగణ

స్ఫాయత్పల్వలనగర
స్థాయుకమణి భైరవార్యసద్గుణి గలిగెన్. 36

క. ఆ మంత్రిమణికి సుందర
రామాభిఖ్యాకసచివరత్నంబును భూ
పామాత్యమౌళియును సుతు
లై మించిరి కమలకువలయాప్తప్రభులై. 37

క. సుందరరామామాత్యపు
రందరుఁ డచలోరునిష్ఠురవిపక్షభిదా
మందప్రజ్ఞాపవిత్రై
క్ష్యేందిరుఁడై పల్వలపుర మేలెఁ గరణమై. 38

క. కరణముఁ, బురీకుమారీ
నరపతిజనకార్పితాభినవహరణము, బం
ధురతరమంత్రికులాలం
కరణము, దైన్యార్తబుధనికరశరణము నై. 39

క. ఏలెం బల్వలనగరము
తోలెం గూళల దిశావధులకు సిరులం
గ్రాలెఁ బురందరు లీలన్
జాలె నిజార్థులకు సమరసాలముఁ బోలెన్. 40

క. ఆ పుణ్యున కుదయించిరి
భూపతిరాజప్ప లనఁగఁ బుత్రవరిష్ఠుల్
శ్రీపుత్రపౌత్రవృద్ధుల
నేపారిరి వారు లోకహితతత్పరులై. 41

క. భూపతి యాధ్యాత్మికవి
ద్యాపారావారభవసుఖామృతపాన
వ్యాపారాన్యవిరక్తుం
డై పురపరిపాలకత్వ మనుజుని కిచ్చెన్. 42

క. సరరాణ్మంత్రియు, రామన
వరగుణియు, భూప సచివవాసవునికిఁగ
ల్గిరి; సర రాజునకున్
స్మరసుభగుఁడు సోమమంత్రిచంద్రుం డొదవెన్. 43

17



క. సోమన గానకళానిధి,
భామానవమదనమూర్తి, బ్రాహ్మణచేత
స్తామరసస్తోమారుణ
ధాముఁడు, లిపిసవ్యసాచి తా నన నెగడెన్. 44

తే.గీ. ఆయనకుఁ గల్గె సత్యనారాయణాఖ్య
మంత్రి యతఁడేక పుత్రికామాత్రలసద
పత్య సంప్రాప్తిఁ బితృఋణభరము డించి
యమరలోకంబు సేరె మర్త్యంబు రోసి. 45

క. రామునకు, హరిచతుర్థో
త్శ్రీమహిములు సుబ్బరాయకృతిమణి సరరా
డ్ధీమంతుఁడు, భూపతి, నర
సామాత్యుఁడు ననఁగఁ గలిగి రాత్మజు లందున్ 46

క. వాణిజ్యకుశలుఁ డతిథి
శ్రేణీసురశాఖి, రఘువరేణ్యపదవిని
ద్రాణాంబుజమధుకరద
క్షిణాత్ముఁడు భూపమంత్రిశేఖరుఁడలరెన్. 47

తే.గీ. దుహితృదౌహిత్రసంతతితో నెసంగి
మర్త్యమున నాత్మకృత్యసమాప్తిఁజేసి
నైజపుణ్యధనక్రీతనందనవన
ధామ మొందెను భూపతి రాముకృపను. 48

క. మిగిలినతత్సహజన్ములు
ముగురును సుగుణాఢ్యు లనఁగఁ బొగడిక గనుచున్
జగతిని సుతపౌత్రాదిక
మగు నన్వయవృద్ధి సిరుల నలరుదు రెల్లన్. 49

క. రాజప్ప కరణమై పుర
రాజము రంజించె నర్ధరాజమకుటప
ద్రాజీవభక్తిసంపద
రాజిలె సురరాజవిభవరాజితుఁ డగుచున్. 50

సీ. తనపంట ధాన్యంబు తఁగ బంచి, యింటింటి
కిడె నూరఁ గఱ వేరు నెఱుఁగకుండ

వలయువారు యథేచ్ఛఁ బాలుఁ బెర్వును గొనఁ
దనయింట దధిదుగ్ధవనధు లుంచెఁ
గొప్పులింగని భక్తి మెప్పించె, నిత్తడి
నందికల్యాణమంటపము లొసఁగి
ద్విక్రోశదూరస్థవృద్ధగౌతమి నామ
రణ ముషఃస్నానసువ్రతము దీర్చె

తే.గీ. సంతతాన్నప్రదానవిచక్షణుండు
పరహితవిధానజీమూతవాహనుండు
దానన్రుపభక్తిగరిమరాధాసుతుండు
మంత్రిమాత్రుఁడె రాజపామాత్యమౌళి. 51

తే.గీ. ఆ మహితునకు వేంకటరామదీక్షి
తాగ్రణియు, మానధనుఁడు పుల్లయ్యమంత్రి
యును జనించిరి కశ్యపమునివరునకు
నింద్రుఁడు నుపేంద్రుఁడును నుదయించినట్లు. 52

క. వేదాధ్యయనాధ్యాపన
వేది, యవిచ్ఛిన్నజాతవేదుఁ, డవిశ్రాం
తాదిత్యదైవవరివ
స్యాదృతమతి యగుచు దీక్షితాగ్రణి వఱలెన్. 53

తే.గీ. క్షితిని వేంకటరామదీక్షితవరునకు
మహితరాజప్పవీరరాణ్మంత్రు లుదయ
మైరి ప్రజ్ఞాపరాక్రమోదారు లగుచుఁ
గరివదనశక్తిధరులు శంకరుని కట్లు. 54

క. ఆ రాజపేశ్వరునకుఁ గు
మారుఁడు గోపాలకృష్ణమంత్రి జనించెన్
ఘోరారితారకభిదా
దారుణపౌరుషత జనపదం బతఁడేలెన్. 55

తే.గీ. పౌరుషరథాధిరూఢుఁడై పరఁగి కేల
గ్రామపాలకతాకార్ముకంబు దాల్చి
బహురిపుల వాఁడు దొడరుచోఁబగఱఁ గూడి
విధి యొనర్చె నిరాయుధు విరథు నతని. 56



తే.గీ. ఘనుఁ దొఱఁగి తుంగగోత్రశృంగములకు దిగి
యడుగునకు జాతి నీచనీచానుసృతిని
మలయు నిమ్నగఁబోల్ రమాప్రతీప
దర్శిని యుదారు విడి యొర్లఁదఱియు టరుదె. 57

క. ఆ వరసుకృతికి వేంకట
రావుదయిం చెను గుమారరత్న మలచిరం
జీవియ ప్రహ్లాదుకరణి న
నావిలవినయాదిగుణగడాఢ్యత మించున్. 58

తే.గీ. సూర తేజోవిరాజి యావీరరాజ
సచివమణి యంబరమణిప్రసాదగరిమ
సూర్యనారాయణాభిఖ్యు సుతునిఁ గాంచెఁ
బొదలు నాతఁడు సంతతాభ్యుదయవృద్ధి. 59

క. మానార్థత్రాణార్థ
ప్రాణచలానిలతృణీకరణవిద్యాపా
రీణుఁ డగుపుల్లమంత్రికిఁ
బ్రాణేశ్వరి యగుచు వేంగమాంబిక వఱలెన్. 60

మ. కలిగెన్ వారలకున్ ధరాధరసుతాకాంతాంఘ్రికంజాతమం
జులభృంగన్మతిధన్యుఁ డాగమశిఖాసూక్త్యర్థచింతాబ్ధిభూ
లలితానందసుధారసానుభవలీలాశాంతసంసారజూ
ర్త్యలఘూదన్యుఁడు సోమసుందరవదాన్యాఘాగ్రగణ్యుం డిలన్. 61

సీ. తన ప్రథమార్జితార్థమునఁ గొన్న ధరాంశ
ముల సస్యపూర్తి విప్రుల కొసంగెఁ
దాఁ దరందా రైనతతి బహుద్విజుల చేల్
మాన్యంపుఁబట్టాల మలయఁ జేసెఁ
జేనఁబెరఁటఁ బండు శ్రేష్ఠార్థతతి నెల్లఁ
బుడికె నెప్పటి కప్డె భూసురులకుఁ
బ్రస్థానములు మూఁడు రసనాగ్రమం దుంచి
బ్రహ్మంబు కరబదరం బొనర్చె

తే.గీ. విమలమతి దేశకాలప్రాతముల నరసి
విధివిహిత సర్వదానముల్ పేర్మి సలిపె

ధరణి నుతి కెక్క సప్తసంతతులు నిలిపె
నట్టి కృతిపతి కెవ్వ రీ డఖిలజగతి. 62

క. చేయని సద్దానము, వి
చ్చేయని తీర్థమ్ము, పఠన సేయని గీర్వా
ణీయాంధ్రగ్రంథము లే
దాయనఘున కంద్రు తజ్జ్ఞు లగువిబుధవరుల్. 63

ఆ.వె. బాల్యమునకుఁ జదువు, ప్రథమయౌవనమున
సరసకావ్యరచన, నెరపరువున
రాజసేవ, యవలఁ బ్రాణమున్నంతకు
నుపనిషద్విచారయోగనిష్ఠ. 64

ఆ.వె. ఆయు విట్లు సఫల మౌనట్లు విభజించి,
యురుభవాంబురాశి నుత్తరించి,
మోహ మోసరించి, ముక్తి కాంత వరించి,
యతఁడు బ్రహ్మభావ మధిగమించె. 65

క. ఆయన కేనును మార్కం
డేయాయుష్యుండు, సుగుణనిధి, విబుధాంధ్రాఁ
గ్లేయవచోవిదురపురో
యాయి, మహాదేవకృతియు నాత్మభవులమై. 66

క. జనియించితి మతనిని మా
యనుఁగుందోఁబుట్టు శంకరమ పుత్రుఁగఁ గై
కొనుట నతఁ డలరుఁ దత్పా
వనబుద్ధవరాన్వవాయపాలకుఁడగుచున్. 67

క. సౌమిత్రి రాము నెటు సౌ
త్రామణి ధర్మజుని నెటు లదంభప్రియతన్
బ్రేమించి రంతకంటెను
బ్రేమించు నతండు నూఱు రెట్లుగ నన్నున్. 68

క. ఆయుష్యం, బారోగ్యముఁ,
బాయని దాంపత్యసుఖ, మపత్యసమృద్ధిన్,
శ్రీ, యకలంకయశము దయ
సేయుత మాపాలి పరమశివుఁ డాతనికిన్. 69



ఉ. నేనును గొత్తపేఁ టపురి నెక్కొను నున్నతపాఠశాలలోఁ
బూనిక నాంధ్రవాఙ్మయబోధకముఖ్యుఁడ నై యెసంగుదున్
మానుగ నిందుమౌళికరుణామహిమన్ సహధర్మచారిణీ
భూనుతపుత్రపౌత్ర ముఖభూరిసమిద్ధసమృద్ధిసిద్ధులన్. 70

క. ఆ కవిచతురాననునకుఁ
బ్రాకటసౌశీల్యయుతలు పార్వతమ యనన్,
శ్రీకరగౌరమ యన, సు
శ్లోకలు శంకరమ యనఁగ, సూరమ యనఁగన్ 71

క. అతులచతుశ్శ్రుతులట్టు లు
దిత లౌరి సుతల్ గ్రహీతృధీరవరకృతా
ర్థతమాన్వవాయపావన
చతురాత్మలు ససుతదుహితృసంపన్మహితల్. 72

**షష్ఠ్యంతములు**

క. స్తుతధృతికి జ్ఞానభానుని
హతమోహతమస్సమితికి నతులమనీషా
జితగీష్పతికి జగద్వి
శ్రుతదానోన్నతికి సోమసుందరకృతికిన్. 73

క. గుణికిన్ గవిలోకగ్రా
మణికిన్ సంశ్రితనిశారమణఖండశిరో
మణికిన్ వాచావైభవ
తృణీకృతానంతఫణికి ధీరాగ్రణికిన్. 74

క. శాంతునకు నర్థిపూర్ణని
శాంతున కనిశాన్నదానజనికీర్తిగతా
శాంతునకు వచోవిభవా
నంతునకున్ సూనృతప్రియస్వాంతునకున్. 75

ఆ.వె. ఆరవీందుతారకాన్వయవృద్ధిగా
నారచింపఁగా మొనయు కుమార
సంభవాంధ్రకృతికిఁ జారుతరంబౌ క
థాక్రమంబు కింవిధాక మనిన. 76

---

శ్రీః

# శ్రీమదాంధ్ర కుమారసంభవము

## ప్రథమాశ్వాసము

శ్రీ కూచిమంచికులర
త్నాకరరాకాచకోరనయనాధిపతీ!
లోకోత్తరకవితాప్తా
స్తోకసుధీవినుతి! సోమసుందరసుకృతీ! 1

క. అవధారు మచ్చికీర్షిత
మవునాంధ్రకుమారసంభవాహ్వయకృతి కిం
పవు సత్కథాసుధారస
నవలహరీసరణి యెట్లు నలువారు ననన్. 2

---

క. శ్రీకరపూర్వాపరర
త్నాకరములఁ జొచ్చి మానదండము ధర కన్
జోకఁ దగున్ హిమవదభి
ఖ్యాకుఁడు గిరిరాజు దేవతాత్ముఁ డుదీచిన్. 1

చ. అతనిని లేఁగగాఁ గొని, నగాగ్రణు లెల్లను ధేనురూపసం
శ్రితఁ, బృథివిన్, బృథుం డెఱుఁగఁ జెప్పఁగ జేకొని, దోహనక్రియా
కృతి కనకాద్రిచేతఁ బిదికించిరి కాంతిసమగ్రరత్న సం
తతియు, ననంతసత్త్వభరితంబుల నోషధులన్ సమృద్ధిగా. 2





ఉ. భూమి నమేయరత్నముల పుట్టినయి ల్లగు నగ్గిరీంద్రుసు
శ్రీమహిమంబు దా హిమముచేఁ గొఱ చెందునె యెందు? సద్గుణ
స్తోమమునన్ మునింగి చను దోస మొకానొకఁ డున్నఁ బూర్ణిమా
సోమకళావిలీన మయి చొప్పరి యుండెడుకందు చందమై. 3

ఉ. అచ్చటియున్నతాగ్రములయందలి ధాతురుచుల్ మొగిళ్లపైఁ
గ్రచ్చుఱఁ బర్వి మెచ్చుగునకాలపుసంధ్యవలెన్ వెలుంగఁ దా
మచ్చపుసంజ కెంజిగియటంచుఁ గడున్ భ్రమియించి యచ్చరల్
నెచ్చెరఁ దావు తప్పఁ గయిసేయుదు రాత్మవిలాసభూషలన్. 4

చ. ఖరనఖరాగ్రనిర్దళితకొంజరకుంభమృగేంద్రపాదభా
స్వరరుధిరాంకజాతము స్రవన్మిహికాంబువుచేత ధౌతమై
యరయఁగ రాక యున్నఁ దదనల్పనఖాంతరముక్తమౌక్తికో
త్కరమున వానిజాడ లటఁ గాంత్రు కిరాతు లరాతిఘాతుకుల్. 5

చ. అనవరతానితంబచరదంబుదపంక్తుల దైన నీడచే
ననువుగఁ గ్రిందిసానువులయందు సుఖంబుగఁ గొంతసేపు ని
ల్చిన, నట వాన లేఁచ, శ్రమ చెందుచు నచ్చొటు వాసి సిద్ధు లిం
పెనయ నగాగ్రభాగముల కెక్కి సుఖింపుదు రెండ కాఁగుచున్. 6

తే.గీ. నడిమిపాయంపు టేనుంగు నొడలి పొడల
కెంపుసొంపువహింప భూర్జంపుఁ దరుల
పొరల నటఁ జెందిరపురసమున లిఖింత్రు
వలపుజాబులు విద్యాధరులచెలువలు. 7

క. గిరి తనకందరముఖములఁ
బరఁగెడు కరువలిని వేణువరవివరములన్
గర మొప్ప నించు నుచ్చై
స్తరకిన్నరగానతానదానేచ్ఛ ననన్. 8

క. కటకండువు దీఱ మదో
త్క టకరు లట వఱలు సరళతరువులనొరయన్
బొటబొటఁ గాఱెడుపాలను
బటుపరిమళ మొదవి సానుభాగము లలమున్. 9

క. రేలు దరీగృహగర్భము
లోలి వెలింగించు రుచుల జ్యోతిర్లతికల్

తైలము గోరని రతిదీ
పాళి యగున్ బోయలకుఁ బ్రియాయుతుల కటన్. 10

చ. గడు సయి రాయివాఱిన యిగంబున దుర్గమ మైనత్రోవ వెం
బడిఁ జనువేళ వ్రేళ్ళు మడమల్ చలి నొచ్చిన మందయానముల్
విడువరు గుజ్జుపుమ్మెకపువేల్పుటొయారులు మోవఁ గష్టమౌ
కడిఁదిపిఱుందునిబ్బరపుగబ్బిచనుల్ గలిగించు గాసిచేన్. 11

చ. పగలిటిభీతినో యనఁగ వచ్చి గుహావళి డాఁగుచీఁకటిన్
నగకులమౌళి ప్రోచు నరుణద్యుతిచేఁ బడకుండ నున్నతిన్
దగఁదల లెత్తువారికిఁ దనర్చుఁ గదా మమతాభిమాన మో
జగ శరణన్న నీచుపయి సైతము సత్తుగ సాధుపైబలెన్. 12

తే.గీ. కులుకుతోఁకల వెన్నెలతళుకు లొలుక
సవరపుమెకంబు లిచట నచట విసరుచు
నతని గిరిరాజనామ మన్వర్థకంబు
సలిపెెఁ జెలువారు వాలపుఁజామరముల. 13

ఆ.వె. చీర జాఱ లజ్జఁ జేడ్పడు కిన్నరాం
గనల కచటఁ దెరలుగా రహించు
భాగ్యవశత దరులవాకిళ్ళ వేలెడు
మండలముల నొప్పు మబ్బుగములు. 14

చ. అలగిరిఁ దెమ్మెరల్ త్రిపథగాంబుకణప్రకరంబు దాల్చి య
వ్వల నొగి దేవదారుతరువారము సారెకునుం గదల్చి బో
యలు మొలఁ గట్టు నెమ్మిపురు లందముగా విడఁజీల్చి కానలన్
బలుమెగపుంగమిన్ నెమకఁ బైకొను గాసి వదల్చు వారికిన్. 15

క. మలపయిఁ గొలఁకులఁ గలత
మ్ములలో సప్తర్షివరులు పుడుకఁగఁదక్కుం
గలవాని మేలుకొలుపును
వెలుఁగుల నెగఁజిమ్మి దిగువ వెలిఁగెడి రవి తాన్. 16

చ. వరసవనోపయోగ్యమగువస్తుల కెల్లను బుట్టినిల్లు నై
గురుతరధారుణీభర మకుంఠితశక్తిని దాల్చునగ్గిరీ
శ్వరుఁ గని పద్మజుండు క్రతుభాగసమన్వితమైయెలర్ప భూ
ధరకులచక్రవర్తి విదితస్థితిఁ గోరి తనంత నిచ్చెఁ దాన్. 17





చ. అల యపరంజికొండచెలియై మరియాద లెఱుంగుజాణ యై
మలయు నగాధిరాజు పితృమానసజన్య మునీంద్రమాన్య స
త్కులగుణరూపధన్యఁ దనకుం దగు కన్య వివాహ మయ్యె హం
సలలితయాన మేన యనుచాన యథావిధి వంశవృద్ధికై. 18

క. జిగిబిగిసోయగములకున్
దగుపగిదిన్ గలసి మెలసి దంపతు లుండన్
నగపతిసతి కొన్నాళ్ళకు
సొగసగు నెలజవ్వనమునఁ జూలా లయ్యెన్. 19

ఉ. ఆ కలకంఠకంఠి గనె నల్కను ఠెక్కలు చెక్కవచ్చు న
ప్పాకవిరోధివజ్రమునఁ బాటిలుచేటు లెఱుంగ కబ్ధితోఁ
బ్రాకటమైత్రి నుండుదొరఁ బాప వెలందులమేలువాని మై
నాకుఁడనన్ బ్రసిద్ధి గను నందను నద్రికులార్ణవేందునిన్. 20

ఉ. అంతట దక్షుకూఁతురు పురాంతకు తొల్లిటిరాణి యాసతీ
కాంత పతివ్రతామణి స్వకాంతునిఁ దండ్రి పరాభవింపఁ దా
నెంతయునల్క యోగశిఖి నేర్చి శరీరము చేరె శైలసీ
మంతిని మేనకారమణి మాటికి జన్మము నెత్తు కోరికన్. 21

తే.గీ. అల్ల కల్యాణి యుదయించె నద్రిమణికి
నియమవతి యైన యాతని నెలఁతయందుఁ
జెన్నగు ప్రయోగపటిమచేఁ జెడని నీతి
యందు నుత్సాహమున లక్ష్మి యదరినట్లు. 22

**[1]క. తెలి వొందె దెసలు, విడె గా**
**డ్పులు ధూళిని, మ్రోఁగెఁ జిందములు, బడి విరివా**
**నలు గురిసెఁ జరాచర జీ**
**వులకు సుఖంబొదవె సుదతి పుట్టిననాఁటన్. 23**

చ. సరసమనోహరాంగరుచిజాలము చుట్టును బర్వ నొప్పునా
వరసుతచేతఁ దల్లి కడు భాసిలె నవ్యపయోదగర్జనన్

[1]చ అలరుచు దిక్కు లెల్లఁ దెలి వందెఁ బరాగమువీడి పయ్యరల్
చెలువుగ వీచె వేలుపులు చిందము లూదుచు వాని వెంటఁ దా
మెలమిని బూలవాన గురియించిరి సర్వచరాచరాత్మ జీ
వులకు సుఖంబు గల్గె సతిపుట్టిన పుణ్యతమాహమందునన్

సరగున నుప్పతిల్లు రతనంపుఁజొకారపు మొల్కచేఁ గడున్
బరఁగు విదూర శైలము నుపత్యక తీరున సౌరు మీఱుచున్. 24

మ. అలలేఁజందురు రేకజోక గనఁగా నాకన్నె లోకత్రయం
బలరంగా నుదయించి యన్వహము పెం పందం దదంగంబులున్
వలనొప్పారఁగఁ బుష్టి చెందె నవలావణ్యంబుతో నిండి వె
న్నెల వెల్లిం దొగవిందు తక్కినకళల్ నింపారి పెం పొగతిన్. 25

తే.గీ. ముద్దియను బంధుజను లెల్ల ముద్దు చేసి
పర్వతము లౌట జనకాదిపూర్వు లెల్ల
ననిరి పార్వతి యని; తల్లి యవలఁదపము
మానుమా యనఁ దనరారెఁ దా నుమాఖ్య. 26

చ. అల కులధారుణీధరచయాగ్రణి కెందఱుబిడ్డ లున్న గా
దిలిసుతఁ జూచుచో నతనిదృష్టి వహింపదు తుష్టి; యట్టు లౌ
సలలితసూనసంతతివసంతున కెన్నిక మీఱి యున్ననున్
బలుతరితీపు మావిపువుపైఁ గద తన్మధుపాళి కెప్పుడున్. 27

చ. చెలఁగి వెలుంగునట్టి సిగచేతఁ బ్రదీపముభాతి దేవశై
వలవతిచేత నయ్యమరపట్టణమార్గమురీతి శాస్త్రని
ర్మలయగు వాణిచేతఁ గవి రాజునుబోలె సుతామతల్లిచే
వెలయ నలంకృతుండును బవిత్రుఁడు నయ్యె గిరీంద్రుఁ డెంతయున్. 28

క. మినువాఁక సైకతంబులఁ
బనివడి జగతుల నొనర్చి బంతులు బొమ్మల్
గొని యాటలచవి చూఱలు
గొను గతిఁ గ్రీడించె బాల కూర్మిచెలులతోన్. 29

చ. శరదకలంక వేళ సురశైవలినిన్ గలహంస లట్లు రా
తిరి నల జ్యోతిరాఖ్యలగు తీఁగల వాని వెలుంగు లట్లునున్
దిర మగుప్రాగ్భవంపుటుపదేశపుబల్మి గురూపదేశమున్
బొరసెడునాఁడె చేరెఁ దొలిపుట్టువువిద్దియ లెల్ల ముద్దియన్. 30

క. కొని తేనిసొమ్ము మేనికి
మనితసురాభిఖ్య లేని మదకారణమున్
నన గాని శరము మరునికి
ననప్రాయము బాల్యమెడల నాతికినొదవెన్. 31



ఉ. తూలికచేత రంగిడిన తొంగలి చిత్తరు బొమ్మ కైవడిన్
బాలవిభాకరాంశువుల బాగుగ విచ్చిన తమ్మిపోలికన్
బాలికమేనుఁదీఁగ యెలప్రాయము సేయు విభాగచాతురిన్
జాల మనోజ్ఞమై తనరె నల్మొనతీరినసౌరు గూరుచున్. 32

చ. పొలుపుగ నెత్తరంబు లగు బొట్టనవ్రేళుల గోళ్ళకాంతిచే
నిలఁజరియింప నూనినపు డెల్లను జేవురు గ్రక్కు కైవడిన్
నలువగు తత్పదద్వయి తనర్చె మహిన్ నడయాడునట్టి నే
ర్పొలసిన మెట్టతామరల యొప్పిదమున్ హరియింపఁజాలుచున్. 33

క. నతగాత్రి యందియల శిం
జితముల నేర్చుకొనఁగోర్కిచే రాయంచల్
ప్రతివిద్య గాఁగ దానికి
గతుల యొయారములు నేర్పఁ గావలెఁ జెలికిన్. 34

క. బలునిడుద గాక వట్రువ
చెలువున నాఁదోఁక లయిన చెలి చక్కని పి
క్కలు చేసి తివురఁ బోల్మతీ
లలి విధి శేషాంగవిధికి లావణ్యము తేన్. 35

తే.గీ. అలఘువిపులత గలరూపు లొలసియున్న
సవతు గన నేర వతివ యూరువులతోడ
పరుషచర్మతఁ జేసి దిక్కరికరములు
సతతశీతతఁ గదళికాస్తంభములును. 36

ఉ. ఆ యనవద్యగాత్రి రశనాస్పద మౌనెడ సొంపు పేర్మి యు
న్నేయము దీననే తపము నిల్పిన వెన్క గిరీశుఁడబ్జప
త్రాయతనేత్ర కింకొకతె కాసకు నైనను నంద రాని యా
త్మీయసముజ్జ్వలాంకమున మేల్పడి నిల్పిన దన్న మాత్రనన్. 37

క. అన్నెలఁత నీవి దాఁటుచు
సన్నతమగు నాభిఁ జొచ్చు సన్నని నూఁగా
ఱెన్నం దగెఁ గాంచిక నడు
మ న్నెలకొను నింద్రనీలమణి కాంతివలెన్. 38

[1]క. **పదఁతుక లోతుంబొక్కిలి**
**మదుగుదరిన్ నల్లనా అమరె మోమునెలన్**

**బొడఁగనఁ జను జక్కవకున్**
**జడుపున ముకునుండి జాఱు శైవలలత నాన్.** **39**

క. వేదికమధ్యముఁ బోలిన
పైఁదలికౌఁదీగె మూఁడువళు లలరారెన్
లేఁదలిరు పరువ మదనుఁడు
మీఁదికి నెక్కంగఁ గట్టు మెట్టులు వోలెన్. 40

క. పడఁతుక వెల్లనిచనుఁగవ
కదు నీలపుఁజా మెఱుంగు గల ముక్కులతో
వడిఁగ్రిక్కిఱియఁగఁ బెరిఁగిన
నడుమను లేదయ్యె బిసగుణము పొటెడమున్. 41

తే.గీ. నెలఁత వరబాహులతల కోమలత నెన్న
నభినవశిరీషసుమమార్దవాతిశాయి
కాక ము న్నోడిన మరుండు కాలగళుని
గళమునను నెట్టు వాని రజ్జులుగఁ గట్టు. 42

క. బిగిచనుఁగవచే నున్నత
మగు చెలిమెడ బటువుముత్తియంబులపేరున్
సొగసొందొంటికిఁ బెంచుటఁ
దగె భూషణభూష్యభావతౌల్యమునఁ గడున్. 42

ఉ. చందురు నంది పద్మగుణసంపదఁ బద్మము నంది కల్వపూ
విందు రుచిన్ రవం తనుభవింపఁగ లేని విలోలలక్ష్మి యిం
దిందిరవేణి నెమ్మొగము నెమ్మిని జేరి యనారతమ్ము నా
నందము చెందు నిందు నళినమ్ముల రెండిటి యింపు గాంచుచున్. 44

తే.గీ. అలరుకుందంపుటలరు కెందలిరుటాకు
నందు నిలిచిన నాణిముత్యంబు మెఱుఁగుఁ
బగడమందున్నఁ జెలిమిన్న తొగరుమోవిఁ
జిందు క్రొందెలి నవు సాటి చెందవచ్చు. 45

[1]తే.గీ. పెల్లయినగాలిఁ గంపించు నల్లగల్వ
దొరయు నళినాయతాక్షి బిత్తరపుఁజూపు
లేటిచెలులొద్ద నేర్చెనో లేమగాక
లేమయొద్దనె నేర్చెనో లేటిబోంట్లు.



చ. అల కలభాషిణీమణి నవామృత మొల్కెడునట్లుగాఁ జవిన్
గొలుపు నెలుంగుతోడఁ బలుకుల్ వెలయించెడు వేళలందుఁ, గో
యిలకలనాద మైన రుచియింపదు సుంతయుఁ జొప్పు దప్పఁదీ
వెల నెలయించి మీటునెడ వీణవలెన్ వినునట్టి వారికిన్. 46

[1]చ. **అలఘుసమీర ణేరణఁ. జలాచలమై తగునల్లగల్వతోఁ**
**దుల యన వచ్చుబిత్తరపుఁదొంగలిచూపు మృగాంగనాళిచేఁ**
**గలుకులమిన్న నేరిచెనొ కా కటులా హరిణీగణంబె యీ**
**నళినదళాక్షిశిక్ష వలనన్ గ్రహియించెనొ యెంచి చూడఁగన్.** **47**

చ. కడఁగి శలాకఁదీర్చిన చొకాటపుఁగాటుకరేక లట్లుగాఁ
గడు నిడుపై యెసంగు గిరికన్నియ కన్బొమలందుఁ గల్గనె
క్కుడుసొబగుం గనుంగొనుచుఁ గ్రొన్ననవిల్తుఁడు నెమ్మనంబునన్
విడిచె స్వకీయచాపరమణీయతఁ గల్గునఖర్వగర్వమున్. 48

తే.గీ. పశువులకుఁ జిత్తమున సిగ్గు పరఁగునేని
కలికి చికురకలాపంబు గాంచినపుడె
చమరము లవేల తమకు వాలములయందుఁ
గ్రాలు ప్రేమంబు సడలింపఁ జాల కుండు. 49

తే.గీ. సోయగం బెల్ల నొక్కచోఁ జూచు వేడ్క
ధాత సర్వోపమావస్తుజాత మరసి
వానివానికిఁ దగుపట్లఁబూని నిలిపి
చాన నిర్మించెఁ గాక యీసొరు గలదె. 50

ఉ. నారదదేవమౌని యొకనాఁడు తలోదరి తండ్రిచెంత నిం
పారఁగ నున్న నిష్టగతి నచ్చటికిం జనుదెంచి కాంచి యీ
సారసనేత్ర నెయ్యమున శంభునిదౌ సగమేనుఁ జేకొనన్
నేరుచు నేకదేవి యయి నివ్వటిలన్ గల దంచు వాకొనెన్. 51

చ. అనఘతదుక్తి నద్రిపతి యల్లుఁగ నన్యునిఁ గోరఁ డాత్మలోఁ,
దనసుత నిండుజవ్వనము దాలిచి గ్రాలుచునున్న , మంత్రపా

[1]అ.వె. అదుగ కున్న హరున కద్రిభర్త కుమార్త
నీయఁ కలఁగఁ, డెంత యిష్టవస్తు
వైన వేడ కార్యులన్యుల వేఁడియు
వితయ యగువో యనుచు వెఱచి మదిని.

వన మగుహవ్యముం గొనcగc బాత్రత చెందునె యెంచి చూచినన్
ఘనసవనానలుం డొకcడెగాక తదన్యము లైన తేజముల్. 52

[1]క. అడుగని హరునకు నీయం
గడcగcడు నగమౌళి పుత్రికను శిష్టజనుల్
గడుcబ్రియమగు నర్థంబే
నడుగరు బరు, నడుగు టాఅడగునొ యనువెఅన్. 53

క. ఏనాc డాసతి దక్షుని
పైనలుకన్ మేను విడిచెc బ్రాగ్జన్మమునం
దానాcడు మొదలు సంగము
మాని శివుం డుండె నుపయమవిముఖమతితోన్. 54

మ. స్థిరధీయుక్తిc దపంబుకై యధివసించెం జర్మచేలుండు సుం
దరగంగాలహరీసముక్షితలసద్దేవద్రుసంతానమున్,
హరిణోత్తంసవిముక్తనవ్యమదగం ధానూనమున్, గిన్నరో
త్కర సంగీతసుధానిధానము గిరీంద్రప్రస్థసుస్థానమున్. 55

మ. ఘనమౌ మూcపుర మొప్పc గ్రొవ్వున వినంగా నింపు సొంపారు భం
గి నటన్ బుంగవపుంగవుం డిడియె అంకెన్ సింగపుంగర్జనన్
విని సైరింపక, గిట్టక్రొమ్మొనలచేc బెన్మంచురా ల్దవ్వుచున్
దను నెట్లో గురుబోతుపిండు గనc గాతర్యాతిరేకంబునన్. 56

తే.గీ. అందుc దనయష్టమూర్తులయం దొకc డగు
ననలు నింధనసంపూర్తి నలర నిలిపి
తపములకు నెల్ల ఫలదాత తానె తపము
చిత్తమున నేమికోర్కినో చేసె శివుcడు. 57

చ. వెల దెలియంగ రాని తనవిందున కర్మిలి నర్ఘ్యపాద్యముల్
వలిమలచందురుం డొసcగి, పద్మజముఖ్యసురైకపూజ్యు న
త్యలఘుcడు పూజ జేసి తగ నాతనికిం బరిచర్య సేయ ని
ర్మలతరగాత్రి నంపె సుకుమారిc గుమారి సఖీసమేతc గాన్. 58

ఆ.వె. అంతరాయభూత యైన సమాధి కా
యువిద, యామె సేవ కొప్పె శివుcడు,
గలcగ వేరిమతులు, కలిగియున్న వికార
కారణములు, వారె ధీరు లనcగ. 59





తరల. నిరతి నిత్యసుకృత్యరాజికి నీరదర్భలు పూజకై
విరులునుం గొనివచ్చు, నేరిచె వేదికం దుడువంగ నీ
కరణి నిచ్చలు నీలకుంతల కాలగళు సేవించెc ద
చ్ఛిరమునందలి యిందు నంశులచే శ్రమంబు శమింపcగాన్. 60

---

క. వేదాంతవిచారసుధా
స్వాదనవిస్మృతసమస్తసంసృతివికృతీ!
శ్రీదసఖభక్తినిరతి! ర
జోదూరప్రకృతి! సోమసుందరకృతీ! 3

తే.గీ. ఇది యుమాసంభవం బనc బొదలు మొదటి
సర్గ సత్కూచిమంచివంశ్యవర సోమ
సుందరకవీంద్రవేంగమానందనాగ్ర్య
సాంబశివకృతాంధ్రకుమారసంభవకృతి. 4

---

శ్రీః

# శ్రీమదాంధ్ర కుమారసంభవము

## ద్వితీయాశ్వాసము

---

శ్రీరమ్యధీవిహారా!
వారిధిగంభీర! సత్యవాగాధారా!
భూరినిజకటాక్షవిహిత
సూరిజనోద్ధార! సోమసుందరధీరా! 1

క. అవధారు సదయహృదయా!
వివరించెద నవలికత సవినయభయమతిన్
గవికాళిదాసవిబుధ
ప్రవరపదాంకానుగాంధ్రభవ్యోక్తితతిన్. 2

---

క. తారకుచే నాతటి బ్రం
దారకులు గడుం గలంగి తా రందఱు నా
స్వారాజు ముందు సన సర
సీరుహసంభవుగృహంబు సేరిరి వెతతోన్ 1

క. ఆనలువ వాడుమోముల
జానులతో వచ్చుదేవసమితికిఁదోఁచెన్
భానుండు మొగుడుఁదమ్ములఁ
బూనుకొలంకులకుఁ బ్రొద్దుపొడుపునఁబోలెన్. 2





ఆ.వె. సర్వకర్త యైన సర్వతోముఖునకు
సర్వదేవతలును జాగి మ్రొక్కి
నతు లొనర్చి రర్థయుతవేదవాక్కుల
వాగధీశ్వరున కవార్యభక్తి. 3

క. మ్రొక్కెదము సృష్టి కట ము
న్నెక్కటివై మూఁడు గుణము లేర్పఱుప నటన్
బెక్కగుచందము లందుచు
నెక్కొను మూర్తిత్రయాత్మునికి నీ కనఘా! 4

ఆ.వె. అభవ నీయమోఘ మయినట్టి తేజంబు
జలములందు విడువఁ గలిగె దాన
ఘనచరాచరాత్మకప్రపంచము గాన
దాని కీవ బుధులు తండ్రివండ్రు. 5

క. అనఘ యవస్థాత్రితయం
బున మహిమను విస్తరించి భువనంబులకున్
జననస్థితిలయకారణ
తను జెందుచు నొకఁడ వయ్యుఁ దత్త్వం బరయన్. 6

తే.గీ. విశ్వము సృజించుకోర్కిచే వేఱుపాటు
చెందు నీగాత్రభాగముల్ స్త్రీపురుషులు
జనన మందిన యీసర్వసర్గమునకు
నవియె తలిదండ్రు లండ్రు తత్త్వార్థవిదులు. 7

క. భవదీయకాలమాన
ప్రవిభక్తము లయిన రేయుఁ బవలుంగలనీ
ప్రవితతనిద్రాబోధము
లవియ యవున్ జంతుసముదయాంతోదయముల్. 8

సీ. హేతువై జగమున కీ వహేతుకుఁడవు
విశ్వేశ్వరుఁడవు నిరీశ్వరుండ
వాదియై సృష్టి కనాది వౌదువు నీవ
యఖిలాంతకుఁడవు నిరంతకుఁడవు
నేర్తువు నీచేత నిను నీవెఱుంగఁగ
నీచేత సృజియించి నిన్ను నీవ

నీయంద లయమందఁ జేయఁ జాలుదు వీవ
ద్రవమును గఠినతరంబు మఱియు

ఆ.వె. దృశ్య మదృశ్యంబు తేలిక బరువు నై
గ్రాలునవియుఁ గార్యకారణములు
నగుదు వీవ నీదునభిలాష కైశ్వర్య
సముదయము వశంవదము మహాత్మ! 9,10,11

మ. మొద లోంకారము విశ్రుతస్వరములన్ మూఁడింట నుచ్చారణం
బుదితం బైనక్రియాకలాపము క్రతువ్యూహంబు రాజత్ఫలం
బదితిప్రోద్భవలోకనిశ్చలనివాసావాప్తి గాఁ బొల్చు బ
ల్చదువుల్ పుట్టినపట్టు నీవ గద యోసద్భక్తచింతామణీ! 12

క. పురుషార్థములఁ బ్రవర్తిలు
వరమూలప్రకృతి నీవ వారక దానిన్
బరమతటస్థత నరసెడు
పురుషుఁడవును నీవ యంద్రు బోధైకపరుల్. 13

క. పితరులకుఁ దర్పణీయుఁడ
వతులితగతి నమరులకును యాజ్యుఁడవు ప్రజా
పతులకును విధాతృఁడ వ
ప్రతిమా! పరవస్తుకంటెఁ బరుఁడవు తెలియన్. 14

క. హోతయు హవ్యము నీవే
జ్ఞాతయు జ్ఞేయంబునున్ సనాతనవిభవా!
ధ్యాతయుఁ బరమధ్యేయము
నోతండ్రీ! నిత్యభోక్తయును భోజ్యంబున్. 15

క. అని సత్యమనోజ్ఞము లై
తనరెడు నుడువుల సుపర్వతతి నుతియింపన్
విని సుప్రసన్నుఁ డగుచును
వనజభవుం డిట్టు లనియె వారికిఁ బ్రీతిన్. 16

క. వెలయఁగఁ దొల్లిటికవి యగు
నలువ యుదారముగఁ దనదు నలుమోములతోఁ
బలుకుడుఁ బలుకుంబడికిని
నలుదెఱఁ గగుటకుఁ బ్రయోజనము గనిపించెన్. 17





చ. అనుపమవిక్రమాంకితమహాభుజులార! నిజోరుశక్తులన్
ఘనతర మైనయుష్మదధికారతతిన్ వహియించు చుండియున్
గనుకని నంద టొక్కమొగి గా నిట కిట్లరుదెంచినట్టిపా
వనమతులార! యెల్లరకు స్వాగతమే గద మీకు నెందునున్. 18

ఆ.వె. ఏమి బిడ్డలార యిది నేఁడు మీమోము
లెల్ల సహజశోభ కొల్లవోయి
హిమము గప్పి కాంతి యేదిన తారల
తీరు గూరి తొంటి తెఱఁగు దొఱఁగె. 19

క. అక్కజముగఁ జిత్రరుచుల్
గ్రక్కుచుఁ బెనుమంటలాఱఁగా నహిరిపుచే
నెక్కొనుపని నిజధారలు
మొక్కలు వోయినప్రకారమునఁ గనిపించెన్. 20

క. అరుల కనివార్య మగుచున్
వరుణునిచే నుండు త్రాడు పటుమంత్రముచే
ధరఁ జేవ చెడిన కాకో
దరముగతిన్ గానిపించె దైన్యాకరమై. 21

క. కొమ్ములు విఱిగిన మ్రాఁకు వి
ధమ్మున గద వదలి యున్న ధనదు భుజమ్మున్
టొమ్మున నాటిన సెలతో
య మ్మగుబన్నమ్ము దెలుపు నమ్మెయిఁ దోచెన్. 22

క. యముఁడు నమోఘముగా ము
న్నమరినదై నేఁడు మిన్కు లాఱిన గుదియన్
క్షమ వ్రాయుచు నాఱిన యు
ల్కమునకు నగుజుల్కఁ దనము లలి దాని కిడెన్. 23

క. అరిదిగ నిదేమి యీ భా
స్కరులును నిజతేజ మాఱి చల్లంబడి చి
త్తరువున వ్రాసిన బొమ్మల
కరణిఁ జులుకఁ జూడఁ దగిరి గ న్నెత్తి కడున్. 24

క. తడవాటుచేత గాడ్పుల
వడి చెడుట యెఱుంగఁబడియె; వాటంబగు జా

లుడుగుట గడుc దెల్లంబగు
వడువున నీ ర్మెరక కెదురు వాఱుటచేతన్. 25

క. తీరుచెడి తూలు సిగలంc గి
శోరనిశాకరులు వ్రేల సొంపఱినవియౌ
నీ రుద్రుల తలలను హుం
కారంబులు జాఱనట్టి గతి నెఱిcగించెన్. 26

క. తొలుతc బ్రతిష్ఠితు లగు మిము
బలవత్తరు లరులు పదిలపడి సామాన్యం
బుల విధుల విశేషంబులు
బలెc బోవcగ నడిcచి రొక్కొ పదములు తొలcగన్. 27

ఆ.వె. కానc గూడి వచ్చి యీ నా వలన మీర
లన్నలార! గోరునర్థ మేమొ
చెపుడ విశ్వమునకు సృష్టియ నాపని
రక్షణము భవత్కరస్థమె కద. 28

క. అన విని తనుపవనాందో
ళనవిచలన్నళినమౌ కొలంకున కెనయై
తనరు తన వేయుcగన్నుల
ఘనుc డనిమిషవిభుcడు గురుని గని పురికొల్పెన్. 29

చ. అమితజగత్ప్రసిద్ధ మగునక్షిసహస్రముకంటె నెక్కుడై
యమరు ద్వినేత్ర మైనయమరాధిపునేత్ర మనంగc జెల్లును
త్తమమతి యాబృహస్పతి యథావిధిc జేతులు దోయిలించి యి
ట్లమలమృదూక్తులం బలికె నంబుజసూతికి నుత్తరంబుగా. 30

క. దేవరవారు వచించిన
దే వాస్తవ మరులు మాయధీకారములన్
లావునc గైకొని రఖిలహ్రా
దావాసుల కెట్లు తెలియ దయ్యది తమకున్. 31

క. తమ వరములచే బలవ
త్తముc డగుచును దారకాఖ్యదనుజేంద్రుcడు లో
కముల పెనుజేటుకై యుద
యము గనియెం దోcకచుక్క యట్లుగ్రగతిన్. 32





సీ. రవి డిగ్గియల తామరల విప్పc గలయెండ
కథికంబుగాc గాయc దతని ప్రోల
రా జొక్క శివశిరోరత్నమౌ రేక గా
కఖిలకళల గొల్చు ననిశ మతని
పవనుcడు సుమచౌర్యభయమున వనిc బాసి
వ్యజనమాత్రమె వీచు నతని పజ్జ
ఋతువు లాఋను వంతు లెడసి పూవులు గూర్చు
నారామపాలుర ట్లతని కెపుడు

తే.గీ. నంబుధియు వేచి యుండు నేకాగ్రవృత్తి
నతనికయి కానుకలు సేయ నర్హ మైన
శస్తతమజాతిరత్నముల్ జలములందుc
గలుగునంతకు మిగుల నుత్కంఠతోడ. 33–37

ఉ. భాసురమౌళిరత్నరుచివారముతో స్థిరదీపమూర్తులై
వాసుకిముఖ్యు లాతని విభావరిc గొల్తు; ప్రసన్నుc జేయు న
య్యాసురు వాసవుండును సురాగమభాషలు వెట్టి దూతలన్
వాసిగc బంపు చాతని కృపాపరిపాకము గోరి సారెకున్. 38

తే.గీ. ఇట్లు సేవించిన యొకించు కేని వాcడు
పూనిన జగత్త్రయీహింస మానc బోcడు
కూళ మేలునc దనబుద్ధిc జాలుకొనునె
తనకుc దగినట్టిమాఱుc గీడుననె గాక. 39

ఆ.వె. వేని కెంజిగుళ్ళు వేల్పుcగన్నెల కేలు
కరముc గనికరంబు గదురc జిరుము
నట్టినందనంపుcజెట్టుల కతగాcడు
చీలి కూలు టెఱుcగc జెప్పినాcడు. 40

క. అదయతc జెఱవట్టి నసుర
సుదతులు స్వాశ్రువులc గురియు సురటీలను వీ
చెద రతనికి నిదురించెడు
నదనున నిఃశ్వాసతుల్య మగుగాడ్పులతో. 41

క. శతపత్రమిత్రహయఖుర
హతిచే నుగ్గయిన కాంచనాద్రిశిరస్సం

తతిఁ బెటికి తెచ్చి యాతఁడు
కృతకాద్రు లొనర్చెఁ దనదు గృహదేశములన్. 42

క. చద లేఱున దిగ్వారణ, మదకలుషంబైనజలము మాత్రము దక్కెన్
దుద కిప్పు డతని బావులె,కద బంగరుఁదమ్మి పైరుగములకుఁ దావుల్

క. ఆకాశయానపథములు, ప్రాకటముగ నతని కెదురుపడుభీతిఁ జెడన్
నాకౌకసులకు నానా, లోకాలోకనవినోదలోలత దూలెన్. 44

తే.గీ. క్రతువులందు యజ్వతతి మాకు నిడు హవ్య
ముల నితండు మాయ మలయఁ గొనుచుఁ
గన్నులార మేము గనుచుండ మా వీతి
హోత్రముఖము వలన నుండి పెఱికి. 45

క. శతమన్యుని చిరకాలా
ర్జిత మగుసత్కీర్తిమూర్తిఁ జెందినగతి ను
న్న తురంగమపతి నతులో
న్నతి నుచ్చైశ్రవము నతఁడు నాఁచికొనె వెసన్. 46

క. వేయేల క్రూరుఁ డై తగు
నా యసురుని యందు మా యుపాయము లెల్లన్
బోయెఁ గొఱమాలి పటుతర
జాయుగణ మసాధ్యసంధిజాడ్యమున బలెన్. 47

ఆ.వె. అస్మదీయమౌ జయాశ కాధారంబు
విష్ణుచక్ర మతని వీఁకఁ దాఁకి
ప్రతివినిహతిఁజేసి బలుమంట లెగయంగఁ
బతక మగుచు నతని కుతుక నతికె. 48

క. ఐరావతజైత్రము లగు
నారక్కసు కరులు పుష్కలావర్తకము
ఖ్యోరుతరముదిరములపై
వారక నేఁ డభ్యసించు వప్రక్రీడల్. 49

ఉ. కావున దేవ! వేఁడెదము గ్రక్కున రక్కసు రూపుమాపఁగా
దేవచమూపతిన్ గురుమతిన్ సృజియింపఁగ మిమ్ముఁ గర్మబం
ధావళిఁ గోయుధర్మము మహత్తర మౌ భవబాధ మాన్పఁగాఁ
గోవిదులౌ ముముక్షువులు గోరెదు తీరున వారిజాసనా. 50



క. క్రతుభుక్పృతనావనుఁడగు
నెతఁడు మొన న్నడుపఁగా జయేందిరను దివ
స్పతి బందా నటు దెచ్చున్
దితిసుతతతిఁ బాపి, యట్టిదిట్ట నొసఁగుమా. 51

క. అమరార్యు నయ్యుపన్యా
సము వెంట విరించి యిడిన సత్ప్రతివాక్యం
బమరె ఘనగర్జ వెంబడి
క్షమఁ బడియెడి జడిని గెలువఁ గలచెలువముతో. 52

సీ. చేకూర నున్నదీ మీకోరినది కొంత
వడి నిరీక్షింపఁగా వలయు నింక
నీయర్థ మెన్న మదీయసర్గక్రియ
వలన సాధింపఁగా వలను పడదు
వర్ధిల్లె వాఁడు నావలనఁ గాన వినాశ
మును నావలనఁ జెందు టనుచిత మగు
నెసఁగఁ బెంచిన విషవృక్షంబు నైనను
దనచేతనే త్రుంపఁ దగవు గాదు

తే.గీ. వర మిదే వేఁడినది మున్ను వాఁడు నన్ను
నప్పటికి వాని కొసఁగితి నావరంబు
వరముచేఁగాక శమియింపఁదరమె? వాని
లోకదహనోగ్ర మగు దురాలోకతపము. 53–56

చ. సమరకళాప్రవీణుఁడు నిశాచరకుంజరుఁ డాహవాఖిలా
షమునఁ గడంగి వచ్చినను శక్యమె యాతని నోర్వ నేరికిన్
సముచితపాత్రముక్త మగుసామజదైత్యవిదారివీర్యలే
శమునకుఁ దక్క నీభువనజాలమునం బరికించి చూడఁగాన్. 57

క. ఆ విభుఁడు తమోవార్ధికి
నావలిదరి నెప్పుగొన్న యరిది వెలుం గౌ
భావింపఁ జాల మతనిప్ర
భావవిభూతిని రమాధిపతియున్ నేనున్. 58

క. అతులతపః స్థిర మగుపశు
పతిచిత్తము మీ రుమానుపమరమణీయా

కృతిచే నాకర్షింపుఁడు
క్షితిపయి సూదంటురాతిచే నుక్కు బలెన్. 59

క. ఇరువుర వీర్యముఁ దాల్పఁగ
నిరువురె చాలుదురు చాల రిఁక నెవ్వరు; నీ
శ్వరువీర్యమా యపర్ణయు
నరు దగుమద్వీర్య మతనియమ్మయతనువున్. 60

ఉ. ఆ యకలంకునాత్మ సుతుఁ డై జనియించి సుపర్వవాహినీ
నాయకుఁడై సురారికులనాథుఁడు మున్ జెఱ గొన్నదేవతా
తోయజపత్రలోచనలు దువ్వక పోవఁ, దదీయకైశ్యముల్
వాయక కట్టినట్టి జడలన్ విడిపించుఁ బరాక్రమోన్నతిన్. 61

క. అని యిట్లు నళినసంభవుఁ
డనిమిషగణములకుఁ దెలిపి యంతర్హితుఁడై
సన వారు నజుని యానతి
మనముల నునుచుకొని చని రమరవరపురికిన్. 62

క. అందునకుం దగు నని సం
క్రందనుఁడు సుమాస్త్రు నెంచి కార్యాతురుఁడై
తొందర గొని యినుమడి రయ
మందిన తన డెందమందు నతనిం దలఁచెన్. 63

తరల. అలరు విల్దొర యప్డు బల్వగలాండ్ల కన్బొమలందముల్
గలుగుకోపులసింగిణిన్ రతికంకణాంకనిజోజ్జ్వల
ద్గళమునం దిడి చూతపల్లవకాండ మాత్మసహాయుఁడౌ
నలవసంతుని కిచ్చి చేరె బలారి నంజలిధారియై. 64

---

క. విదితాగమాంతమర్మా! సదమలదానామృతప్రశమితార్థిసుధీ
హృదరుంతుదా ర్తివర్ధి, ష్ణుదైన్యవిషమేర్మ! సోమసుందరశర్మా! 3

తే.గీ. ఇది సురవిరించిసంవాదకృతి ద్వితీయ
సర్గ వరకూచిమంచివంశ్యమణి సోమ
సుందరకవీంద్రవేంగమానందనాగ్ర్య
సాంబశివకృతాంధ్రకుమారసంభవకృతి. 4

---





శ్రీః

# శ్రీమదాంధ్ర కుమారసంభవము
## తృతీయాశ్వాసము

---

శ్రీకంఠచరణకమల
ప్రాకటభృంగాయమానభావా! ధృతినా
కౌకోగ్రావా! మోహా
స్తోకవనీదావ! సోమసుందరదేవా! 1

క. అవధారు సురోక్తివనా
గ్రవిహృతికృతి కాళిదాసకవిసింహపదాం
కవితత్యనుసృతివిరతాం
ధ్రవచస్తతి నవలికత వినతితో వినుతున్. 2

---

ఉ. ఆ యరవిందసాయకునియందు బలాసురహర్త నేత్రముల్
వేయును బర్వె నొక్కపరి వేల్పుల నందఱ వీడి గౌరవ
శ్రీ యొకచాయనే నిలువరింపదు రాజుల కాశ్రితావళిన్
బ్రాయముగాఁ బ్రయోజనపరంబులు కావుట వారి చిత్తముల్. 1

చ. అతిశయితానురక్తి నమరాధిపుఁ డిచ్చటఁ గూరుచుండు మం
చతనికిఁ జో టొసంగిన నిజాగ్ర్యసమున్నతపీఠసన్నిధిన్
బతికృతమౌ ననుగ్రహము భక్తియుతిన్ శిరసావహించి యే
కతమున నాతఁ డిట్లు పలుకం దొడఁగెన్ దివిజాధినాథుతోన్. 2

చ. పురుషవిశేషముల్ దెలియు బ్రోడవునీకు జగత్త్రయంబునం
దిరవుగఁ జేయఁగాఁ దగిన దెయ్యది? చయ్యన నానతిమ్ము కిం
కరు నను నెమ్మదిం దలఁపఁగాఁ బ్రకటం బగునీభవత్కృపాం
కురము నియోగవారి నిడి గూరిమిఁ బెంపు నిలింపచంద్రమా! 3

చ. తెలుపు మెవండు, దేవ! భవదీయమహామహనీయమౌ పదం
బలఘుతపంబునన్ గొనఁబ్రయత్నము సేయుచు నీయసూయ న
గ్గలముగఁ జేయువాఁడతనిఁ గన్గొను నేఁ డిదె నాదుసంహితో
జ్జ్వలశర మౌ శరాసనము శాసనముం దలఁ దాల్పఁ జేసెదన్. 4

చ. జనిమరణాదిఖేదముల సారెకునున్ బడ లేక భీతుఁడై
యనుగతముక్తి మార్గుఁ డగునాతఁడెవండు భవద్విరోధి? వాఁ
డనిశము వాలుఁగంట్ల చెలువౌవిడి త్రిప్పుల నొప్పుబొమ్మలన్
దనరు చలద్భృగంచలగుణంబుల బద్ధుఁ డగున్ మదాజ్ఞచేన్. 5

చ. అనిమిషరాజ! చెప్పుమ నయాగమశిక్షను శత్రుచేతనే
యెనసిన యేభవద్రిపుని బుక్ధము ధర్మము రాగదూత నే
ననిపి క్షణంబులోఁ జెఱతు; నగ్గలపుంబెనుపారువెల్లి నె
ట్టనఁ దటినీతటంబు లొకటం బడఁ గూలుచునట్టిచాడ్పునన్. 6

చ. అతులపతివ్రతాత్వనియమాధికనిష్ఠురకష్ట మొందు నె
వ్వతె నతిలోలుపం బగు భవన్మతి మోహనరూపవిభ్రమో
న్నతిమెయిఁ జొచ్చినట్టి యెలనాఁగను గోరెదు సిగ్గు వీడి నీ
కుతుక భుజాలతల్ వెనఁచి కూర్మిఁదనంతఁ గవుంగిలింపఁగా? 7

ఉ. కోరిక మీఱ వేఱొకతెఁ గూడిన నేరమి నెంచి యల్క నే
వారిజగంధి పాదముల వ్రాలిననిన్నుఁ దొలంగఁద్రోచె? నా
నీరజనేత్ర గాత్రలత నేఁ డిదె చూడుము గాఢవిప్రతీ
సారము బారికిం గిసలశయ్యనె దిక్కని డాయఁ జేయుదున్. 8

చ. మదిని గలంక దక్కుము శ్రమం బఱి శంబము నుండ నిమ్మిఁకన్
త్రిదిశవిరోధులం దెవని ధీరవరేణ్య మదీయతేజిత
ప్రదరపరంపరల్ భుజపరాక్రమ మాఱడి వుచ్చి యల్కచే
నదరెదు వాతెఱల్ గల లతాంగులకున్ వడఁకింతుఁ జెప్పుమా. 9

చ. అనిమిషనాథ! నీదగుదయన్ సుకుమారతరప్రసూనసా
ధనుఁడనె యైన నే నొకలతాంతబుతూద్వహు సాయ మందినం





తనె ధృతిహీనుఁ జేయుదు పినాకధనుర్ధరుఁడౌ గిరీశు నై
నను నన నెంతవార లిఁకనాకుఁ బరుల్ బలువిల్లుఁదాల్పరుల్. 10

చ. అనవుడు నైజచారుచరణాంబుజముం దొడనుండి డించి య
ల్లనఁ బదపీఠికిన్ లలి నలంకృతి సేయఁగ నుంచి మేఘవా
హనుఁ డట జింతితార్థఘటనామితచాతురి నుగ్గడించు నా
ఘనసుమనోధనుర్ధరుని గాంచి సమంచితరీతి నిట్లనున్. 11

ఉ. ఈయెడ నీవు పల్కినవి యెల్లను మిత్రమ! చెల్లు నీయెడన్
నా యిరువాఁడికైదువు లనన్ శతకోటియు నీవ యందు వ
జ్రాయుధ మెన్న వ్యర్థము తపోఽనుపమానతనుత్రధారులం
దేయెడ నైనఁ జొచ్చి పని యెంతటి దైనను దీర్ప నీక యౌ. 12

చ. మనమున నీదు శక్తిగరిమంబు నెఱింగినవాఁడఁ గాన నే
ననితరసాధ్య మౌపనికి నంపెద నాసరివాని నిన్ జనా
ర్దనుఁడు మహామహీభరణదక్షుని గాఁగ నెఱింగి శేష ని
ల్పును గద స్వీయకాయభరమున్ దగఁ దాల్ప ననల్పతల్పతన్ 13

చ. పటుగతి "మామకాస్త్రములు పర్వఁగ నోపును శర్వుపై" నటం
చిటు లను టీవు మాయరిదికృత్యము నొయ్యనఁ దీర్ప నియ్యకొ
న్నటె యిఁక నయ్యె; నియ్యెడ బలాధిక వైరులు యాగభోజనుల్
ఘటనము గోరుకార్య మిదె గాఁగ నెఱుంగుము శంబరాంతకా! 14

చ. అది యెటు లన్న శాత్రవజయార్థము గోరుచు నున్నవారలీ
త్రిదశులు దండనాథు హరుతేజముచే జనియించునట్టి బ
ల్లిదు నలశూలపాణియు లలిన్ నిజమంత్రములన్ న్యసించుచున్
బొదలెడు బ్రహ్మనిష్ఠ మదిఁ బూని భవత్ప్రదరైకసాధ్యుఁ డై. 15

చ. అచలసమాధినిష్ఠుఁ డగు నాశితికంఠునకుం బవిత్ర యౌ
నచలకులావతంసుతనయామణిపై రుచి కల్గఁ జేయఁగా
నచిరగతిం గడంగు సతులందు గిరీశనిషిక్తవీర్యపుం
బ్రచుర భరంబు దాల్ప నితరల్ తగ రంచు విరించి మున్ననెన్. 16

చ. జనకు ననుజ్ఞచేత నలశైలకుమారియు నిప్డు పర్యుపా
సన మొనరించుచున్న యది చారునగోపరిదేశవాసి యై
ఘనతప మాచరించు కఱకంఠున కంచును నప్సరోముఖం
బున వినువాఁడ వా రచటఁ బూని చరించుట నాకు వేగు లై. 17

ఉ. కాన జయంబు గైకొనుట కై చను! చేయుము! దేవకార్యమున్
గా నయి యున్నదీ యరిదికర్జము వేతొకకారణంబుచే
నైనను గోరి యుండు నిను నగ్రిమహేతువు గాఁగ; విత్తుచేఁ
గా నయి యున్న మొల్కకును గావలె నీరము మొల్చునంతకున్. 18

చ. అమరజయాభ్యుపాయ మగు నంబరకేశునియందు బాణపా
త మని వచింప నీయదియె ధన్యుఁడ వౌదు దలంప నీవు; లో
కమున న దెంతవిశ్రుతము గానిది యైన ననన్యసాధ్య మై
యమరుపనిన్ బొనర్చినఁ గదా! కన నేర్తురు కీర్తి పూరుషుల్. 19

ఉ. ఈయది కోరువార లన నీయమృతాశను; లెన్నఁ గార్యమా
శ్రేయము ముజ్జగమ్ములకుఁ జేయుట యన్న నదీనవృత్తిగా
నాయతచాపదండమున; నద్దియుఁ గాదతిఘాతుకంబు నౌ
రా యిటు లుండఁగావలెఁ బరాక్రమ మన్న జగన్నుతంబుగాన్ 20

ఉ. సారసబాణ! యీ ఘనవసంతుఁడు నీసహచారి గానవె
వ్వారును గోర నేమిటి కవశ్య మగున్ సహకారి నీకు నా
కారణ సేయఁగా నెవరు గావలె నారయఁగా సమీరణున్
బ్రేరణ మీవు వహ్ని కొనరింపఁగ ర మ్మని వేగిరమ్మునన్. 21

ఉ. ఆదృతి వల్లె యంచుఁ బ్రభునాజ్ఞ దదర్పితమైనమాల్యమ
ట్లౌదలఁ దాల్చి పొంగుచు బయల్ వెడలెన్ విరివింటిజోదు; జే
జేదొరయుం జెలంగి సురసింధురమున్ జమురం గరోరతా
శ్రీ దయివాఱునట్టి తన చే నిమిరెన్ దగ వాని నెమ్మేయిన్. 22

ఉ. ఆతఁ డటన్ నిజప్రియవయస్యుఁడు మాధవుఁడున్ మనంబునన్
భీతిలు నారతీసతియు వెన్కొనఁ దీర్చెద దేవకార్యమున్
ఖ్యాతిగ దేహపాతమున నైన నటంచు సునిశ్చితాత్ముఁడై
శీతనగంబుపై నజినచేలు తపోవనభూమికిన్ జనెన్. 23

ఉ. అంతఁ దదాశ్రమంబున యతాత్ములు మౌనివరుల్ చరించునే
కాంతతపస్సమాధికి నికామవిరోధియుఁ జిత్తసూతి క
త్యంతమదాస్పదంబు నగునాకృతితో విడిసెన్ వసంతభూ
కాంతుఁడు గాన నంతట శుకప్రకరాది చమూసమేతుఁ డై. 24

చ. సమయము దప్పి తిగ్మరుచి చాగినదౌ తనపొందు వీడుచున్
బ్రమ యెనయం గుబేరపరిపాలితయౌ దెసఁ జెందఁ బోవు చం





దము దలపోసి డెందమున, దక్షిణ యైనవరాశ గంధవా
హమును వెలార్చె;నుమ్మలిక నయ్యెడునూ ర్పన నెమ్మొగమ్మునన్ 25

చ. కలుకులు గిల్కుటందియలఁ గ్రాలుపదంబులఁ దన్నకుండనే
లలి మొదలంటఁగా నలరులన్ దలిరాకులతోడఁ గూడ మం
జులగతి నీనె నొక్కమొగిఁ జోద్య మెసంగ నశోకపాదపం
బలరెడు తత్ప్రశస్తకుసుమావసరాగమమందు నేర్పుతోన్. 26

ఉ. ఆమనిశిల్పి లేఁదలిరుటందపుఱెక్కలతోడఁ గూడఁ, గ్రొ
మ్మామిడిపూజిరా పరిసమాప్త మొనర్చుచుఁ, జేర్చె దానిపైఁ
గామధునుష్కు నామమునఁ గ్రాలెడుమేలగుప్రాలుఁబోలె సు
శ్యామలకోమలాంగరుచిసంగతతుందమిళిందబృందమున్. 27

ఉ. పెం పగువర్ణపుంబసకుఁ బెట్టిన పేరయినట్టి కర్ణికా
రంపుఁబ్రసూన మారయఁ గరంబు మనంబు విచారవారిధిన్
ముంపు గనంగఁ జొచ్చె; నదిపోలుఁ గదా, గుణబృంద మెందును
న్నిం పెనయింపఁ బోదరయ నీరజసంభవు చెయ్ది పల్మరున్. 28

చ. కర మవికస్వరంబు లయి కందువుఁజందురువంపుసొంపునన్
గురుతరరక్త కాంతిరమ గూరిన మోదుగ మొగ్గచాల్ తగెన్
సరసవసంత కాంతనవసంగత లౌచుఁ జెలంగు కాననేం
దిరలు వహించు నూత్నరమణీయనఖక్షతపాళిపోలికన్. 29

చ. తగిలిన తేఁటు లన్న లలితంబగుకాటుక వ్రాఁతసొంపులన్
సొగసుగఁ జిత్రమౌ తిలక శోభ మొగంబున మించఁ గొల్పి లే
దొగపగవాని కెంపుజిగితోఁ దులయౌ రుచిపెంపు మావిక్రొం
జిగురుమెఱుంగువాతెఱకుఁ జేరిచె మాధవలక్ష్మి నేర్పుతోన్. 30

చ. హరిణకదంబకంబులు, ప్రియాళుసుమస్తబకాళినుండి బి
ట్టురులు పరాగముల్ గనుల నొత్తుగఁ గప్పఁగఁ, గారుటాకులన్
మరమరలాడ వీడెడు ద్రుమంబుల నొప్పు వనంబులందుఁ గ్రు
మ్మరె నట, ధీరమారుతుని మార్కొనుచున్ మదవైభవంబునన్. 33

చ. లలితరసాలకోమలదళంబులమేఁతఁ గషాయకంఠతన్
జెలఁగెడు గండుఁగోయిల రచించుసమంచితకూజితంబు డం
బులు పచరించెఁ, దొయ్యలులు పూనిననెయ్యపుఁగిన్క మచ్చరం
బులు తొలఁగింపఁ జాలు బలుపూవిలుతాలుపుఁజేని యానయై. 34

చ. కడవ హిమార్త్రి, వీడ్కొలిపి కప్పుడుమైనము, నైజకాంతి నిం
పడరెడు మోవులం దగి, వెలారిచి కుంకుముఁబూఁత, తెల్విఁగు
ల్కెడు వదనంబులం బొదలు కిన్నరకాంతల పత్రలేఖలం
దడు గిడెఁ జిట్టిముత్తియపుటందపుఁ జెమ్మటబొట్టు పుట్టుకల్. 35

చ. క్రమ మతి యి ట్లకాలమునఁ గ్రాలెడునట్టి మధుప్రవృత్తి సం
యమివరు లంబరాంబరవనాంతరమందిరు లంతఁ గాంచి, డెం
దముల మహత్తరశ్రమమునన్ మరలింప సమర్థు లైరి; య
త్నమున సుదుస్తరంబు లగు తద్వికృతుల్ ధృతితో నడంచుచున్. 36

చ. సురుచిరలీల నెక్కిడిన సూనశరాసము పాణిఁ బూని, తా
మరసశరుండు తద్వనికి మంజుగతిన్ రతితోడ రాఁగ, ని
ర్భర మగునట్టి ప్రేమరసభారముతోఁ దనరారు భావమున్
బొరి వివరంబుగా సలుపఁ బూనెను జంటలు మేలుచెయ్యులన్. 37

సీ. ప్రియ ద్రావి విడిచిన విరిదేనె దా నదే
సుమపాత్రమున మధుభ్రమర మానె
తను నంటఁ గనుదోయి పెనుహోయి గనుఁ మూయు
హరిణి కొమ్మున గోకె హరిణవరము
కదురక్తిఁ దమ్మి పుప్పొడి తావి పుక్కింటి
జల మిచ్చెఁ గరిణి కుంజరవిభునకు
సగము దిన్న బిసం బొసఁగి గారవించెఁ జ
క్కవపుల్గు తనదు మక్కువ చెలువను

తే.గీ. పొదములేఁ జెమ్మటని సుంతపొక్కు గండ
పత్రముల నొప్పి, సుమమద్యపానఘూర్ణ
మానలోచన మగు తన మగువ మొగము
ముద్దులిడెఁ గిన్నరుఁడు గీతముల నడుమల. 38

చ. నెరవిరిగుత్తి మొత్త మనునీ టగుగుత్తపుగుబ్బలుబ్బ, న
బ్బురపుమెఱుంగుఁగెంజిగురుమోవులతోడిలతాంగనామణుల్
వరతరులన్ మనోజ్ఞగతి వంగినకొమ్మ లటన్ బుజమ్ములన్,
గురుతరరక్తిఁ గౌఁగిళులఁ గూరిచి, రామనిశక్తి యేమన్. 39

ఉ. ఆననకారు మీఱు నపు దచ్చరగానల మేలు గానముల్
వీనులఁ జొచ్చినన్ హరుఁడు వీడక యాత్మను నిశ్చలానుసం





ధానము సేయు చుండె; నొక నాఁటికి నైన జితాత్ము లూను న
న్యూనసమాధిఁబోనడవ నోపునె సుంతయు నంతరాయముల్. 40

చ. ఉరుతరరోషవిస్మయము లొల్కఁగఁ జూచుచు నందియున్ మహే
శ్వరు పొదరింటిగుమ్మమున వామకరార్పిత హేమవేత్రుఁ డై
స్థిరమతి నిల్చి వక్త్రమునుఁ జేర్చిన చూపుడు వ్రేలిసన్నచే
దొరఁకొని యాన సేసె ప్రమథుల్ ధృతిచాపల మొందకుండఁగన్ 41

చ. కదలని ప్రాఁకులన్ మెదలఁగా ధృతిఁ బూనని తేఁటిమూఁకలన్
వదనము విప్పి పల్కఁదెగువన్ దిగ నాడిన యండజాళులన్
బదచలనంబు లేని మృగపాళులఁ దాలిచి కాన వాని బ
ల్మిదల దనర్చెఁ జిత్రమునఁ బొల్పుగ వ్రాసిన కాననం బనన్. 42

చ. సుమశరుఁ డంతఁ బైనములఁ జు క్కెదు రౌ దెస నట్లు వానియు
గ్రమయిన దృక్ప్రసారమును గ్రక్కునఁదక్కుచుఁ బ్రక్కలందు సాం
ద్రముగ నమేరుశాఖలు పెనంగొన నొప్పుచు భూతనేత ధ్యా
నమునకుఁదానకం బయి దనర్చు నికుంజముఁ జొచ్చెఁ జెచ్చెరన్. 44

చ. అల వెడవింటిదంట, తన కంతము చెంతకు రా నితాంతమున్
విలసితదేవదారుపృథివీరుహమూలవితర్దిమీఁదఁ, బ
ల్వలనగునట్టి బెబ్బులికళాసముపైఁ దగఁ గూరుచున్న ని
ర్మలినతపస్సమాధిపరమస్థిరగాత్రుఁ గనెం ద్రినేత్రునిన్. 45

మ. వరవీరాసనభాసురస్థితి లసద్బాహాగ్రముల్ వంచి, సు
స్థిర మై, తిన్ననిదైన పూర్వతనుయష్టిన్ జక్క నిక్కించి, ప్ర
స్ఫురదుత్ఫుల్లబిసప్రసూనముపసన్ బొల్పారు నంకాగ్రమం
దరుణోత్తానకరద్వయం బునుచు యోగారంభునిన్ శంభునిన్. 46

మ. సిగబందౌఫణిఁజుట్టి కట్టఁగఁ, గడున్ జెన్నార నత్యున్నతం
బగుచున్నట్టికపర్ద మొప్ప, నిరుపేటై వీనునన్ వ్రేల న
క్షగుణంబు, న్గళకాంతిసంగతి నతిశ్యామాభిరామచ్ఛవిన్
దగు కృష్ణాజిన మంచులన్ ముడిచి మేనం దాల్చుమౌనీంద్రునిన్. 47

శా. నిర్వర్షోద్యమ మైన నీరదమువన్నెన్, నిస్తరంగప్రభా
నిర్వక్రం బగునట్టి నీరధివలెన్, నిర్వేపమానద్యుతిన్
నిర్వాతోర్వి నెసంగుదీపము క్రియన్ దీపించు రూ పొందఁగా
సర్వప్రాణమరున్నిరోధి యగు నిస్తంద్రున్ వినీతేంద్రియున్. 48

మ. నయనబ్రహ్మకపాలమధ్యవిలసన్మార్గానుసారంబుగాఁ,
బ్రయతబ్రహ్మబిలంబునన్ వెడలు సాంద్రజ్యోతిరంకూరసం
చయపుంద్వైక్ష్ణభరంబుచేత నిజరాజన్మస్తకాగ్రస్తనం
ధయశీతాంశుమృణాలజిన్మృదులతన్ వాడించు చున్నాతనిన్. 49

మ. నవ సంఖ్యాకము లైనద్వారములవెంటన్ సంచరింపంగ నీ
క, వెసన్ ద్రిప్పి, సమాధిచే వశముగాఁ గావించి, చిత్తంబు శాం
తివిభూతిన్ హృదయంబునన్ నిలిపి; యేనిన్ జ్ఞానులూహింతు రం
తవిదూరుం డని యట్టితన్నుఁ దనలోఁ దాఁ జూచుచున్నాతనిన్. 50

చ. అనుపమదివ్య తేజమున నట్లు మనంబున కైనఁ గాని చు
ల్కనఁ గన రాక యున్న తిగకన్నులదేవరఁ జేరి, కాంచి, మిం
చిన వెఱచే వడంకుతనచే విడి జాఱినవిల్లు నమ్ము నై
నను దెలియంగఁ జాలఁడు మనఃప్రభవుం డిసుమంత యేనియున్. 51

ఉ. అంత నితాంతమున్ సమసి నట్టిది గాఁ గనిపించు కంతువి
క్రాంతిఁ దనూవిలాసమునఁ గ్రమ్మఱఁగాఁ బ్రదికింపఁ బూనిన
ట్లింతులమేలుబంతి యచలేంద్రకుమారిక చేర వచ్చెఁద
న్నెంతయుఁ గూర్మి వెన్కొనఁగ నిర్వురు కాననదేవతామణుల్. 52

చ. సలలితపద్మరాగముల జాను హసించు నశోకసూనముల్,
దళుకుఁబసిండిక్రొంజిగిదొలంకు హరించెడుగోగుఁగ్రొవ్విరుల్,
తెలివి నెసంగి ముత్తెసరి దీ టగు వావిలి పూలు; నిట్లు చె
న్నలరువసంతసూనవిచయ మ్మనుసొమ్ముల నెమ్మె దాల్చుచున్. 53

చ. ఘనతరనిస్తులస్తనయుగంబు భరంబున నించుకంత వం
గినగతిఁ దోఁప, లేతవినుఁగెంపుఁబసన్ దులకించు నంశుకం
బును మెయిఁదాల్చి పొల్చెఁ, బరిపూర్ణసుమస్తబకావనమ్ర యై
తనరి చరించు పల్లవవితానము తోడి లతామతల్లి నాన్. 54

ఉ. సారసమార్గణుండు తనచక్కెరవింటికి మాఱునారి గా
నేరుచు నంచుఁ దా నెఱిఁగి నిల్పె ననన్ బలుసొరుమీఱులీ
లారశనోత్తమం బయి యెలర్చెడు కేసరసూనమాలికన్
జారుకటీయుగంబు దిగ జాఱఁగ నెత్తుచు సారె సారెకున్. 55

ఉ. కమ్మనియూర్పుఁదావి నెసక మ్మగులోభముతోడఁ బక్వబిం
బమ్మననొప్పు మోవిదరి వారక ద్రిమ్మరుగండుఁదుమ్మెదన్

33



బమ్మినభీతి పేరిమి క్షణక్షణమీక్షణముల్ నితాంత లౌ
ల్యమ్మెనయన్ విలాసకమలమ్మునఁ జోపుచుఁదేపతేపకున్. 56

ఉ. ఎచ్చటఁ గాని యొచ్చె మొకయించుక యేనియు లేని మేనితో
వచ్చెడుమచ్చెకంటిఁ దనపైఁదలి కైనను సిగ్గువచ్చు బ
ల్మె చ్చుగుసొరు గల్గినచెలిం గని మారునికిన్ జితాత్ముఁ డౌ
చిచ్చుఱకంటియందు నిజచింతితకార్యఫలేచ్ఛ క్రమ్మతెన్. 57

ఉ. గౌరియు నయ్యెడన్, దనకుఁ గాఁగలపెన్మిటియౌ కిశోరనీ
హారమయూఖమౌళి ప్రతిహారము సేరె; నతండునున్ నిజో
దారసమాధిచేతఁ బరమాత్మ యనం జనునట్టి లోన వె
ల్గారెడుదొడ్డజోతిఁ గని యప్పుడె యూఱటఁగాంచె నిమ్ములన్. 58

మ. అటుపై నాపరమేశుఁడున్ ఫణిపతిప్రాంచత్ఫణాగ్రాళిపై
నెటు లెట్లో తనక్రిందిభూమివలయాహీనాంశమున్ బూన్చుచున్
బటుశక్తిన్ గడు మెల్లమెల్లఁగ నిజప్రాణానిలశ్రేణి నె
ప్పటియ ట్లాడఁగ, వీడనాడె దృఢమౌ పర్యంకబంధస్థితిన్. 59

చ. అతనికి మ్రొక్కి నంది తుహినాచలకన్యక తన్నుఁ గొల్వ నా
దృతి నట వచ్చి యున్న విత మేర్పడ దెల్పుడు, బొమ్మపాటుచే
నతఁడు లతాంగికిన్ సమయ మయ్యెడ నియ్యఁగ నియ్యకోలు సూ
చితముగఁ జేయ, నందియును జెచ్చెరఁ దెచ్చెను లోని కచ్చెలిన్. 60

ఉ. ఆ తలిరాకుఁబోఁడిచెలు లామనియం దలరారుపూవులన్
లేఁతచివుళ్ళతోఁ గలిసి నివ్వటిలన్ దమకేలుఁదమ్ములన్
బ్రీతిని గోసి తెచ్చి యలమిక్కిలికన్నుల వేల్పు పాదకం
జాతయుగంబుమూలమునఁ జల్లిరి మున్మును జోత సేయుచున్. 61

చ. చలిమలపట్టియున్ దనదుచామనిముంగురులందుఁ దాల్పఁగా
నలరునవద్రుమోత్పలలతాంతము జాఱఁగఁ గర్ణపాళి రా
జిలుతలిరాకు వీడఁ, గడుఁజెన్నవునౌదలచే వృషాంకు మం
జులచరణాంబుజంబులకుఁ జొక్కపుబత్తి యెసంగ మ్రొక్కినన్. 62

మ. పరకాంతావిముఖాత్ముఁ డైనపతి సంప్రాప్తించు నీ కంచు, నీ
శ్వరుఁడున్ సత్యమె పల్కె దీవనగ నా శైలేంద్రసత్పుత్రికిన్
బరఁగున్ దా నది యట్లె లోకమున, నెన్నం డైన భిన్నార్థవి
స్ఫురణం జేసెదునే మహాత్మముఖసంభూతాగ్ర్యవాగ్రత్నముల్. 63

ఉ. అంగదఁ గాముఁడున్ దనకు నంపఱ న ప్దదరింప వేళ యం
చుం గణియించుచున్ మిదుత చొప్పునఁ జిచ్చు చొఱంగఁ గోరుచున్
బంగరుగట్టువింటిదొరపై గుఱి వెట్టి యపర్ణ ముంగలన్
సింగిణినారిఁ బట్టి పెనచెన్ వలచేతను మాటిమాటికిన్. 64

ఉ. ఆవల నద్రికన్యకయు నర్పణఁ జేసెఁ దపస్వియౌ మహా
దేవునికిన్ దివాకరుని దీధితులన్ దగ నెండివట్టివౌ
దైవతనిమ్నగాకనకతామరసంబుల లోని పూసలన్
దావల మొప్పుఁ గూర్చి యరుణద్యుతి తావల మైనకేలుతో. 65

శా. దానిం గైకొనఁ జూచె భక్తజనవాత్సల్యంబునన్ శంభుఁ డా
లోనన్ సూనశరుండు వింటఁ దొడిగెన్ లోకత్రయీజంతుసం
తానానూనమనోబ్ధిలీనధృతిగోత్రచ్ఛేదనావంధ్యవి
జ్ఞానశ్రీజితవజ్రిశస్త్ర మగునాసమ్మోహనాఖ్యాస్త్రమున్. 66

మ. హరిణాంకుం దుదయింపఁగాఁ గడఁగుచో నంభోధియుం బోలె నీ
శ్వరుఁడున్ సుంత ధృతిన్ గలంత వడి పర్వం జేసె నున్జాపులన్
బరువంపుంజిఱుదొండపండుదొర యై భాసిల్లు కెమ్మోవితోఁ
గర మొప్పారు శిలోచ్చయప్రియసుతాకమ్రాననాబ్జంబునన్. 67

చ. పులకిత మౌటచే నెసఁగఁ బూచినకోమలనీపభూజముల్
బలెఁ దులకించు నంగములు భావము నెంతయు వెల్లడింప, న
య్యలికులవేణియుం దిరిగి యద్దముగా నట నిల్చి యుండెఁ జూ
పుల మలఁగింప సిగ్గుమెయిఁ,బొల్పునఁబొంపిరివోవు మోముతో 68

చ. భవుఁ డటపై వడిం గలఁగఁ బాఱుహృషీకచయంబుఁ గ్రమ్మఱన్
దివిరి వశీకృతేంద్రియతఁ దేటిచి బల్మిని జిక్కఁబట్టి చి
త్తవికృతికిన్ నిదానము నిదానముగా నరయంగఁ గోరి, ది
గ్వివరవితానమందుఁ బఱపెన్ సవిమర్శత తోడిచూడికిన్. 69

మ. కనె నామిక్కిలికంటివేల్పు వలనౌకన్నుంగొనం జేర నుం
చిన కేలుంబిడికింటితో, నతభుజాశీర్షద్వయీకాంతితోఁ
దనరన్ గుంచినవామమౌ పదముతో, దైవాఱఁజక్రాకృతిన్
గననౌ సింగిణితోడ నేయఁగృతసన్నాహున్ బ్రసూనాంబకున్. 70

మ. అలఘుస్థేమతపోవిఘాతమున, హెచ్చైనట్టికట్టల్కతోఁ
గలితభ్రూకుటిభీమమై, గన నశక్యం బైనవక్త్రంబుతోఁ;



బ్రలయార్కుం దలఁపించుధూర్జటి లసత్ఫాలాక్షియందుండి వే
నొలికెం గీలి యతర్కితంబుగ నితాంతోజ్జ్వాల మై క్రాలుచున్. 71

శా. ఏలా మానుమమాను మాగ్రహముస్వామీ యంచుఁబ్రార్థించు వా
క్యాళుల్ దేవముఖోదితంబులు దివిన్ వ్యాపించు నాలోన నా
నీలగ్రీవలలాటదృగ్జనితవహ్నిజ్వాల నాభీలమౌ
లీలం గాలెను దుంటవిల్తుని యొడల్ వే భస్మశేషంబుగా. 72

మ. అతితీక్ష్ణాభిభవంబుచేత నుదితం బై యింద్రియాళిన్ నిజో
చితవృత్తుల్ మఱపించు మూర్ఛ రతికిన్ జిత్తేశుఁ డారీతిగా
గతుఁ డౌటన్ జనియించుశోకభరమున్ గానంగ రాకుండ ని
ల్పి తనర్చెన్ క్షణమాత్ర మాయమకు బల్మే ల్సేయుదానింబలెన్. 73

చ. ప్రకటతపస్విరుండు పురవైరి సమాధికి నంతరాయకా
రకుఁ డగుసూనబాణు ఖిదురంబు ద్రుమంబును బోలెఁ గూల్చుచున్
జకితకురంగలోచనల సన్నిధి నుండుట లగ్గ గా దటం
చకలుషనిశ్చయింబున గణావళితోడ నదృశ్యుఁడై చనెన్. 74

చ. ఉమయును గౌరవోన్నతుల నొప్పెడుతండ్రి వరాభిలాషయున్
విమలమనోజ్ఞ మైన తన నెమ్మెయితీరును నయ్యె వ మ్మటం
చమితమనోవ్యథం దవిలి యాపయి బోఁటులు చూడఁగల్గు బ
న్నము ద్విగుణింప సిగ్గు భవవంబున కెట్టులొ యేగె రిత్త యై. 75



**కవిరాజవిరాజితము :**

అపుడు పురాంతకు నల్కభయంపడి యక్షినిమీలన మంది, కడున్
గృపఁగన నౌ తనయిష్టకుమారి గిరీంద్రుఁడు కేల, సురేంద్రు ననే
కపమణి దంతనికామవిలగ్నను గంజలతన్ బలెఁ, గైకొనుచున్
జపలగతిన్ మెయి సాగఁగ సోగగఁ జక్కఁ జనెన్ దనజాడ వెసన్.

---

మత్తకోకిల.

సోమసుందర! ధైర్యమందర! సూరిలోకపురందరా!
వామదేవమృగేంద్రపాలితభవ్యమానసకందరా!
భూమిదేవముఖాశ్రితామృతభోజనార్పణచాతురీ
హేమభూభృదిలానిభాత్మసతీందిరోజ్జ్వలమందిరా. 3

తే.గీ. ఇది మదనమథన మనఁబడియెడు తృతీయ
సర్గ, సత్కూచిమంచివంశ్యమణి సోమ
సుందరకవీంద్ర వేంగమానందనాగ్ర్య
సాంబశివకృతాంధ్రకుమారసంభవకృతి. 4

---



శ్రీః

# శ్రీమదాంధ్ర కుమారసంభవము

## చతుర్థాశ్వాసము

---

శ్రీవిశ్వేశ్వరపదరా
జీవధ్యానైకతానచిచ్ఛాంత్యావి
ర్భావసుఖభోగి! సుకవియ
శోవైభవభాగి! సోమసుందరయోగీ! 1

క. అవధారు వినయ మొప్పఁగ
వివరించెద నవలి కథ వివేకధురీణా
కవికాళిదాససురగీ
ర్యువతీ చేటీ కృతాంధ్రరుచిరవచశ్శ్రీన్. 2

---

క. అవలను మూర్ఛైకగతిన్
వివశన్ మరునింతి సాధ్వి విధి తెలిపె భరిం
ప వశంబు గాని వెతకున్
భవనం బనఁ దగునవీనవైధవ్య మిడన్. 1

క. బలుమూర్ఛ తెలిసి విచ్చిన
తెలిగన్నులఁ దేఱి కనియుఁ దెలియదు మది న
చ్చెలి యవి కని తనియని తన
చెలువుఁడు మఱి కాన రాక చెల్లిన రీతిన్. 2

ఆ. ఓయి! జీవితేశ! యున్నావె జీవించి
యనుచు లేచి చూచె నతివ తనదు
ఫ్రోల నేలఁ బురుషుఁ బోలి యుండెడు పుర
ఘస్మరక్రుధాగ్ని భస్మ మొకటె 3

క. కని మఱల వివశ యయి ధూ
ళిని జనుగవ బ్రుంగఁ గౌఁగిలించుచు నేలన్
దనకురులు చెదర నేడ్చెను
వనభువిఁ దనతోడ సరిగ వగపించు గతిన్. 4

క. ఏ నీ మే నందమున జ
గాన నగున్ సాటి సొగసుకాంద్రకు నది యి
ట్లైనఁ గని చదియఁ గద నేఁ
జానలు కర్కశలు గారె చట్టులకంటెన్. 5

ఆ. ప్రాణనాథ! నను నిజాయత్త జీవన
నెనరు డించి యొక్క నిముసముననె
అడ్డుకట్టు ద్రెంచు నంబుపూరము మహో
త్పలినిఁ బోలె విడిచి పఱచి తెందు. 6

క. సలుపవు నా కప్రియమును
జెలువుఁడ! నీమనసు నొవ్వఁ జేయను నేనున్
విలపించురతికి నూరక
చలమున నిటు దర్శనం బొసంగ విదేలా. 7

చ. తలఁచెదొ, నన్ను వేఱొకనితంబినిపే రిడి పల్కు దొ్రటిలన్
బిలిచెదువేళలన్ దయిత నే మొలనూలున నిన్నుఁగట్టుటల్
లలి నకరుల్ దొఱంగి కనులన్ వడిఁ గప్పఁగ వీనుదోయినేఁ
జెలువు వహింపఁ దాల్చుతొగచే నినుఁగొట్టుటలున్ బొరి బొరిన్. 8

చ. మనమున నిల్తు వీ వనుచు మాటికి నిచ్చక మొప్ప నన్ను నీ
వనునుడు వియ్యెడన్ గపట మై దెలియంబడె నన్ను నాఁటికిన్
దను పెనయంగఁ జేసెడు విధానముగా కది నీ వనంగుఁడై
నను హృదయేశ! యెట్లు రతి నాశము లే కిట నిల్చె చెప్పుమా? 9

క. పరలోకనవాతిథి వై
త్వరతో నీ చనినత్రోవ వచ్చెద నేనున్





గరము జగద్ద్రోహము విధి
నెరపెను ప్రాణులకు సుఖము నీచేతిదె గా. 10

ఉ. గాటపురాత్రి చీఁకటులు గ్రమ్మినదౌ పెనుబాటఁ బోవుచో
మాటికి మేఘగర్జలకు మానసమందు భయంబు సెందున
బ్బోటుల వారికూర్మిచెలువుల్ వసియించెడునట్టిచోట్లకున్
వాటము గాఁగఁ జేర్పఁ గలవాఁ డిఁక నెవ్వఁడు నీవు దక్కఁగన్. 11

ఆ. ఎట్టి నయినచూడ్కు లింపారఁ ద్రిప్పుచు
సారె సారె నుడులు జాఱఁ జేయు
మద్యమదము నేఁడు మదిరాక్షులకు వట్టి
బూమె యయ్యె నీవు లేమిఁజేసి. 12

తే.గీ. అనుఁగుజుట్టంబ వైననీ యంగ మిప్పు
డంగజాత! కథాశేష మగుటఁజేసి,
రిత్త యుదయించు జాబిల్లి కృష్ణపక్ష
మేగినను గష్టమున గాని కృశత విడఁదు. 13

తే.గీ. ఎట్టి నయి పచ్చ నయి మొద లింపు గొలుప
గండుఁగోయిల చాటి కాకలులఁ దెలుప
నెసఁగు క్రొమ్మావివిరి యేని కింతనుండి
కఱకుటమ్మగు నా మనఃకాంత చెపుమ? 14

చ. చెలువుఁడ నీవు నీదుపువుసింగిణికిన్ బహుభంగులన్ సము
జ్జ్వలగుణకృత్యమున్ నెరపఁ బంచిన యీయెలదేఁటిదాఁటు నేఁ
డలయక మ్రోయుచున్నయది యక్కట ధైర్యము దెల్పునెల్గనన్
బలు దురపిల్లునాకు ననువాదముగా విలపించుసంచునన్. 15

ఆ. మిగుల సొగసు గలుగు మెయి దాల్చి దయిత క్ర
మ్మఱఁగ లేచి పనుపు మధురమైన
పలుకులకు నిసర్గపండిత కోయిల
కలికి సురతదౌత్యకార్యములకు. 16

చ. తలఁ గడు వాంచి నీవు నను దైన్యముతోడుత వేఁడునట్టివౌ
నలువుగఁ బుల్కలం దనరు నామెయి బిగ్గఁగవుంగిలింతలున్
జెలఁగి రహస్యవేళ వెల లేనిసుఖం బిడు నీదుపొందులున్
దలఁచికొనంగ నూఱటకు నాకును దూరము దోర మయ్యెడున్.

చ. సురతకళాప్రవీణ! కడుసొంపుగ నాతనువందు నీవు నీ
కరసరసీరుహంబున రకంబుగఁ బూఁదఱిఁ గ్రాలుపూల న
చ్చెరువుగఁ గూర్చి నట్టికయిసేఁత యిదే మెయి నిల్చి యుండ నీ
యరిదిహొరంగు మే నొకటె హా! కనరాదిఁకఁగన్నుదోయికిన్. 18

ఉ. దేనికి నీ వలంకృతిని దీర్చుట పూర్ణతఁ జెంద కుండ నిన్
దానవవైరు లక్కటిక దక్కి తలంచిరి తాము తద్‌జ్ఞులే
యైనను స్వార్థతత్పరత నట్టి మదంచిత వామపాదమున్
దీనిని లక్క క్రమ్మఱఁగఁ దీర్చి ముగింతువు రమ్ము సమ్మతిన్. 19

[1]క. మిడుతవలెఁ జి చ్చుఁటికి నీ
తొడ క్రమ్మఱ వచ్చిచేరుదుం బ్రియ! వేల్పుం
బడఁతులు జాణలు దివి నిను
గడుకొని కడు మోహ పెట్టఁ గల యాలోనన్. 20

తే.గీ. దయిత నీ వెంబడినె వచ్చు దాన నైన
పంచబాణునితో నెడఁబాపఁబడియు
బ్రతికె నఁట యొక్క క్షణమైన రతి యటన్న
నింద కలకాలమును నాకు నేటుకొనియె. 21

ఆ. పెఱజగంబు వోయి మఱిఁగిననీ కెట్టు
లింకఁ గూర్తుఁ దుదియలంకరణము
నుసురు నొడలుఁ గూడ నొక్కటఁ బోవ నీ
వరిగితివి తలంప నరిదిత్రోవ. 22

క. తలఁచెద వి ల్లిడి తొడపైఁ
జెలువుఁడ నీ వమ్ము చక్కఁజేయుచు నెలన
వ్వొలయ వసంతునితోడం
బలుకుట కడగంటిచూడ్కి బాణము గనుటల్. 23

ఆ.వె. విరులు చేర్చి నీకు విల్లు కూర్చినయిష్ట
సఖుఁడు మాధవుండు సనియె నెందు

[1]చ. తనకవపుల్గు బాసి చనఁదప్పక మేనుద్యజించు గువ్వ దె
ల్పిన నెర త్రోవఁ బట్టి యిఁక వేగమె నీకురువొందు దాన నే
నిను నలనాకలోకమున నిద్దపుఁజూపుల వేల్పుజాణెతల్
గనియెడువంతకంటె ముసు గల్గగ మామకమానసేశ్వరా!
మూ. –అహ మేత్యపతంగవర్త్మనా॥ కొందఱుపతంగశబ్దమునకు పక్షియనియర్థము చెప్పిరి.



నతఁడు నుగ్రకోపుఁ డగు శైలచాపుని
చే వయస్యు గతినె చెందఁడు గద! 24

చ. అనుడు విసంబు పూసినఖరాగ్రము లున్న లకోరులట్లుగా
మనమున నామెరోదనపుమాటలు నాటుకొనన్ వసంతుఁడున్
గనికర మూని కానఁబడె గాఢవిపన్నత నున్నదాని నె
య్యునిసతి నూఱటం గొలుప నొయ్య రతీసతి ముందరం ద్వరన్.

క. కని వాని నేద్చెఁ గడుఁ జెలి
చనుఁగవయయియంగ, ఱొమ్ము చఱచుకొని వగన్;
దనవారి గనఁగ వనటకు
నసువుగ ద్వారంబు తెఱచినటు లౌను గదా. 26

క. అనె నిటు వెండియుఁబొగులుచు
"కను మాధవ! యేమి నీదు గాదిలిచెలి క
య్యెనొ" పార్వపువన్నెలఁజెం
దినబుసి యిదె గాలిఁ దూలె నెఱుసులు గాఁగన్. 27

చ. దయ నిడు నాథ! నీదు ప్రియదర్శన మియ్యెడ నీవసంతుఁడెం
తయుఁ గనులారఁగా నిను గనన్ నిలు పోపక యున్న వాఁడు; ద
ద్దయు నిల కుండుఁ గాక దయితాజనులందు మనుష్యకోటికిన్
బ్రియత చలింపఁబోదు గద మిత్రులయం దొక లేశమాత్రమున్. 28



చ. సదయ! యితండు నీకుడిబుజం బయి దండనె యుండి కాదె దా
మృదు వగుతూఁడుత్రాఁడును నొకించుక దాఁకినఁ గందుసూనపుం
బ్రదరముఁగల్గనీతనుశరాసమునానతి దేవదానవుల్
మొదలుగ సృష్టి యెల్లఁదలఁబూన నొనర్చెను నేర్పుమీఱఁగన్. 29

తే. చెల్లె రాఁ డిఁక నట్టి నీ చెలి, ఋతువర!
వాయుహతి నాఱినట్టి దీపమటు, దాని
వత్తి నేనైతిఁజూడుమా పట్టరాని
నెగులు బలుపొగ మిగులంగఁ బొగలు నన్ను. 30

ఆ. మదనుఁ జంపి నన్ను వదలిన దయ్యంబు
నాఁడె సగము సంపె వీడ రాని
ప్రాఁకుమ్రాఁకు క్రూరవనకరి కూల్చినఁ
దీఁగమనికి యెల్లఁ ద్రెళ్ళుకొఱకె. 31

క. కావున బాంధవకృత్యము
నావలిపని దీని దీర్పుమా నను వివశన్
జీవితనాథు వసించెడు
తావునకుం జేర్చి యగ్నిదానమున దయన్. 32

క. నెలతోడనె సను వెన్నెల
జలదునితోడనె యడంగు సౌదామనియున్
జెలులకు మగ లేగిన బా
టలె యున్నది తెలియుఁ గద జడములకుఁ గూడన్. 33

క. చెలువుని మేనిది యగునీ
సలలిత మగుబూదిచేత జనుదోయికి ని
మ్ముల రం గిడి చిచ్చున లేఁ
దలిరులపానుపునఁ బోలెఁ దనువుం జేర్తున్. 34

క. అలరులసెజ్జం గూర్పఁగఁ
బలుమాఱును మాకుఁ దోడుపడితివి గద నె
చ్చెలి యిపుడు గూర్పుమా దో
సిలి యిడి బ్రతిమాలు దానఁ జితియుం ద్వరతోన్. 35

క. చితిఁ బేర్చి రవుల్పు మద
ర్పితశిఖి దక్షిణపుగాడ్పు విసరులచేతన్
ద్రుతగతి, నీవ యెఱంగుదు
పతి నన్నెడఁబాసి యోరువమి నిముసమునున్. 36

క. సలిపి యటు మఱియు నొక్కటె
సలిలపు దోయిటిని మా కొసఁగు మిర్వురక
వ్వల నలనీప్రియబంధుఁడు
చెలి! దానిం ద్రావు వేఱు సేయక నాతోన్. 37

క. పరలోకవిధులు ఋతువర!
జరుపుతఱిన్ మరుని కిమ్ము చలకిసలయముల్
వరచూతపు విరిగుత్తులు
కరమును నీచెలికిఁ బ్రియము గద యయ్యలరుల్. 38

క. అని యిటు చానై యున్న ర
తిని మదుఁ గిగురుటను బ్రగ్గు తిన్నని మీనాం





గననుఁ దొలివాన కైవడి
ననిమిషపథజనితవాణి యటఁ గరుణించెన్. 39

క. ననతూపులతని యతివరొ!
కనియెదు నీమగనిఁ దడవు గా కుండనె యే
పని చేసి యతఁడు మిడుత
య్యెనొ రుద్రుని కంటి మంట; నిటు విను దానిన్. 40

క. సుతపైఁ దమిగొనియెఁ బ్రజా
పతి యాతం డింద్రియముల వడిఁ బెర రేపన్
ధృతి వికృతి నడఁచి పదపడి
యతఁడు శపింపంగఁ గుడిచె నాఫల మితఁడున్. 41

క. ఏయెడ నుమ నుపయమమౌ
నాయమకుఁ దపంబుపేర్మి హరుఁ డభిముఖుఁ డై
యాయెడ సుఖి యై యతఁడు స్వ
కాయముతో మఱలఁ గూర్చుఁ గాయజు దయతోన్. 42

క. అని మరునికి శాపవిమో
చన మిదు నుడి ధర్ముఁ డన్ ప్రజాపతి వేఁడన్
వనజజుఁ డనెఁ బిదు గమ్మృతం
బను రెంటికి మూలములు గదా మునిఘనముల్. 43

క. కావునఁ గావుము కల్యా
ణీ! విభుపొం దెనయ నున్నయిామెయి రవి నీర్
ద్రావఁగ వట్టిన యాపగ
ప్రావృట్కాలమునఁ బొరిఁ బ్రవాహము గనదే 44

పంచచామరము.

కనంగ రానిరూపుతో నొకానొకం డి టంచుఁ గా
ము నింతి చావఁ బూనినట్టి బుద్ధి మాన్పె నాద్యువా
ణి నమ్మి కమ్మవిల్తుకూర్మి నేస్తుఁ దూఱడించె నొ
య్యనన్ రతిన్ గృతార్థ మైన యట్టి తేటమాటలన్. 45

మాలిని

తను వటఁ బెనువంతన్ దద్దయుం గార్శ్య మందన్
మనసిజు సతి కష్టాంతంబుకై, మించు లెల్లన్

జన వెల వెల నౌచున్ వాసరాంతంబుకై సో
ముని పగలిటిరేకం బోలెఁ దా వేచి యుండెన్. 46

---

మత్తకోకిల

సంతతప్రతివాదిరోషణశాంతికృన్మృదుభాషణా
స్వాంతవైరిమదావశోషణ సత్యనిత్యగవేషణా
కాంతకీర్తిమరుత్సరిన్మణికాండసంతతిపోషణా
నంతదానపయోనవాంబుదదగ్రహస్తవిభూషణా. 3

తే. ఇది రతివిలాప మనఁబడియెడు చతుర్థ
సర్గ సత్కూచిమంచివంశ్యమణి సోమ
సుందరకవీంద్రవేంగమానందనాగ్ర్య
సాంబశివకృతాంధ్రకుమారసంభవకృతి. 4

---





శ్రీః

# శ్రీమదాంధ్ర కుమారసంభవము

## పంచమాశ్వాసము

---

శ్రీకుధరశిరోమణితన
యాకాంతపదాబ్జపాద్యదంచితకవితా
నాకులజాహ్నవి! స్వవశవి
శోకామృతపదవి! సోమసుందరసుకవీ! 1

క. అవధారు కాళిదాసా
ర్యవరామరభారతీపదాంగదనిక్వా
ణవిధానువాదిహంసీ
భవదాంధ్రమృదూక్తియుక్తిఁ బైకత వినుతున్. 2

---

చ. అటువలె నంగజున్ నిజసమక్షమునందె దహించి వైచి ధూ
ర్జటి తనకోర్కి యాఁఅడిగఁ జల్ప, హిమాద్రికుమారి యాత్మలోఁ
బటుతనుకాంతిఁ దిట్టుకొనె వ మ్మని; చక్కఁదనంపుఁబెంపు గ
ల్గుటకు ఫలంబు వల్లభుల కూర్మికిఁ బాత్రము లౌటయే కదా. 1

ఉ. భూనుతభావనిశ్చలతఁ బూని తపంబులు సల్పి సార్థకం
బౌ నటు సేయఁ గోరె నచలాత్మజ నైజతనూమనోజ్ఞతా
శ్రీ నటు గాక యొండుగతిఁజేకురునే యివి రెండు నిట్టి సుం
తే నెడ లేనికూరిమియు మృత్యువు నోర్చినయట్టికాంతుఁడున్. 2

చ. తనయనుఁగుంగుమారిత నితాంత మహార్యనిశాంతుపైఁ దమిన్
గొనినమతిం దపశ్చరణకున్ సమకట్టిన దంచు మేనయున్
విని కడు నిష్ఠురంబగుమునివ్రతచర్యను మాన్పఁ గోరి యి
ట్లనియె నతాంగితోడఁ దన యక్కునఁ జేరిచికొంచు మక్కువన్. 3

ఉ. మక్కువ వేలుపుల్ మనకు మందిరమందున లేరె, యీతపం
బెక్కడ! నీతనూలతయు నెక్కడ నమ్మరొ! సైఁచుఁ గాక తా
రక్కొని పైని వ్రాలు భ్రమరంబుపదంబు, మృదుత్వసంపదన్
జిక్కని యాశిరీషసుమ శేఖర మోర్చునె పక్కిత్రొక్కుడున్. 4

చ. అని తనగట్టి పూనిక రవంతయు వీడని యాకుమారికన్
బనివడి తెల్పియున్ దపము మానుపఁ జాలని దయ్యె మేన యె
వ్వని తర మౌ నభీష్టసమవాప్తికినై దృఢనిశ్చయంబు గై
కొనినమనంబు పల్లమునకున్ వడిఁ బాఱెడునీరు నాపఁగన్. 5

చ. తనమదిఁగోరికన్ దెలియు తండ్రిని దా నడిగించె నొక్కనాఁ
డనువుగ నిశ్చలాత్మిక కులాచలకన్యక యిష్టసిద్ధి యౌ
దనుక మహాతపశ్చరణతత్పరతన్ వనవాసదీక్ష గై
కొను పనికై యనుజ్ఞ తనకుం దయ సేయ ననుంగుబోఁటిచేన్. 6

మ. అటవెన్కన్ దనకూర్మిపట్టికి నిజార్హం బైనయాపూన్కి గ
ల్గుటకున్ సంతస మంది మాన్యుఁ డగునా గోత్రాధరాధీశుఁ డొ
ప్పుటయున్ జేరెను గౌరి వెన్కఁ బ్రజచేఁ బొల్పారఁగా నామె పే
రట గౌరీశిఖరం బనంబడు శిఖిగ్రామాభిరామాగ్రమున్. 7

చ. ఘనకుచయుగ్మమధ్యమున గందము వోఁ బొరలాడు పేటలన్
గొన బగుహార మూడిచి యకుంఠితనిశ్చల యై యుమాభిమా
నిని మెయిఁ దాల్చె నవ్యనళినీసఖుభంగిఁ బిశంగశోభ మై
సనుగవ యుబ్బునం బ్రిదులు సంధులు దాలుచువాల్క చేలమున్ 8

ఉ. శ్రీనిధి యామె మోము గయిసేసినపెన్నెఱిగుంపుచేఁ బలెన్
జాను వహింపఁ జాలెఁ బరుసంపుజటాపటలంబు దాల్చియున్
దా నెలదేఁటికూటువుల ఁదాల్చియ కాదలతమ్మి నాచు పై
నూనుచు నైనఁ బల్చెలువ మొందక డిందునె సొంపుసంపదన్. 9

చ. పరుసఁదనంబుచే గగురుపాటు క్షణక్షణ మొప్ప మేనికిన్,
సురనుతపుణ్యశీల కటిసూత్రము గాఁ దగ మూడుపేటలై

40



యిరవుకొనం, దపంబున కదే తొలిమాటుగ మౌంజి గట్టినన్
గర మెఱు పూనె దాన నల కాంచిక యుంచెడి చోటు జోటికిన్. 10

చ. లలితపులక్కరంగులు దొలంగిన వాతెఱనుండి గుబ్బలన్
జెలఁగెడుచందనం బొరసి జేవుఱు దాలుచు బంతినుండియున్
మలఁచి కుశాంకురంబులు గొనన్ దెగు వ్రేళుల నొప్పు చేతికిన్
గులగిరికన్య, చెల్మి నొసగూరిచెఁ బూసలతావళంబుతో. 11

క. వెలహెచ్చుసెజ్జఁ బొరలఁగ
లలి నెఱులన్ దొఱఁగునలరులన్ మెచ్చెడి కో
[1]మలి పడుకొను నిజభుజలత
తలగడగాఁగటిక నేలఁ దగఁ గూర్చుండున్. 12

చ. వ్రతము చరించుచున్న యల పర్వతపుంగవు నెయ్యపుంగుమా
రిత మరలంగఁ గైకొనఁగఁ బ్రీతియెసంగఁగ రెండు రెంట సం
చితగతి దాఁచెఁగావలయుఁ జెన్నగులేవిరితీవలందుఁ గు
ల్కిత చెలువంపుఁజెయ్వును, మృగీతతి బిత్తర మొప్పుచూడ్కియున్ 13

ఉ. ఏమరఁ బోక సాకె శిఖరీశ్వరు కూఁతురు లేఁతచెట్టులన్
గోముగఁ దానె బల్కడవగుబ్బలనుండి తొలంగు దారలన్
భామకుఁ దొంటికాన్పు లగువానియెడ న్నెలకొన్నయా సుత
ప్రేమ మరల్పఁజాలఁ దట వెన్క జనించిన తారకారియున్. 14

తే. అడవిధాన్యంపుదోయిళ్ళ నాదరింప
లేమ యెడ మచ్చికలు హెచ్చి లేఁడిగమికి
నెలమిఁ దన్నేత్రములతో నిజేక్షణములు
చెలులెదుట నిల్చి కొల్చుకో వల నెసంగె. 15

ఆ. జలక మాడి యనలు నలు వొప్ప వ్రేలిచి
నారచీర పైఁటగా రచించి
శ్రుతులు చదువు నామె చూడ వచ్చిరి ఋషు
లెన్న రీడు ధర్మవృద్ధులందు. 16

ఉ. మానుగఁ దొంటి వైరములు మానిన దాయమెకంబు లీప్సితం
బైనఫలంబు లిచ్చి సకలాతిథి సేవ యొనర్చు చెట్లు, నెం

[1]మలిగూర్చుండుఁబరుండుఁ గుతలముననే నిజభుజాలతయెత లగడగాన్, పాఠాంతరము

తే నవపర్ణశాలలను నిల్పి, రవిల్చినయగ్నులం దగన్;
జా నయి తత్తపోవన మొనర్చెఁ బవిత్రముగా జగత్త్రయిన్. 17

క. మును జేసినంత తపమునఁ
గనకాంగి నిజేష్టసిద్ధి గా దని యెంచెన్
దన మది నెంతట నంతటఁ
దనుమృదులతఁ దలఁప కుగ్రతరతప మూనెన్. 18

ఆ. బంతు లాడి నంతఁ బడలు నింతుల మేలు
బంతి సొచ్చె మునుల పనుల కజుఁడు
పొలఁతిమేను నిజము పొందమ్మితోఁ జేసెఁ
బ్రకృతి మృదుత దృఢతఁ బరఁగె దాన. 19

ఉ. మండెడు నల్నెగళ్ళనడుమ న్నెల వై యణుమధ్య వేసవిన్
మెండుగఁ గన్నుదోయి మిఱుమిట్లులు గొల్పు వెలుంగు లోర్చి యా
చండమయూఖమండలి నచంచలవృత్తి నెసంగు చూడ్కులన్
పాండురకీర్తిహాస యలపర్వతగోత్రపవిత్ర గన్గొనెన్. 20

చ. అటువలె నామె మోము జలజాప్తువెలుంగులకాఁక సోఁకియున్
స్ఫుటదరవిందసుందరతఁ బూనెను మానక యైన దానిచేఁ
బటురుచిరంబు లైన నిడువాలుకనుంగొనలందు మాత్రమే
దిటముగ నంత కంతకును దిప్పగ నల్లని చాయ నూల్కొనెన్. 21

చ. అడుగకయే లభించెడునవాంబుద వారి సుధామయాత్ముఁ డౌ
నుడుపతితళ్కుజాలు నయి యొప్పు కృశోదరి యోదనంపుఁ దీ
రడరెను వృక్షజీవికకు నాదరు వై తగువానికంటె నె
క్కుడువెరవుల్ గలట్టిబ్రదుకుందెరవుం దలపెట్టనట్టి దై. 22

చ. గగనచరంబుఁ, గట్టెలను గల్గెడునద్దియు నౌచు, నిట్లు వ
ల్వగ లగుచున్న చిచ్చునను బాగుగఁ గాఁగి యపర్ణ వార్షికం
బగుతటి నూతనంబు లగునంబువులం దడి చెంది, యుప్పరం
బెగయఁగ వావిరిన్ దొఱఁగె నెంతయునున్ క్షమతో సమంబుగన్ 23

చ. తొలుతటి వాన చిన్కుగమి తొయ్యలి చిక్కఁదనంపునున్పు ఱె
ప్పల నిముసంబు నిల్చి, నునువాతెఱ దాఁకి, కుచద్వయోచ్ఛ్రయం
బులఁబడి నుగ్గును గ్గగచుఁ బొల్పెసలారు వళిత్రయంపు మె
ట్టులు దిగ జాఱి చేరెను గడుం దడ వై తగ లోతుఁబొక్కిలిన్. 24



చ. ఉడుగక లోపలన్ విసరుచుండెడు గాడ్పులవెంట వచ్చు బ
ల్జడులను దాల్మి బట్టబయలన్ నెలకొంచును ఱాతిబండలన్
బడుక యొనర్చుదానిఁ బలుమాఱు మెఱుంగుమెఱుంగుఁగన్నులన్
బొడఁగనునట్లు రాతిరులు భూరితపంబున కయ్యె సాకిరుల్. 25

చ. చలి నమితంబుగాఁగ వెదచల్లెడు నీఁదరతోడిపుష్య రా
త్రులను బడంతి తాఁ గడపెఁ దోయముల న్నివసించు నిష్ఠతో
బలువెతతోడ మెం డొకటి బల్మఱు చీరుచు జోడు వీడి మో
సలఁజరియించు జక్కవల జంటపయిన్ గనికార మూనుచున్. 26

ఉ. తామరకమ్మతావులకుఁ దావల మై చలమానదంతవా
సోమితచారుపత్రమున నందము దాలుచు మోముచేఁ దమిన్
గోమలి యొప్పెఁ, గ్రమ్మఱఁగఁ గూర్చె ననన్ బలుమంచువానచేఁ
దామరసంపుసొంపులకుఁ దప్పిన యప్పుల కంబుజాతమున్. 27

ఆ. క్షితిఁ దమంత రాలుచెట్లయాకులు దిని
మనుటె గొప్ప నియమమునకు దాని
సయిత ముడిగెఁ గానఁ బ్రియభాషిణిఁ బురాణ
విదు లపర్ణ యనియుఁ బిలుతు రెలమి. 28

చ. ఇది మొదలౌ వ్రతంబుల మహీధరరాజకుమారి రేయునుం
బవలు నొగిన్ మృణాలసుకుమారనిజాంగము గాసి వెట్టుచున్
దివిరి తపంబు చేసెను మునిప్రవరుల్ దృఢకాయసంపదన్
భువి గడియించుకొన్నతపమున్ గడుదవ్వుగఁ గ్రిందు సేయుచున్. 29

చ. అమర నుమాతపోవనికి నంతటఁ గింశుకదండ మేణచ
ర్మమును ధరించువాఁడు, గడుఁబ్రౌఢపుఁబల్కులవాఁడు, బ్రహ్మతే
జమున వెలుంగుచున్నగతి జా నగువాఁడు, జటల్ గలట్టివాఁ
డమలినమూర్తిఁదాల్చుబ్రథమాశ్రమమో యనఁగానొకండు దాన్. 30

చ. అతిథు లటన్నఁ బ్రాణ మిదునంబిక లేచి సగౌరవంబుగా
నతనికి నర్ఘ్యపాద్యయుత యై యెదు రేగె; నచంచలాత్మకుల్
మతిఁ దమతుల్యు లే యనుచు మానక పూని విశిష్టమూర్తులం
దతులితమైనమన్నన గలట్టిపనుల్ పొనరింతు రౌఁ గదా. 31

చ. సముచిత శాస్త్రశిష్టగతిఁ జల్పినపూజ గ్రహించి వర్ణిస
త్తముఁడు నిమేషమాత్రము పథశ్రమ వీడ్కొనుటన్ నటించి, య

య్యుమను గరంబు విన్ననయి యొప్పెడుచూడ్కినెచూచి, సుంతయున్
గ్రమము దొఱంగ కుండునటు ప్రక్రమముం బొనరించె వాకొనన్. 32

మ. శ్రమ మొక్కింతయులేక చేకురునె యోచంద్రాస్య! హోమాదికా
ర్యములన్ దీర్ప సమిత్కుశం బగునె స్నానార్హంబుగా నీకుఁ దో
యములున్? శక్తికి మించకుండఁగఁ దపంబందున్ బ్రవర్తింతె? కా
యమ కాదే పురుషార్థసాధనములం దాద్యంబు చింతింపఁగన్. 33

ఉ. యావకరంజనంబు దడ వై విడినాడియుఁ, బుట్టుఁజాయనే
కావి వహించు నీదు పలుఁగప్పునకున్ దులవచ్చునట్టి దై
నీ విడినట్టి నీళుల జనించిన లేఁదలి రాకుఁజొంప మీ
పూవులతీవలన్ విడిచి పోవ కెలర్చెడునే కదా సదా? 34

తే. కువలయాక్షిరో! బెదరుఁజూడ్కులను నీదు
గనుల సొం పభినయించు నాఁ దనరి, చనువు
పేర్మి నీ కేలిదర్భలఁ బెఱికికొనెడు
హరిణములయందు నీడెంద మలుగదు గద. 35

చ. కలుషపువృత్తి కెన్నఁడును గాదు సురూప మటంచు లోకులన్
బలుకు కులాచలాధిపతిపట్టిరో! వట్టిది గాదు చూడుమా
నెలఁత! యుదారరూప వగునీదుపవిత్రచరిత్ర! తాపసా
వళికిని దారి తెల్పఁ దగువన్నెయు వాసియుఁ గాంచె నౌఁ గదా. 36

చ. అలమునిసప్తకంబు దివిజార్చనఁ దీరిచి క్రుమ్మరించు న
య్యలరులఁజేసి నౌచు దివ మల్లన వీడ్కొను గాంగ వారికిన్
దలమె యకల్మషంబు లగు త్వచ్ఛరింతబుల కైన యట్లుగాఁ
గులగిరిసార్వభౌముని సగోత్రముగా సలుపన్ బవిత్రుఁ గాన్. 37

చ. ఇది గనఁగాఁ ద్రివర్గమున కెల్లను ధర్మువె మేటి యౌట నా
మదికి నెసంగెఁ దెల్ల మయి; మానితపావనభావ! నీవు నీ
హృది ధనకామవాంఛ మెకయించుకయున్ జొర నీక ధర్మమున్
బదిలముగాఁగ నొక్కటినె పట్టి చరించుటఁబట్టి నెట్టనన్. 38

చ. అతులితభంగిఁ దావకసమాదరణాతిశయంబు గన్న నన్
మతినిఁ బరాయిఁ గాఁ దలఁపమానుట మా నగు నీ కదెట్లు నా
నతుకుఁ బదంబు లేడిటనె యర్మిలి సాధులతోడ నంచు నం
చితగతి సన్నతాంగిరో! వచించెద రౌఁ గద పండితోత్తముల్. 39



ఉ. కావున శాంతి యెంతయును గల్గిననిన్ను ద్విజాతి యౌట స్వా
భావికచాపలంబునను బ్రశ్న యొకించుక యిందుఁ జేయఁగా
భావమునం దలంపు గలవాఁడు తపోధనశాలినీ! యితం
డీ వొగి దీని కుత్తరము ని మ్మది గోప్యము గాక యుండినన్. 40

చ. మొదలిటి ధాతవంశమునఁ బుట్టువు, చూడ జగత్త్రయంబులో
నిదియగునంద మొక్కకడ నిల్చె ననం దగుమేను, కల్మిచేఁ
గదురు సుఖాల కేల వెదుకన్ వయసా యెలప్రాయ; మింతకున్
ముదితరో! తెల్పు మెచ్చుగఁ దపోగరిమన్ ఫల మేమి కావలెన్? 41

ఉ. ఈ రకమైనపూన్కి యుదయించెడి నంట నిసర్గధీర లో
సారసపత్రనేత్రలకు సైఁపఁగ రా నవమాన మయ్యెనే
నారయ నట్టి దైన నిసుమంతయు నీదెసఁ గాన రాదు ద
వ్వార విచారమార్గమున నంపిన శేముషికిం దలోదరీ! 42

క. చెనకఁగ రానిది యీ రూ
పన వనటకు జనకునింట నభిభవ మవు టె?
టైనయునె యొరు నవమతి నిను?
వనితరో! చెయి సాఁచు నెవఁడు ఫణితలమణికిన్? 43

చ. తొడవుల వీడి యేమిటికిఁ దొయ్యలి మవ్వపుజవ్వనంబునం
దొడల ధరింతు ముప్పునకు నొప్పగువల్కలమున్ వచింపు మే
ర్పడ మునిమాపునన్ వెలుఁగు రమ్యకళానిధితారకాళితోఁ
గడుఁగన నైనరాత్రికి, సుగాత్రి! యనూరునిఁ జేరఁ జెల్లునే. 44

మ. అమరావాసము గోరుదే నది వృథా యాసంబు దివ్యప్రదే
శములౌనే కద నిన్నుఁగన్నయయ యీశైలాన్వయాంభోధిచం
ద్రముచోట్లట్లును గాక వేఁడెదొ వరున్, జాలుం దపఃక్లేశముల్;
నెమకంగాబడుఁ గాక తానె మణి యన్వేషించునే యొక్కనిన్. 45

గీ. వేఁడినిట్టూర్పుచేఁ గొంతవిదిత మైన
నామనము సంశయంబుననే మునింగె
వేఁడఁ దగువాఁడె గనరాఁడు వెలఁది నీకు
వేఁడినను జేపడనివాఁడుగూడఁ గలఁడె. 46

చ. పడఁతిరో! వింత నీవలచుప్రాయపువాఁడు దలంప నెవ్వఁడో
గడుఁగరినస్వభావుఁ డటు గా కిటు లొప్పరికించు నెట్లు? దాఁ

దడ వయి వీనుఁగల్వలకు దప్పుచు నొప్పుఱు నీదు చెక్కులన్
ముడి విడి వ్రేలుచుం గలమపుందలలచ్చునఁ బచ్చనౌజడల్. 47

చ. మునిజనతోచితోగ్రవ్రతముల్ చరియించి కడున్ గృశించి మిం
చినతపనోష్మచే నలుపుఁ జెందఁగఁ గందినమండనంపుఁజో
ట్లెనసిన మేనితోఁ బగటియిందునిరేకయుఁ బోలె, విన్నఁబో
యన నినుఁ జూచి చిత్తయుతుఁ డెవ్వఁడు నొవ్వఁడుడెందమందునన్

చ. తలఁచెద రూపగర్వముకతంబునఁ దద్దయు మోస పోయె నీ
వలచినయాతఁ డంచు మగువా! యటు గా కిటు వక్రపక్ష్మమం
జులత వహించి ముద్దొలుకఁ జూచెదునీతళుకారుకంటి కెం
దులకుఁ బొనర్పఁ డిందనుకనుం దన నెమ్మొగ మిమ్ముగా గుటిన్.

ఉ. గౌరి! యిఁ కెంతకాల మిటు గాసి వహించెదు? గద్దు నాకునున్
గోరిక బ్రహ్మచర్యమునఁ గూర్చినబల్తప మం దొకింతచేఁ
గూరిమి నీవు గోరు పతిఁ గొమ్ము సుఖమ్ముగ నాతఁ డెవ్వఁడో
యేరుపడన్ వినం గుతుక మెచ్చఁగఁ జొచ్చెదు నిచ్చ నెచ్చెలీ! 50

చ. ఇటువలె నావటుండు చను వెచ్చఁగఁ జిత్తముఁ జొచ్చి పల్కినన్
దటుకున సిగ్గునన్ దనమనఃప్రియునిన్ వివరింప లేక చెం
గటన మెలంగు బోటిఁ దన కాటుకనీ టఱియున్నకన్ను వి
స్ఫుటరుచు లొల్కఁ ద్రిప్పి గిరిపుంగవుముద్దుఁగుమారి గన్గొనెన్. 51

ఉ. ఆమితవాణి యాళి యను నావటుమౌళికి నేమి గోరి యీ
కామిని యెండకుం గొడుగు గా విరితామర పట్టి నట్లుగా
గో మగు నాత్మగాత్రలత ఘోరసమాధికి సాధనంబుగా
నీమెయిఁ జేయు నన్న విబుధేశ్వర! వి న్విన వేడ్క గల్గినన్. 52

ఉ. మానిని యీమె, దా నమరమౌళిముఖాతిరమావిశాలురన్
మానితలోకపాలురను నల్వురఁ గా దని మారు నోర్చుటన్
జానలరూపసంపదకు సాధ్యుఁడు గాని పినాకపాణినే
మానుగ నాథుఁగా నెనయ మానని పూనికఁ గోరు నీరహిన్. 53

చ. అరిది యసహ్యహుంకృతికి నాఁగఁగ లేక మలంగి మున్ బురా
సుర హరుఁడాఁకి వీఁక మొన చూపఁగ నోపనిదై యనంగతన్
బొరి నెఱి మాలి తూలు విరిముల్కులజోదుదె యయ్యునాశరం
బురమును గాఁడి లోఁతుఁగఁ దలోదరి నొంచెను దెప్పరంబుగన్. 54





చ. అది మొద లంతరంగమున నంగజుతాప మెసంగ ముంగురుల్
చెదరుచు బొట్టుఁజందనము చేతనుగ్రాలఁగ బూతిరంగుతో
ముద మఱి తండ్రియింటఁ బువుఁబోఁడి సుఖింప దొకప్పు డైననున్
గదిసినమంచుగడ్డగమిఁ గల్గిన ఱా ల్గలతావులందునున్. 55

ఉ. పాటలు గూర్చి బోటు లలపర్వతచాపుచరిత్రఁ బాడుచోఁ
బాటలగంధి గద్గదిక పాటిలుకంఠముతోఁ బరాకునన్
మాటలు దప్ప నాడుటకు మాటికి నింతురు నీరు గన్నులన్
బాటచెలుల్ వనావనిని బాలకుఁ గిన్నరరాజకన్యకల్. 56

చ. మనసిజచింత రే ల్నిదుర మాని కృశోదరి వేగుజామునన్
గనుఁగ మోడ్చి యొక్క తృటికాలము దిగ్గన లేచుఁ మిన్ను గ
న్గొని యను "నీలకంఠ! యెటకుం జనె" దంచు, హుళిక్కికంఠమం
దనువుగఁ జుట్టి కట్టుఁ బెనుపారెడికూరిమి నైజదోర్లతల్. 57

ఉ. "అంతటఁ గల్గు మేటిదొర వంచు నినున్ మతిమంతు లెంతు రీ
వింత యెఱుంగ కుండు టిది యెట్లు త్వదర్పితచిత్తవృత్తి నీ
యింతి?" న టంచుఁ దాని లిఖియించినచిత్తరు లోని తారకా
కాంతకలాపు నేకతముగాఁ దెగనాడును ముద్దరా ల్పొరిన్. 58

క. ఆయఖిలేశ్వరుఁ గనఁ జెలి
యేయెడ మఱి వెరవు లేమి యెఱిఁగె నరసి తా
నాయెడ వచ్చెను దపమున్
జేయఁగ మాతోఁ దపోవనికి జనకాజ్ఞన్. 59

చ. ఫలము గనంగ నయ్యెను దపంబునకున్ దగ సాక్షు లౌచు నీ
చెలి మొలిపింపఁ బెంపయిన చెట్టులయందును; నంతె గాని, దా
నెలమొల కెత్తునెత్తుగడయేఁ గన రా దకటా! యదేమొ, యీ
కలికికి నిందుమౌళియెడఁ గ్రాలెదు నాసకు భూసురాగ్రణీ! 60

ఉ. ఎన్నఁడు చూచునో తెలియ దిట్లు బతంబులఁ జిక్కి నెచ్చెలుల్
కన్నుల నీరు జాలుకొనఁ గన్గొనునీసఖి నర్థి వేఁడినన్
గ్రన్ననఁ బొందఁగా నలవిగా నలజాణుఁడు, వానలేమిచేఁ
జెన్నఱు దుక్కిచాలును శచీపతిఁ బోలె దయాలవాలుఁ డై. 61

చ. తరుణి మది న్మెలంగు చెలి దాఁపక యున్నతలంపు దెల్ప నీ
కరణి నెఱింగి యల్లకలకాలపు నేమపునీటుకాఁడు, నే

ర్పరి యయి ప్రశ్న సేసె; "నతివా! యిది యిట్టిదొ లేక వట్టివి
స్తరియొ?" యటంచు; లోఁగెరలుసంభ్రపుఁజిన్నెలుడాఁగురించుచున్.

క. పటికపుఁబూసలసర మిడి
నటపైఁ దనముడుగుఁవ్రేళ్ల ననువగుముంజే
నెటులెట్లొ లెక్కపలుకుల
నిటు లనెఁ దడ వదర మౌన మెడలిచి యుమతాన్. 63

ఉ. ఓనిగమజ్ఞమౌళీ! యిది యొప్పెదు, మీరనినట్ల మాన కీ
మానిసి పూను వేడ్కగరిమన్ బరమోచ్చపదంబు నందఁగా,
దానికి నీతపోవిధియ తప్పక గూరుచుసాధనోత్తమం
బౌ నట నాస కెందయిన నందనితాన మటన్న దున్నదే. 64

చ. అన విని యిట్లనున్ వడు; "గనంగవిరోధి నెఱుంగు వాఁడ" నా
తని మదిఁ గోరి సారె నిటు తగ్గక వర్తిలు దీ, వతం దశో
భనచరితంబునం దవులు వాయక యుండు లలిన్ దలంచి, నీ
యొనరుచు దాని కౌ ననఁగ నొప్పదు నామది యెంత చూచినన్. 65

చ. మనమున నిట్టివట్టికొఱమాలినవస్తువు గోరి, పట్టు మా
నని యెలనాఁగరో! చెపుమ నల్వుఁగఁ గట్టిన పెండ్లికంకణం
బెనయుచు నీత్వదీయ శయ, మెట్టు లదే మొద లైనయట్టిప
ట్టనుపుగ సైఁచుఁ, ద్రాఁచుఁగడియంబుగఁ దాలుచు శూలి కేలుచే?

ఉ. ఇంచుక యింతవట్టయిన నెంచి కనుంగొను నీకు నీవె, సం
ధించుట కివ్వి రెం డమర నేరుచు నేమొ యొకానొకప్పుడే
సంచుగఁ బెండ్లికూఁతుమెయిఁ జాతిన బల్నవకంపుఁబట్టురా
యంచలయున్పుఁజీర, క్షరదస్రకణంబు గజాజినంబునున్. 67

మ. పొరి నాల్గిండ్లబవంతులందు నునుబూమొత్తంబుపై మెట్టునీ
చరణాంభోజయుగం బొనర్చు నవలాక్షాలక్షణశ్రేణులన్
గరముం గిట్టనియాతఁ డైన నెవఁడేఁ గాక్షించునే యుండఁగా
వరగాత్రీ! విగతాసుకేశవిసరప్రాయశ్మశానోర్వులన్. 68

ఆ. హరునురమ్మ్మ నీకు ననువారఁ దొరఁకొన్నఁ
దగని దేది చెపుమ దానికన్న?
కొమ్మ! చందనమున కిమ్మైన నీఱొమ్ముఁ
బొదువుఁ జుమ్ము సొదవిబూదిదుమ్ము. 69

44



చ. ఇదియును నీకు ముందటనె యింకొకటౌ నగుబాటు పెండ్లి యై
మదకరి నెక్కి యేగఁదగు మానవతీతిలకంబ వైననిన్
ముదుసలియాలపోతు తనమూఁపున మోయఁగఁ జూచునట్టిచో
ముదితరో! నవ్వు నివ్వటిలు మోములు దాల్తురుపెద్దమానుసుల్. 70

చ. వగవఁ బినాకినొంద నిటు పాల్పడి యియ్యవి రెండు నియ్యెడన్
నెగు లెసఁగించు పా టెనసె నిద్దపుఁదళ్కులఁగుల్కు నల్లజెం
దొగచెలితొంటిచిన్నికళ; తోయజపత్రవిశాలనేత్ర! యీ
జగమున కెల్లఁ గన్నులకుఁ జక్కనివెన్నెల వైననీవునున్. 71

చ. ఎగదిగకన్ను లున్నచెలు, వేరు నెఱుంగని యట్టి పుట్టువున్
వగవఁగఁ గట్టుబట్టగను బట్టబయల్ తగు నన్న బట్టబై
లగుసిరిపెంపు బాలహరిణాంబకరో! వరులందు గోరఁగా
దగు సుగుణంబులం దొకటి యైనఁ ద్రిలోచనునందుఁ గల్గనే. 72

చ. మరలుపు మింక నీమనసు మానక యీ చెడుఁగోర్కినుండి యా
వరుసమగం డతం డెచట? భాగ్యపుఁజిన్నెలఁజెన్నుమీఱు పు
ష్కరదళనేత్ర వీ వెచట సాధువు యూపముపాలిశౌత్రసం
స్కరణము సేయఁ గోరునె శ్మశానపుఁగొఱ్ఱున కెందు వెఱ్ఱియై? 73

చ. అని యవనీసురుండు తన కప్రియ మౌవచనంబు లాడినన్
వనజదళాక్షి బి ట్టదరువాతెఱచే దనకిన్క గానరాఁ
గనుబొమలన్ గడున్ ముడిచి, కావిజిగిం దగుకోనలూను మో
హననయనాంబుజద్వయము నడ్డముగా మఱలించెఁ గ్రంచరన్. 74

చ. పలికెను వానితో నవల బాలకళానిధిమౌళితత్త్వమున్
దెలియవు గాక నిక్కముగ నీ విటు లందువె నన్ను; నెందు న
న్యుల కెనయంగ రాక, మఱి యూహకు మీఱిన కారణంబులన్
బొలుచు మహాత్మవృత్తముల మూఢులు దూఱుచునుంద్రసూయులై. 75

చ. బలకొనుకీడు వో నడవఁ బైకొనునాతఁడొ, కల్మి బొందఁగాఁ
దలఁకొనువాఁడొ, మంగళపదార్థములన్ గొనుఁగాక, శంకరుం
డలఘుఁడు, సర్వలోకనిచయైక శరణ్యుఁడు, నిస్పృహుండు; నా
వలఁతి కివేల, వాంఛలనువారక యాత్మఁ గలంచువస్తువుల్. 76

ఉ. కాసును లేక యుండియును గల్మికిఁ బుట్టినయిల్, జగత్రయిన్
వాసిగ నేలుమేటి యయినన్ గనిపించు శ్మశానవాటికన్

ద్రాసదరూపుఁ డయ్యెఁ గడు రాజిలు దన్ను శివుం డనన్ గిరీ
ష్వాసునితత్త్వ మారయఁ గలంతటి దిట్టలు లేరు సృష్టిలో. 77

చ. హరువగుసొమ్ములన్ వెలుఁగునట్టిదొ పాములు చుట్టినట్టిదో
కరియజినంపుఁబుట్టముదొ గాక దుకూలము గట్టినట్టిదో
గురుతుగ బమ్మపున్క గయికొన్నదొ, రాజవతంస మున్నదో
యిరవుగ విశ్వమూర్తి తను విట్టిది యంచు నెఱుంగ శక్యమే? 78

ఉ. అమ్మహనీయుదివ్యతను వంటి, చితాభసితంపు దుమ్ము ని
క్కమ్ముగఁబావన మ్మగుచుఁగ్రాలఁగఁ జాలును; గాన దాని నా
ట్యమ్మును వ్యంజకమ్ము ననునాటలు దీర్చెడువేళ రాలినన్
సమ్మతి వేలుపుల్ నిజలసన్మకుటమ్ములఁ దాల్తు రిమ్ముగన్. 79

మ. సిరి లే కాఁతడు గిబ్బ నెక్కి చనుచోఁ జెన్నారఁగా దాన పు
ష్కరధారల్ దొఱఁగించుదిక్కరటి నెక్కంజాలు స్వారాజు, త
చ్చరణాబ్జంబుల యంగళుల్ నిజవిరాజన్మౌళిమందారపు
ష్పరజశ్ఛన్నతఁగెంపుసొంపువహియింప న్మ్రొక్కుసద్భక్తితోన్. 80

ఉ. తప్పె వచింపఁ గోరియును, దద్దయునున్ మది దప్పి చెప్పి తీ
వొప్పె మహేశునందు నిది యొక్కటి పండితు లందు, రే గురుం
డొప్పుగ నాస్వయంభువున కుద్భవకారణ మౌ నటంచుఁ దా
మప్పరమేశు పుట్టు తెలియంబడు టెట్లు? యథార్థ మారయన్. 81

చ. కలహము చాలు, నిం కతఁడు గట్టిగ నీవెటువంటివాఁడుగా
వెలయఁగ వింటి, వించుకయు భేదము లే కటువంటివాఁడె గా
మలయును గాక, నామనసు మాత్రము రక్తి తొలంగ కందె తా
నిలిచెఁ దనంతమానిసి గణించునె యెందుఁ బరాపవాదముల్? 82

మ. అదరన్ వావిరి మోవి, యీవడగఁడౌ నజ్ఞుం డదేమో పొరిన్
వదరం బోయెడు వీని నెచ్చెలి! యిఁకన్ వారింపుమా వేగఁ బ్ర
ల్లద మొప్పన్ మహనీయులం దెగడుకూళం దొక్కఁడే గాఁడు వా
నిదు రాలాపము లాలకించుజనుఁడున్ జెందున్ మహాపాపమున్. 83

మ. అది గాదే నిదె నేనె పోదు నెటకే నంచా కురంగాక్షి వే
గదలెన్ జన్గవరాయిడిన్ బయఁటవాల్కం బెంతయు వ్రీలఁగా
సదర స్మేరముఖాబ్జుఁ డై సదృశిలక్ష్యస్వస్వరూపాఢ్యుఁడై
సదయుం డై సరసీరుహాస్య నొడిసెన్ సాధిష్ఠభద్రాంకుఁడున్. 84





ఉత్సాహ

అతనిఁ గాంచి జలదరించి యంగలత సెమర్పఁగా
నతివ యుంచ నెత్తినట్టియడుగు నట్టె పట్టియుం
చి తెర వడ్డపెట్టుగట్టుచేఁ గలంగుజాల్వలెన్
మతిఁ దెగింప దచలమణికుమారి యేగ నాఁగనున్. 85

తరళ

"ఇది మొదల్ నతగాత్రి! తావకభృత్యుఁడైతిని నన్ను నీ
విదితదివ్యతపోధనంబున విల్చికొంటి" వటంచుఁ దా
సదయుఁడై నెలతాల్పు పల్కఁగఁ జాన వీడె వ్రతాళిచేఁ
గదిరినట్టిశ్రమంబు మానదె కష్ట మీప్సితసిద్ధిచే. 86

---

పంచచామరము

కవిస్తవార్హనవ్యభవ్యకావ్యకల్పనావిధీ!
వివేకధీరతాక్షమాప్రవేకసద్గుణాంబుధీ!
యవంధ్యదానకీర్తిలంఘితాష్టదిక్ప్రయావధీ!
సుకృత్తచుంచుకూచిమంచి సోమసుందరప్రధీ. 3

తే. ఇది తపఃఫలసిద్ధినా విదిత మైన
పంచమపుసర్గ, సత్కూచిమంచిసోమ
సుందరకవీంద్రవేంగమానందనాగ్ర్య
సాంబశివకృతాంధ్రకుమారసంభవకృతి. 4

---

శ్రీః

# శ్రీమదాంధ్ర కుమారసంభవము

## షష్ఠాశ్వాసము

---

శ్రీజగదీశ్వరచరణాం
భోజార్పితయోగదృష్టి! బుధదైన్యకుభృ
ద్రాజీంద్రదిష్టి! సత్యయ
శోజితహిమఘృష్టి! సోమసుందరకృష్టీ! 1

క. అవధారు కాళిదాసను
కవిపికసురవాగ్రుతానుకారికిశోరీ
భవదస్మత్రైలింగప
టువచోగతి నవలికత నుడువుదు సవినతిన్. 2

---

క. ఆ వెనుక విశ్వమయునకుఁ
దా విన్నప మంపె నేకతంబున గౌరీ
దేవియుఁ జెలిచేఁ "దనకున్
గ్రావవిభున్ దాత గాఁగఁ గైకొనుఁ" డనుచున్. 1

చ. అలచెలిచే లతాంగి తనదౌ మనవిన్ బలికించుచుం దగన్
నిలకడ మీఱఁ గాంతుపయి నెయ్యముదాల్చుచుఁ బొల్చె నంచఁగో
కిలకలకంఠిచేత నెసగించుచు; బల్కులు వాయ రాని య
ర్మిలి ఋతురాజుపై నిలుపు మేలగు బాలరసాలశాఖ నాన్. 2





క. ఘనుఁడతఁ డటులే కాని
మ్మని నుడువుచు, విడువఁ జాల కాబిడ నెటొ వీ
డ్కొని తేజోమయమూర్తుల
ననఘుల సప్తర్షివరుల నాత్మఁ దలంచెన్. 3

క. ఆ రుచిరతపశ్శ్రీకు ల
పారనిజద్యుతివితతి నభఃస్థలి వెలుఁగం
గా రాజిలుచు నరుంధతి
తో రాజవతంసునెదుటఁ దోఁచిరి తోడ్తోన్. 4

క. సలలితతటమందారపు
టలరుల వెదఁజల్లునవలల నలరుచు దిగ్గం
తులమదమున వలఁచు నభః
స్థలగంగాఝురవరముల స్నాతులు పూతుల్. 5

క. తెలిముత్తియముల జన్నిద
ములుఁ గాంచనచీరచేలములు రతనపుఁబే
రులు దాలిచి, వానప్ర
స్థు లయిన సురతరుల కరణి సొంపగు వారల్. 6

క. అడుగున హరులనుబఱపుచు
బడగ తగన్ వంచి నతి యొనర్చుచు, ముదలన్
బడయఁగ వేవెల్గుందా
గడుబత్తిని గన్ను లెత్తి గనునట్టిఘనుల్. 7

క. పెనఁచి భుజాలతతో నిం
పెనయఁగ నెత్తంగఁబడిన యిలతోడఁ, గిటీం
ద్రుని పెనుగొమ్మున నలయిక
చన నుండెడువారు విలయసమయవిపత్తిన్. 8

క. అలఘుజగత్కర్త కిటీ
వలఁ గొఱవడి యున్నసృష్టిఁ బరిపూర్ణముగా
సలుపుటచే, నాద్యులు ధా
తలు ననుచుఁ బురాణవిదులు దగ ననువారల్. 9

క. తొలి సలిపినవి వినిర్మల
ములును, ఫలోన్ముఖములౌ తపోనిష్ఠల స

త్ఫలములు గుడుచుచు వెండియు
నలయక తపమే చరించు నచలితభావుల్. 10

క. వారల నడుమను బతిపద
వారిజముల దృష్టి నిలిపి, ప్రత్యక్షతపః
శ్రీరుచిరసిద్ధి యన సా
ధ్వీరత్న మరుంధతియును దేజరిలెఁ గడున్. 11

ఉ. ఆయమ నామునిప్రవరు లందఱతోడ నభేదగౌరవ
శ్రీ యెసఁగంగ నీశ్వరుఁడు సెచ్చెరఁగాంచెను బూరుషుండునున్
స్త్రీయు, నటన్న వేఱిమి గణించుటకున్ బని లేదొకించుకే
నేయెడ నైన సాధులకు వృత్తమె యాదరణీయమౌఁ గదా. 12

ఆ. ఆపురంధ్రిఁగాంచ నేపు మీఱెను, దార
సంగ్రహార్థకాంక్ష శంకరునకు;
నెంచి చూడ మంచి యిల్లాండ్రె గద మూల
కారణములు ధర్మకార్యములకు. 13

క. మృడుచే గిరిసుతఁ గూరిచి
యడుగుం బెట్టించె ధర్మ వైన నటం చూ
అడెఁదొంటి నేరమునకున్
గడు నడలెడుమరుమనము పునర్జీవాశన్. 14

క. ఆవల శ్రుతిపారగు లగు
నావిదితతపస్వు లెల్ల నఖిలగురుని సం
భావించి ప్రీతిచేఁ బుల
కావృతసర్వాంగు లగుచు ననిరీ రీతిన్. 15

చ. వరనియమంబుతో శ్రుతులు పాఠము సల్పుట, కాగమోక్తవై
ఖరి ననలంబు వ్రేల్చుటకు, గాసికి నోర్చితపంబు సేఁతకున్,
బరమఫలంబు మా కిపుడు పండె, జగత్పతి వీవు కోర్కికిన్
దరి గనరాని తావకమనఃపదవిన్ దగ మమ్ము నిల్పుటన్. 16,17

క. ఏ వాని మది మెలంగెద
వీ వాతఁడె మేటి యన్నఁ గృతకృత్యులలో
నోవేదవేద్య! నీమది
నేవాఁడు మెలంగు వాని నే మన వచ్చున్. 18



ఆ. నిక్క మెపుడు నుందు మెక్కుడుపదమందు
సోముకన్న నుష్ణధాముకన్న
అబ్బె నున్నతపద మంతకన్నను నేఁడు
మీరు మముఁ దలంచు సారకరుణ. 19

క. ఎన్నుదు మధికులముగ మీ
మన్నన గన్నట్టిమమ్ము మది నమ్మకమున్
బన్ను పడఁ జేయుఁ దఱుచుగ
నున్నతు లాదరము నిజగుణోత్కరమందున్. 20

క. ఏముదము నీతలంచుట
చేమాకు జనించె, దానిఁ జెప్పఁగ నీకిం
కేమిటి; కంతర్యామివి,
స్వామి! విరూపాక్ష! భూతసమితికి నెల్లన్. 21

క. కనఁబడితి గన్నులారఁగఁ
గనియును మిముఁదెలియలేము గద నిక్కముగా
నినుఁ దెలిపి గనికరింపవె
యనఘాత్మా! బుద్ధిపదవి కందవు గాదే. 22

క. దేన సృజింతు వఖిల మదొ,
యానిఖిలము దేనఁ బెంతు వదొ, యది గాదేఁ
బో నడఁచు విశ్వ మెది యదొ, యీ
నీ యంశము వచింపు మిం దెయ్యదియో? 23

క. కా కటు గడుగోప్యం బీ
యాకాంక్ష నటుంచి దేవ! యాత్మం దలఁపన్
మైకొని వచ్చిన మము దయఁ
జేకొని శాసింపు మేమి చేయఁగవలెనో. 24

క. అనవుడుఁ దనమకుటమున
దనరెడు రేమగువమగని తనుతర కాంతిన్
దనపలుఁదెలితళుకులఁ బెం
పెనయించుచు మాఱు పలికె నీశ్వరుఁ డిటులన్. 25

క. మీకుం దెలియున కాదే
నాకృత్యము లెవియుఁ గావు నాకై యని, నా

యీకరణి యగుట తెలియదె
యీ కాయాష్టముచేతనే యేరుపడన్. 26

అ. అట్టినన్ను దప్పి నార్తి చెందినచాత
కములు వానకొఱకు ఘనునిఁ బోలె
వేఁడికొనిరి యరుల వేఁడికిఁ దెరలిన
సురలు కరము మత్ప్రసూతికొఱకు. 27

క. కావున నాత్మభవాప్తికి
నై వలిమలమిన్నకన్నియన్ వలతుఁ గొనన్;
బావకజన్మంబునకై
వావిరి యజమానుఁ దరణి వాంఛించు క్రియన్. 28

క. ఆ కన్య నడుగఁ దగుదురు
మాకై మీరలు హిమక్ష్మాధరమౌళిన్
వైకల్యం బెనయవు సు
శ్లోకులు సమకూర్చినట్టి చుట్టఱికంబుల్. 29

క. స్థితిమంతుఁ డున్నతుఁడు, వసు
మతి భారము నోర్చు దండిమగఁ డాతనితో
డుత బాంధవ మెనసిన నను
మతి నెంచుఁ దవంచితునిగ మౌనివరేణ్యుల్. 30

క. ఈరీతిం గన్నియకై
యీ రాతని కనుఁ డటంచు నేలా తెలుపన్
మీరలు శాసించినదే
యారయ శిష్టస్మృతాంచితాచార మనన్. 31

క. ఆర్య యరుంధతియును నీ
కార్యమునం దోడు సేయఁగాఁ దగుఁ గడుఁజా
తుర్యము పురంధ్రులకుఁ బ్రా
చుర్యముగా నిట్టిపనులఁ జొప్పడుఁ గాదే. 32

ఆ. కానఁ గార్యసిద్ధికై చనుఁ డోషధి
ప్రస్థ మనెడు శైలరాజపురము,
మనము మఱలఁ గలిసికొను టీమహాకోశి
కాతరంగిణీప్రపాతభువినె. 33





క. యోగుల కెల్లను దొల్లిటి
యోగి యతఁడు పెండ్లియాడ నుద్యోగింపన్
త్యాగ మొనర్చిరి పత్నీ
యోగజ మగు సిగ్గు బ్రహ్మయోనులు మౌనుల్. 34

క. ఆవల ఋషిమండలియును
వే వెడలెన్ వల్లె యనుచు, వెసఁ జనెఁ బూర్వో
క్తావాసంబునకు మహా
దేవుఁడును, దదాగమప్రతీక్షాపేక్షన్. 35

క. అసివలె నసితం బగునా
కసమునకు ఋషివిసర మెగసి, యయ్యెడ మా
నససదృశఖృశత్వర న
ద్దెసకుం జని సేరి రోషధిప్రస్థపురిన్. 36

క. బలుసిరిపెంపులనెల వగు
నలకాపురిఁ గొట్టి తెచ్చి నట్టిజనులనో
నలి సురపురిఁ బట్టని మి
క్కిలిజనులనొ తెచ్చి యిడినక్రియఁ దగు నాప్రోల్. 37

గీ. సురతరంగిణికాల్వలు చుట్టు వాఱ
మెలసి జ్యోతిష్మతులు వప్రముల వెలుంగ
మానికపురాలపెనుగోడతో నెసంగి
మఱుఁగు గనియు, మనోజ్ఞ మై మలయు నదియు. 38

క. గిరిమహిమను బురిఁ గరులకు
ఖరనఖరదరంబు లేదు, గలుగుఁగలుఁగులన్
హరులను గిన్నరయక్షులె
వరపౌరులు తెరవ లచట వనదేవతలే. 39

క. నగరపుమేడలకొనలన్
దగిలిన మొగిలుగమి గర్జనప్రతిరవ మన్
వగఁ జాటు మీటు తీర్పులఁ
దగ మాన్చు నగారముల మృదంగారవముల్. 40

క. మేలగుకొమ్మల వ్రేలెడి
చేలంబులచేత వేల్పుఁజెట్లులె యటఁ, బౌ

రాళులు నిలుపక నిలిచిన
యాలయకేతనపటీచయము నయ మెనయున్. 41

క. అల పురిఁబటికపుటుప్పరి
గల నలరెడిపానగోష్ఠికల మాపులు విన్
వెలుఁగుల నీడలు తగు సుమ
ములగములో ముత్తియముల మొత్తములొ యనన్. 42

క. భూరితృణజ్యోతీరుచి
వారముచే దుర్దినక్షపాసమయములన్
దారులు గననేరుచు నభి
సారికలకు నెఱుకపడ వచట జీఁకటులే. 43

క. ఎలప్రాయమె తుదివయసట
కలుగం దంతకుఁడు కుసమకార్ముకు కంటెన్
దెలువులు తొలఁగుట, మరుసా
ముల నలయిక లొలసి నిదుర పోవుటలె పురిన్. 44

చ. పొలు పొలయన్ ముదుల్వడినబొమ్మలుఁగంపమునొందువాతెఱల్,
సలలిత మైనయంగుళుల జంకెనలున్ గలయట్టి కూర్మిచా
నల పొలయల్క లర్థుల నొనర్చును గ్రమ్మఱ నమ్మనస్వినీ
తిలకము లంతరంగములఁ దేటెడునంతకు వారికాంతులన్. 45

గీ. పురమునందలి సంతానతరుల నీడ
లందు నిదురింత్రు విద్యాధరాధ్వనీను
లమరు వెలుపలియెలదోఁట యగుచుఁ బురికిఁ
దావులకుఁ బట్టు గంధమాదనపు గట్టు. 46

క. సురమును లల హిమవత్పుర
మరయుచు స్వరవాప్తికొఱకు నధ్వరముఖదు
ష్కరకర్మములవిధాన మొ
నరిచెడి తొలినుడులఁ దచ్చనలొ యని రెదలన్. 47

క. వారలు దిగిరి గిరీంద్రు న
గారమునకు రయముతో ముఖము లెత్తి ప్రతీ
హారులు గన, నచలజటా
భారంబులు చిత్రలిఖితవహ్నులఁ బోలన్. 48



క. ఘనపదవినుండి దిగున
న్మునినివహము పెద్దవారు మునుగల వరుసన్
జనుదెంచి జలములందలి
దినమణి ప్రతిబింబతతిగతిన్ రాజిల్లెన్. 49

తే. పూజ్యతము లైన యామునిపుంగవులకు
దవ్వనసె లేచి యర్ఘ్యామృతమ్ము గొనుచు
ఘనబలమ్మున బరువులౌ దనయడుగుల
నేల యడుగంట నెదురేగె శైలమౌళి. 50

[1]చ. అతులిత ధాతురాగపదమౌ నధరంబు, శరీర మన్నఁ బ్రో
న్నతులకు తావు, నిక్కము దనర్పగుబాహులు దేవదారుల
ప్రతిమదృఢ మ్మురమ్మును స్వభావముచేతనె గ్రావ; మీవగన్
క్షితి హిమవంతుఁ డీతఁ డని చెప్పక చెప్పెడుగుర్తు లొందుచున్. 51

క. ఆనిర్మలకర్ములకు హి
మానీగిరి శాస్త్రవిహిత మహితార్చనలన్
వే నెరపి, దానె మార్గము
మానుగఁజూపుచు, వరోధమహికిఁ గొని చనెన్. 52

తే. ప్రేపబెత్తాల నల్లినపీఠములను
నచటఁ గూర్చున్న ప్రభువుల కమరమునుల
కనె గిరీంద్రుడు దాను నాసనము గొనుచు
నంజలి ఘటించి యిటువలె నాదరమున. 53

క. కడువడిఁ దలవని తలఁపుగ
నడరిన భవదీయదర్శనావాప్తి, మొగిల్
వొడమని జడివలె, నన గనఁ
బడని ఫలంబునటుఁ దోఁచె మామకమతికిన్. 54

క. ఘనమోహ మెడలి తెలివిం
గనినట్లుగ నినుము కుందనం బైనటు మే
దినినుండి త్రిదివమున కె
క్కినయటు, ననుఁదలఁతు మీదుకృపఁ గాంచుటచేన్. 55

---

[1]క. గైరికశోణ మ్మధరము, దారము మెయి పొడవు దేవదారులు బాహుల్
పేరురము ప్రకృతినేశిల, యీరీతిగ నేరుపడుచు హిమధాముఁ డనన్.

క. ఇది మొదలుగఁ బ్రాయత్యము
మదిఁగోరెడు జంతుతతికి మహి గమ్యుఁడనై
పొదలెదఁ; బెద్దలు మెట్టిన
యదియ గదా తీర్థ మనఁగ నారసి చూడన్. 56

క. ననుఁ బుణ్యునిగాఁ దలఁచెద
ననఘద్విజులార! రెంట; నౌదల సుమనో
ధునియవతరమున, మీపద
వనరుహములు కడిగినట్టి వరతీర్థమునన్. 57

చ. అరుదగు మీ యనుగ్రహము నాద్యమహామునిచంద్రులార! నా
యిరుఁదెఱఁ గైనమేనునకు నేర్పడఁ బంచితి రంచు నెంతు నీ
స్ఫురణ వహించునట్టి చరమూర్తికి, మీ విమలాంఘ్రిసేవ, తా
వరమునకున్ భవచ్చరణపంకరుహాంకము లొందు భాగ్యమున్. 58

క. ఒనర భవత్సంభావన
మున జననం బంది పొంగు మోదాతిశయం
బును బట్ట లేవు, దిక్కుల
కొనలకుఁ దనరియును నాదు గురుగాత్రంబుల్. 59

ఆ. దరుల నిరవుకొన్నతమ మొక్కటియకాదు
చెడు రజోగుణమును శిరము దన్ను
లోని తమము కూడ మానె భాస్వన్మూర్తు
లైన మిమ్ముఁ గాంచినంత నేఁడు. 60

క. ఘనులార! మీకుఁ గార్యము
గనరా దేదియు నదున్నఁ, గా దెయ్యది? యిం
దనువుగ మీ విచ్చేయుట
ననుఁ బావనుఁ జేయుతలఁపుననె యని తలఁతున్. 61

ఆ. ఐనఁగాని, యెద్ది యేనర్థమందు న
న్నాన వెట్టఁ దగుదు రాదరమునఁ;
బ్రభుల వలనఁ బనుపు వడయుటె మన్నన
దాసజనుల కెందు ధరణియందు. 62

క. వాకొనుఁ డీమేమీ సతి
యాకులజీవితము కన్య; యిందెవ్వరిచే



మీకుం బని? యితరార్థా
నీకము నొకలెక్క గొందునే మీరడుగన్. 63

క. అని పలికి యన్నగాగ్రణి
దనదు గుహాముఖములందుఁ దగఁ జొచ్చు ప్రతి
ధ్వనిచేత నేతదర్థమె
యినుమాఱు వచించె ననఁగ నెంతయు నొప్పెన్. 64

క. అనువుగఁ బలికెడుపనులను
మొనకాఁ దగు నంగిరసుని మునివరు లెల్లన్
గనుఁగొని ప్రేరేచిన ని
ట్లని యాతఁడు మారు పలికె నచలాగ్రణికిన్. 65

క. చెల్లును నీయెడ నియ్యది
యెల్లను మఱి యింతకంటె హెచ్చు గిరీంద్రా!
యుల్లోకసమున్నతి నీ
యుల్లమునకు శిఖరములకు నొప్పును సమమై. 66

క. స్థావరవిష్ణుఁడ వగుదువు
నీ వనునార్యోక్తి చెల్లు నీకుక్షి కదా
వావిరి స్థిరజంగమనా
నావిధభూతవితతికిఁ దనరు నాదరువై. 67



క. వ్యాళము మహి నెటు మోయం
జాలెడును మృణాళమృదుఫణంబులచేఁ బా
తాళముమొదలంటఁగ నీ
వాలంబము సేయ కున్న నద్రులమిన్నా! 68

గీ. ఎడతెగని విమలసంతతి నెసక మెససి
గడలితరఁగలగమిచేతఁ గట్టువడక
భువముల నెల్లఁ బావనముల నొనర్చు
నీయసంబులు నదులును నిర్మలాత్మ. 69

క. గగనాపగ తొలి ప్రభవ
మ్మగు హరిచరణమున నెట్లొ యట్లే కరముం
బొగడిక రెండవ ప్రభవ
మ్మగునీచేఁ గాంచు జగదుదగ్రశిరస్కా! 70

క. క్రిందికి నడ్డంబుగఁ బై
కిం దగఁ దనరారు మహిమ కేశవునకుఁ జె
న్నొందెఁ ద్రివిక్రమములు దాఁ
జెందినపుడె యది నిసర్గసిద్ధము నీకున్. 71

క. క్రతుభాగభోగతత్పర
శతమఖముఖు లైన యమరచంద్రులసభ నం
చితపద ముంచుచుఁ గావిం
చితి మేరువు తుంగకనకశృంగము వితగాన్. 72

క. యావన్నిజకాఠిన్యము
నీ వచరశరీరమందె నిలిపి తగపతీ!
వావిరి నార్యసపర్యన్
గావించెదు భక్తినమ్రకాయ మిది కదా. 73

క. విను మది గావున మా వ
చ్చినపని యది నీదుపనియ శ్రేయస్కరమౌ
పనుల యుపదేశముననే
పనుపడఁగా నిందు మాకు భాగం బొదవెన్. 74

క. పరఁగ నణిమాదిగుణముల
కిర వై మతి పురుషు నెవ్వనే నంటనిదై
పరమోన్నతిఁ జెన్నగునీ
శ్వరనామము దాల్చు నెవఁడు చంద్రార్ధముతోన్. 75

క. సామర్థ్య మొక్కటొకటికి
నేమరక యొనర్పు భూప్రభృతిమూర్తులచే
దా మోయు నీయఖిల మే
భూమాత్ముఁడు దారి నరదమును హరులుఁబలెన్. 76

క. అంతర్యామి యటంచును
జింతింతురు యోగు లెవనిఁ జెప్పుదురును ధీ
మంతులు పదమెవ్వని దా
వంతయును బునర్జననభయము లేనిది గాన్. 77

క. ఆనిఖిలకర్మసాక్షియు
నానిత్యాభీష్టదాత యాశంకరుఁడే





మానోట నిడిన నుడువులఁ
దా నడుగుచు నున్నవాఁడు తావకతనయన్. 78

క. ఆయనఘు వాణితో నభి
ధేయమునటు గూర్పఁ దగుఁద్వదీయాత్మజతోఁ
బాయదె వగ మంచిమగని
కీయంబడినట్టికన్నెయెడ జనకునికిన్. 79

క. స్థావరములు జంగమములు
నై వెలసిన జంతుకోటు లన్నియు నీమెన్
భావించుఁగాక తల్లిగ
నీవిశ్వంబునకుఁ దండ్రి యీశ్వరుఁ డగుటన్. 80

క. శితికంఠునకు నమస్కృతి
నతిభక్తి నొనర్చి విబుధు లవ్వల నిజరా
జితమకుటమణీఘృణిసం
తతి నీరాజింత్రుఁ గాక త్వత్సుతపదముల్. 81

క. ఉమ కన్య నీవు దాతవు
ప్రమదంబున నడుగ వచ్చువారల మీ మే
ము మహేశుఁడు వరుఁ డది చాల్
సమున్నతిని నీదు వంగసమునకు నెరపన్. 82

క. పొగడఁడు మ్రొక్కఁడు నొరుఁ దాఁ
బొగడంబడు మ్రొక్కఁబడును ముజ్జగములచే
మొగి నీసుత నతనికి నం
గుగ నిమ్ము, జగద్గురునికి గురుఁడవు గమ్మా. 83

క. ఇక్కరణి వేల్పుఁదాపసి
వక్కాణింపంగఁ దండ్రి పజ్జ మొగమ్మున్
గ్రక్కునను వంచి పార్వతి
లెక్కించె విలాసధృతనలినదళములఁ దాన్. 84

క. అన్నెటిఁ గోరిక చేకుటి
న న్నగపతి మేన యాననమె తిలకించెన్
గన్నులు గృహపతులకుఁ దమ
యన్నులె గద తఱచు గన్నియల కార్యములన్. 85

క. మేనయు మగనికిఁ బ్రియమగు
నానిరుపమకార్యమునకు నౌ ననెఁ దానున్
బూనరు వైముఖ్యము సుం
తేనిఁ బతివ్రతలు భర్తృభీష్టార్థములన్. 86

క. ఈయది యుచితోత్తర మని
యాయతమతి నరసి మంగళాలంకార
శ్రీయుత సుతఁ బొదవె నవ
శ్యాయాద్రియుఁ గేల మునివచోఽంతమునందున్. 87

క. రావమ్మ! విశ్వమయునకు
నీవైతివి భిక్షగాఁగ నిశ్చిత వర్థుల్
దైవతమును లఁట; గృహినై
నే విలసిల్లుటకు ఫలము నేటికిఁ గంటిన్. 88

క. అక్కొండలదొర సుతతోఁ
జక్కగఁ దా నింతె వలికి సంయముల కనెన్
"మ్రొక్కెడు దమ కందఱ కిదె
ముక్కన్నుల వేల్పుఁబ్రోడ ప్రోయా" లనుచున్. 89

క. కోరినపని నెరపుచు సము
దారం బగు నద్రి మాట కౌనౌ ననుచున్
వా రంబికఁ బొదలించి ర
పారపురఃఫలము లైన బలుదీవనలన్. 90

క. భూరినమస్కారత్వరఁ
జారుకనకకుండలములు జాఱఁ ద్రపాలం
కార యగు నుమ నరుంధతి
కూరిమిఁ గూర్చుండఁబెట్టుకొనెఁ దనతొడపై. 91

క. కన్నపెరిమె వివశత గని
కన్నుల నీరదరఁ జేయు గౌరీజననిన్
ము న్నొకతె లేనియల్లుని
తిన్ననిగుణముల వసిష్ఠు దేవెరి తేర్చెన్. 92

క. "వైవాహికతిథి యెపు" దని
యావిధుశేఖరుని మామ యప్పుడె ప్రశ్నన్





గావింప "మూఁడుదినముల
కావలఁ" నని సనిరి వల్కలాంబరధారుల్. 93

క. అమ్మునులు గిరిని వీడ్కొని
క్రమ్మఱ హరుపాలి కరిగి కార్యమగుట దా
మిమ్ముగ వచించి యాతని
సమ్మతి గొని యుద్గమించి చని రట దివికిన్. 94

మాలిని

మృదుఁ డలతిగ బ్రొద్దుల్ మిక్కుటం బైనకస్తిన్
గడపె గిరిజఁ గూడంగా మహోత్కంఠతోడన్
వడిఁ గలచెఁ గరం బీభావముల్ దేవునే నాఁ
గడమ యవశు నేనిం గాకు గావింప కుందున్. 95

---

తరళ

కరకపిత్థసుబోధశస్త్రవిఖండితాంతరశాత్రవా!
నిరుపమానలసద్గుణాగ్ర్యమణీవితానసుధార్ణవా!
వరరమాకరకూచిమంచిసువంశవారిధిసంభవా!
సురపవైభవ! సోమసుందరసూరికైరవబాంధవా! 3

గీ. ఇది యుమావరణ మన జగద్విదితషష్ఠ
సర్గ సత్కూచిమంచివంశ్యమణి సోమ
సుందరకవీంద్రవేంగమానందనాగ్ర్య
సాంబశివాకృతాంధ్రకుమారసంభవకృతి. 4

---

శ్రీః

# శ్రీమదాంధ్ర కుమారసంభవము

## సప్తమాశ్వాసము

---

శ్రీగురుతరగానసుకవి
తాగణితాదికకలావితానచతురతా
భోగార్జితామృతాభయ
శోగుంఠితసకల! సోమసుందరసుకలా! 1

క. అవధారు కాళిదాసుసు
కవిదివిషత్సూక్తివిబుధకామిన్యనువా
దివరశుకీభవదాత్మాం
ధ్రవచశ్శ్రీ వినుతుఁ బైకత సవినయతన్. 2

---

ఉ. పిమ్మట నోషధీశ్వరుఁడు పెంపు వహించెడు పక్షమందు భ
వ్య మ్మయి శుద్ధసప్తమగృహమ్మునఁ బొల్చు శుభోదయమ్ముతో
నిమ్మగునాఁడు భూధరకులేందుఁడు దీర్చెఁ గౌమార్తెమిన్నకున్
సమ్మతితో వివాహశుభసంస్కరణక్రియ సాప్తబంధుఁడై. 1

చ. విరివిగ నింటనింట నటఁ బెండ్లికి మంగళమంజులార్థముల్
సరగునఁ గూర్చు కార్యముల సంభ్రమ మొందు కుటుంబినీజనో
త్కరమున నొప్పి యెల్లరకు గట్టులతేనెడఁ గల్గుప్రీతిచే
హరువు వహించెఁ దత్పురము నంతిపురమ్మును నొక్క యిల్వలెన్. 2





మహాస్రగ్ధర

వరసంతానప్రసూనావళి పఱచినపెన్బాట లొప్పారుచుండన్
వరుసన్ మీఁఅంగఁ బట్టాంబరరచితములై భాసిలన్ డెక్కముల్ ని
ర్భరశోభన్ భర్మపుందోరణములపసలున్ రాజిలన్‌బొల్చె నాప్రో
లరుదౌ స్థానంతరంబం దలరుసురపురంబట్టు లత్యంతకాంతిన్. 3

చ. ఒనర నపత్యముల్ పలువు రున్నను గన్న దదోర్త యైన వి
న్ననువునఁ దప్పిపోయి పలునాళులకున్ మఱలంగఁగానిపిం
చిన గతిఁ బోయి గ్రమ్మఱఁగ జీవిత యై నటుఁ గాంచి రాకొమా
ర్తను గడుఁ బ్రాణ మట్లు తలిదండ్రులు పెండిలి డాసె నన్మతిన్. 4

ఉ. అంకము వీడి దీవనల నందుచు నంకము నెక్కు మంజులా
లంకృతివెంబడిన్ బునరలంకృతి గాంచు నటుల్ కులాచలై
ణాంకు ననుంగుఁజుట్టముల యర్మిలి బంధువిభక్త మయ్యు నా
పంకజగంధిఁ జేరె నిలువన్ దన కెక్కటి మన్కిపట్టుగాన్. 5

ఉ. ఉత్తరఫల్గునీహిమమయూఖులసంగ మెసంగు నాఁడు స
ర్వోత్తమమైత్రదైవతముహూర్తమునన్ శుభమండనంబు నా
పుత్తడిబొమ్మ నెమ్మెయిని బొందుగఁగూర్చిరి భూధరాధిభూ
సత్తము బంధువర్గమున సంతతి గల్గు సువాసినీమణుల్. 6

చ. సరవిగ సందులందుఁ దెలిసొనువులం జొనుపన్ రహించులే
గరికచిగుళ్ళతో నెనసి కాంతి వహించుచు, నాభి దాఁటి సుం
దర మగుపట్టుఁబుట్టమును దాల్చుచు, బాణము పూని మానుగాఁ
బరఁగు తలంటు వేసమును భాసిలఁ జేసె లతాంగి వాసిగా. 7

క. మానుగ వివాహదీక్షకుఁ
బూనిన క్రొందూపుతోడి పొందున నలరెన్
జాన బహుళాంతమున రవి
భానుయుతిన్ బెంపు గను క్షపావిభుకళనాన్. 8

చ. జలకపుటిల్లు సేర్చిరి రసాధరమౌళికుమారికన్ దదా
ళులు మెయి నూనెజిడ్డు సన లొద్దుగ చూర్ణము నల్గు పెట్టి యిం
పెలయ సుగాత్రిగాత్రమున నించుక యెండిన జాపకంబు దా
మలఁచి జలంబు లాడ ననువౌ నునువల్వము దాల్పఁ జేయుచున్. 9

తే. మరకతపుఱాలనేలల మౌక్తికముల
ముగ్గుల నెసంగునాచక్కిఁ బూవుఁబోండ్లు
పసిఁడిబిందెల జలములు వంచి తూర్య
రవముతో జలక మార్చి రారాజముఖిని. 10

తే. మంగళస్నానమున నిర్మలాంగి యగుచు
మగువ పతిఁగూర్చి తాల్చిన మదుఁగుతోడ
నలరె వర్ష జలాభిషేకాంతమందు
విరియు తెల్లువువుల్ గలధరణికరణి. 11

చ. ఎలమిని గౌఁగిటం బొదవి యిందునిభాననఁ దెచ్చి చేర్చి రా
నెలవున నుండి సాధ్వు లగు నీరజపత్రవిశాలలోచనల్
నలువుగ మేలుక ట్లొలసి నాలుగు బల్రతనంపుఁగంబముల్
గలుగుచు సజ్జపీఠ మయి గ్రాలెదు పెండిలితిన్నె మధ్యమున్. 12

ఉ. తూరుపుమోముగా నచటఁ దొయ్యలిఁ గూరుచునుండఁబెట్టి దా
మూర కొకింతసేపు నిలుచుండిరి మ్రోల ననుంగుబోంట్లు నిం
డార నలంక్రియోపకరణార్థము లొద్దనె యున్న నమ్మనో
హారిణి పుట్టు బల్సొగసె యట్టె హరింపఁగ వారిచూడ్కులన్. 13

తే. వెలఁది యొక్కతె ధూపంపువేఁడి చేత
నలరు లోఁగల్గు చెలిపెన్నెఱులఁ దడార్చి
ముడిచి యందంబుఁగాఁ జుట్టె నడుమ నడుమ
గరికలను దాల్చు తెలియిప్ప విరులదండ. 14

ఉ. అక్కలకంఠిమేన ధవళాగురుచర్చ యొనర్చి నెచ్చెలుల్
మక్కువ మీఱ గోరజపుమంజులపత్రములన్ రచింపఁగా
జక్కవజంటలన్ వెలయు సైకతముల్ గల జహ్నుకన్యకన్
జక్కఁదనంబునం గెలువఁజాలుచు భాసిలె మీసరంబుగాన్. 15

చ. తగిలిన తేంట్లతో వఱలుతమ్మివిరిన్ నిరసించి నీలపుం
జిగిఁ దులకించుక్రొమ్మొగిలుచెంగటి చందురు బింబ మోర్చి యిం
పుగఁ గయిసేయఁగాఁబడిన ముంగురులం దగుగౌరిమోముబల్
సొగ సలరారె నుద్ది యనుసుద్దికి నే నిల నీడ నీనిదై. 16

చ. నలువుగఁ దిల్వకల్కమున నల్గిడఁగాఁ గఱ కెక్కి గోరజం
బలఁద నితాంతగౌర మగు నంగన చెక్కిట నిల్వఁగల్గినం

54



దులకు ఫలంబు దాఁ గనియెఁ దొయ్యలి వీనునఁ బెట్టినట్టి మం
జులతరమౌ యవాంకురము చూపఱ చూడ్కులఁ బట్టఁజాలుచున్. 17

చ. అనువుగ నేరుపడ్డ రుచిరాంగము లొందు వెలందిమోవి శో
భనగతి మధ్య రేఖను విభక్తతఁ జెంది, యొకింత సిక్థకం
బునఁ దుదువంగ గెంపుజిగిఁ బొంపిరి వోవుచు, దా నదుళ్ళచేఁ
గనె బలునీటు సోయగము కల్మికి ముఖ్యఫలంబు డాయఁగాన్. 18

చ. లలితపదాంబుజద్వయికి లత్తుగ తీరిచి "దీనఁ జెల్వునౌ
దల నెలకొన్న చిన్ని నెలఁ దాఁకును నీ" వని నవ్వులాట చె
న్నలరఁగ దీవనల్ నుడువు నర్మిలి బోటికి మాఱువల్క కా
కులగిరిచక్రవర్తిసుతఁ గొట్టెను దానిని బూవుదండతో. 19

చ. చెలువ కలంకృతుల్ సలుపుచేడెలు లెస్స జనించినట్టి యు
త్పలముల రేకులట్లు కడు భాసిలు నచ్చెలిమిన్న కన్నులన్
దెలియఁగఁ జూచి కజ్జలము దెచ్చుట వానికి సొంపు వెంపఁగాఁ
దలఁకొని గాదు మంగళపదార్థ మనం జనుగౌరవంబునన్. 20

చ. పొడముచునున్న క్రొన్ననలమొత్తముతో నెలదీవ కైవడిన్
బొడుచుచునున్న తారకలపుంజముతో నిసిరీతి, లోనఁ జొ
ప్పడ మనుచున్న చక్రఖగవారముతో ధుని లీల బాల క్రొం
దొడవుల నందుచుం దనరెఁ దొయ్యలి కయ్యవి మేన మొల్చె నాన్. 21

చ. వనజదళాయతాక్షి నిడువాలుకనుంగవ నిల్పి యద్దమం
దనువుగఁ దేజరిల్లు తన యందము గాంచి గిరీశుఁ జేరఁగా
మనమున వేగిరించె నతిమాత్ర మటౌఁ బరికింప మందనం
బునకుఁ బ్రయోజనంబు పువుఁబోండ్లకుఁ గాంతులు సూచుటేగదా22

తే. అవల మాంగళ్య మైయొప్పు నరదళంపు
ద్రవము మణిసిల నిరుద్రేళ్ళ తల్లి దెచ్చి
వీనుఁగవఁ గీలుకొని గ్రాలు విమలదంత
పత్రముల నొప్పు పుత్రికావదన మెత్తి. 23

చ. మునుమును గట్టుపట్టి చనుమొల్కల వెంబడిఁబుట్టి, పెంపుతోఁ
దనరిన దేమనోరథము దానినె గుబ్బలిరాచరాణి ది
ద్దెను దనముద్దుఁగూఁతునకుఁ దిన్నగ నెట్టులొ పెండ్లిబొట్టుగా
గనుఁగవ ముమ్మర మ్మెనయఁగ్రమ్ముచునుండఁగ సమ్మదాశ్రువుల్. 24

ఉ. అట్టు ముదగ్రులన్ గలక నందెడు చూడ్కిని దావు దప్పఁగాఁ
బట్టికిఁ గట్టె నౌర్ణ మయి భాసిలు కౌతుకహస్తసూత్రమున్
గట్టునెలంత దాది యది గన్గొని క్రమ్మఱ దానిఁబెట్ట నౌ
నట్టి యనుంగుఁబట్టునకు నంగుళులన్ జరపన్ బొరి బొరిన్. 25

ఉ. సారసగంధి బల్నురుగుఁజాలును దాలుచుచున్నదౌ సుధా
నీరధివేల పోలికను, వెన్నెలఁ జెన్నలరారుచున్నదౌ
శారదరాత్రి యట్లును నెసంగెను; క్రొందెలిపట్టుఁజీర చె
ల్వారఁగఁగట్టుచున్ మెఱుఁగుటద్దము కేల ధరించుచున్న దై. 26

చ. వెలయఁగఁ గొల్వఁబడ్డ యిలువేల్పుల కాదట మ్రొక్కఁజేసి యి
మ్ముల జరిపింప నర్హ మయి పొల్చెడు కర్జములందు జాణ గు
బ్బలిదొరసాని యైదువుల పాదము లోలి గ్రహింపఁ జేసె ని
ష్కలుషనిజాన్వయస్థితికిఁ గారణమై తగు నాత్మజాతచేన్. 27

చ. వినిమితగాత్రి నయ్యుమను బ్రీతి వచించిరి వా 'రనూనమౌ
పెనిమిటి ప్రేమ గాంచు" మని పిమ్మటఁ గొమ్మ తదీయకాయమం
దనువుగ సాము దక్కఁగొని యర్మిలి బోటులు వెట్టినట్టి దీ
వెనలను గూడ నెట్టెఁగడు వెన్కకు భాగ్యము మట్టుమీఱఁగన్. 28

ఉ. అన్నిట జాణ గొల్వునకు నైనఘనుండు నగాధిరాజు ప్రే
మోన్నతి వేడ్కకల్ములకు నొప్పుగఁ బట్టికిఁ జేయ నైన వా
ని న్నిఖిలంబును న్నెరపి నెయ్యపుబందుగు లెల్లఁ జేరి కూ
ర్చున్న సభాంగణంబునను నుండెను వేచి వృషాంకు రాకకున్. 29

క. ఆలోఁ దారకగిరిఁ దిగ
ప్రోలుల నోరిచిన శంకరునికిని మాతల్
మ్రోల నిడిరి సాదర మగు
లీలను మొదలింటి పెండిలికిఁ దగు తొడవుల్. 30

క. ఊరక వారలయెడఁ గల
గౌరవమున నీశుఁ డంటెఁ గల్యాణాలం
కారశ్రీ నామేటికి
నారూపమె మాఱె వరుని కనువగు తెఱఁగై. 31

క. తెలిగంద మయ్యె బసుమమె
తలఁ దెలివిరిసరిసిరి గని దగెఁబునుకయె సాం



చలరోచనాంక మయి కరి
కళవసమె దుకూల మగుచుఁ గర మొప్పారెన్. 32

చ. పసపుమెఱుంగు లీనునడిపాపను లోపలఁ బూని చొక్కపుం
బస నళికాస్థిమధ్యమును భాసిలెనే బలుగన్ను దా నదే
యెసఁగె సమీపమందు వసియించుచు మించుటఁజేసి చారుతో
ల్లసనము మీఱఁగా నరదళంబునఁ బెట్టిన చుక్కబొట్టుగన్. 33

క. తగు నెలవుల నెలకొని పలు
వగల నగల గూర్చుభుజగవరుల యొడళులే
యొగి మాఱెఁ దొంటి పగిదినె
నెగడెఁ దదుజ్జ్వలఫణామణీఘృణిగణముల్. 34

ఉ. పిన్నఁదనంబుఁజేసి కనిపింపక యుండు కళంకరేఖతో
వెన్నెల తళ్కులన్ బవలె పెల్లుగ నీనెడు చందమామతోఁ
బ్రన్ననియోగ మెన్నఁడును బాయనిదై పొలుమారు మౌళిచే
నెన్నిక గన్నమేటి కిఁక నేటికి మిన్న ధరింప నౌదలన్? 35

చ. ఇటువలె నక్కజంబులకు నెల్లను నెక్కటి మూలమైన ధూ
ర్జటి తనదౌ మహామహిమఁ బ్రాకటమండనసంవిధానసం
ఘటకత నొప్పు మీఱి యుపకంఠచరప్రమథోపనీతమౌ
పటుతర ఖడ్గమం దెనసి భాసిలఁగాఁ దననీడ నారసెన్. 36

చ. అల నెలతాల్పు వే వెడలె నల్లన నంది బుజమ్ము నూది బ
ల్వల నలరార బెబ్బులికళాసము గప్పిన విప్పు వీపుతో
నలరుచు భక్తి పేర్మిఁదనయంగపుదొడ్డకొలందిఁ గుంచుగి
త్తలతలమిన్న రౌప్యవసుధాధరమౌళిని బోలె నెక్కుచున్. 37

చ. అరిగిరి నైజయానసముదంచితకంపవిలోలకుండల
స్ఫురణలు దాల్చి యాత్మరుచిపూగపరాగవరానురాగసుం
దరవదనంబులన్ జదలు తమ్మికొలంకు వలెన్ వెలుంగఁగా
నెరపుచు మాత లయ్యఖిలనిర్జరవంద్యపదాబ్జు వెంబడిన్. 38

ఉ. మేలిమిబంగరంపుజిగి మీఱెడి వారల వెన్క శోభిలెన్
గాళిక పున్కపేరు తన కంబుగళంబు నలంకరింప శం
పాళిని దౌల మున్ బఱచునట్లుగఁ దోలి బలాకమాలికన్
దాలుచునీలనీరదవితానముఁబోనిది యైనమేనితోన్. 39

చ. పదపడి దేవతావళికి బాలమృగాంకకిరీటుఁ గొల్వఁగా
నద నిదె యంచుఁ దెల్పె సురయానశిరంబులపైకి డిగ్గుచున్
బొదలు వివాహతూర్యచయభూరిరవంబు పురారి ముందటన్
ముద మొదవంగఁబోవు గణముల్ మొఱయింప నెసంగు నట్టిదై. 40

చ. అతులితవిశ్వకర్మకృత మైన నవాతపవారణంబు గొం
చతనికి భక్తితో దశశతాంశుఁడు పట్టఁగ దాని చుట్టు లం
బిత మగు పట్టుఁబుట్టపుసమీపమునన్ దులకించుమౌళితో
నతఁ డలరెన్ నిలింపధుని యొదలపై దిగునాఁటి నీటుతోన్. 41

తే. కాయములు దాల్చి యపుడు గంగాయమునలు
కుంచెలు గ్రహించి యతని సేవించికొనిరి
నిమ్నగాకృతి వికృతిఁ జెందినను వాని
కంచబారులనడ మాననట్లు తోఁచె. 42

శా. ఆవిశ్వేశ్వరుసమ్ముఖమ్మునకుఁ దా నాద్యుండు లోకేశుఁడున్
శ్రీవత్సాంకితుఁడైన యప్పురుషుఁడున్ సేవింప నేతెంచి యా
దేవోత్తంసుమహత్త్వమున్ 'జయ' యనన్ దీపించువాక్యంబునన్
వే వర్ధిల్లఁగఁజేసిరా సవనవహ్నిం బోలె హవ్యంబునన్. 43

ఉ. ముద్దిను సయ్యె వేఱుపడి ము న్నల యొక్కఁడె యైన మూర్తియే
పెద్దలు పిన్నలం చనుట వీరల కెల్ల సమంబె పెద్ద యౌ
నద్దనుజారికంటె హరుఁ డచ్యుతుఁ డప్పురవైరికంటె వీ
రిద్దఱకంటె ధాత మఱియాతనికంటెను వీరు నొక్కచోన్. 44

చ. అతనికి లోకపాలు రమరాధిపముఖ్యులు నైజవైభవో
చితధవళాపత్రముఖచిహ్నము లూడ్చి వినీతవేషసం
గతులయి దర్శనార్థముగఁ గ్రన్నన సన్నల నంది వేఁడి ద
ర్శితులయి వానిచే నతులు సేసిరి చేతులు దోయిలించుచున్. 45

క. తలయూపునఁ గమలజు హరిఁ
బలుకున నెలనవ్వున వృత్రవైరిని బెఱవే
ల్పుల నెల్లఁ జూపునన్; యిటు
లలఘుఁడు మన్నించెఁ దత్తదర్హానుగతిన్. 46

చ. అతనికి మున్నుగా "జయ" యటంచును సప్తమహర్షులిచ్చి రం
చిత మగు నట్టిదీవన వచించె నతండును వారి కిట్లు స





స్మితముగ "వేఁడినాఁడఁగద మిమ్ముల నిమ్ముల ముందె యిందు వి
స్తృతమగు పెండ్లిజన్నమున ఋత్విజులౌట" కటంచుఁ బ్రీతితోన్. 47

గీ. సుప్రవీణులు, విశ్వావసుప్రముఖులు
మధురముగఁ బాడఁ ద్రిపురసంహారకథను
ఘనతమతమంపువికృతికిఁ జెనయరాని
నెలతునుకదారి దారి చెన్నలరఁ గడచె. 48

ఉ. క్రన్నన మ్రోఁగు పైఁడిచిఱుగంటలతో సవిలాసయానసం
పన్నత మింట నేగు నల వాహము సారె మొగుళ్లలో దగు
ల్కొన్న విషాణముల్ తటము గ్రుమ్మఁగఁగర్ద మమంటుకొన్న యా
వన్నె విదుర్చుకొంచుఁ బయిఁ బన్నిన పన్నగభూషు మోయుచున్. 49

మ. చని చేరెన్ గిరిసార్వభౌముపరిరక్షం జేసి శత్రువ్రజం
బునకున్ దేఱి కనంగరాని సిరితోఁ బొల్పారునా పట్టణం
బును మున్ బర్వెదునుర్వరారథికుచూపుల్ హేమదామంబుల
ట్లనువందం దను లాగ ముందఱికి, నయ్యానోత్తమం బొయ్యనన్ 50

ఉ. పమ్మినవేడ్క నప్పురము పజ్జను బౌరులు మోము లెత్తి త
న్మిమ్ముగఁ జూడఁ గ్రొమ్మొగిలు నేలెడు నీలపుడాలు గల్గు కం
రమ్ము వహించి మించుదొర నైజశరాంకిత మైన దివ్యమా
ర్గమ్ముననుండి డిగ్గి సుకరమ్ముగ నిల్చె సమీపభూమిపై. 51

ఉ. ఆవిభు రాకచే నలరి యద్రివరుం డెదురేగె భూషణ
శ్రీ విలసిల్లు బంధుజనబృందము కాంతలతాంతభూరిభా
రావనతావనీరుహసమన్వితనైజనితంబపంక్తిశో
భావిభవంబు దాల్చు మదవారణవారము నెక్కి వెంట రాన్. 52

చ. వివృతకవాట మైన యల వీటి దువారమునందు నొక్కటన్
దివిషదనీకమున్ వసుమతీధరలోకము రెండుఁ గూడె నా
రవళులు దవ్వు పర్వ సుకరంబుగ నొక్కటె యైన యద్దక
ట్టవిసిన వారిపూరయుగ మైక్యముఁ జెందెడు చంద మేర్పడన్. 53

ఆ. ముజ్జగమ్ము లెతని మ్రొక్కెడు నామేటి,
తనకు మ్రొక్క లజ్జ గొనుచు నద్రి
తలఁపఁ డతని మహిమఁ దనశిరంబు గరంబు
ముందె క్రిందు వడుట డెందమందు. 54

చ. తన ముఖకాంతి యింపున నితాంతవికాసము నొంద నద్రిరా
జనువుగ ముందు దాఁజనుచు నల్లునిఁదోడ్కొనిపోయె గుల్ఫముల్
మునుఁగఁగ జల్లివట్టి పువుముంపుల సొంపగు పణ్యవీథులన్
దనరుచు సంపదాకర మనం దగు నైజపురంబులోనికిన్. 55

క. అత్తఱి హరదర్శనపర
చిత్త లయిన యప్పురంపుఁ జెలువల కయ్యెన్
బ్రోత్తుంగసౌధవీథుల,
నిత్తెఱఁగున మాఱుపనుల నెఱుఁగని చెయ్వుల్. 56

ఉ. సోరణ చేరఁ గోరి యొక సుందరి తొందర మీరఁ బోవుచో
సారెకుఁ బూలమాలికలు జాఱఁగఁ గ్రొమ్ముడి వీడు పెన్నెఱుల్
చేరిచి పట్టెఁ గాని యొక చేతఁ దలంపదు చాన వానిఁ జె
న్నారఁగఁ గ్రమ్మఱ న్ముడువ, నయ్యెడకున్ దనచేరునంతకున్. 57

చ. ననుపుగ బోటి రంజన మొనర్పఁగఁ బట్టు నిజాగ్రపాదమున్
వనిత యొకర్తు లక్కతడి వాయక యుండనె నాఁచికొంచు వేఁ
జనియె నొయారి నెన్నడలచందము డిందఁగ జాలకంబు గ్ర
న్ననఁ దనచేరునంతకుఁ దనర్చుచుఁ ద్రోవకు యావకాంకముల్. 58

క. వలపలి కంటికిఁ గాటుక
దలఁకొని యిడి యది యొదవని దాపలికంటిన్
దలఁపక వేఱొక చెలి యటె
శలాక చేఁ బూని కిటికి సరసకుఁ బఱచెన్. 59

చ. వెలఁదుక యింకొకర్తు నడ వీడిన పోకముడిన్ ఘటింపఁగాఁ
దలఁపక జాలకాంతరగతం బగునట్టి యనన్యదృష్టితో
నిలిచెను భూరికంకణమణిప్రభ పొక్కిలి మిక్కిలిన్ జొఱన్
జెలువుగఁ బాణిపంకజము చేత గ్రహించుచు నంతరీయమున్. 60

చ. పడఁతి యొకర్తు కాంచి సగపా లొగిఁ గూరిచి లేచి వే చనన్
గడుఁ దడవాడు నడ్గడుగునన్ రతనంబులు రాల రాల నా
బిడ బొటవ్రేలి మూలమునఁ బెట్టిన తొల్లిటి దార మొక్కఁడే
యడరెఁ దదీయ మేఖలకు నంతకునున్ దుదిన్ నిల్చియున్నదై. 61

చ. ఘనమదిరాసుగంధభరగర్భితమున్ జలదృష్మిళిందభా
జనమును నైన కౌతుకవశప్రమదారుచిరాననాళిచే





ననువుగఁ బూరితాంతరములై చెలువారెడు భూరిమారుతా
యనములు వొల్చెఁ, బద్మనిచయంబున భూషిత మైనరీతిగాన్. 62

ఉ. ఇందుకలాకలాపుఁ దపు డె త్తగు తోరణవార మూని, బల్
క్రం దగు కేతనాంబరపరంపర రాజిలురాజమార్గమున్
బొందెను, మేలు మాళిగల భూరితరద్యుతి యిన్మడింపఁ బే
ర్మిం దొగ రాజిగుల్, పగలె ద్రిమ్మరఁ బోయుచుఁ దచ్చిరంబులన్. 63

ఉ. ఇన్నెటిఁగాఁగఁ జూడ్కులకు నెల్లను నెక్కటిలక్ష్యమౌ హరున్
గన్నులఁ గ్రోలుచున్ జెలులు గానరు మారు పదార్థ మట్ల యౌ
నన్నుల తక్కు నింద్రియము లన్నిటి వృత్తులు గూడి చేరె నా
కన్నులలోనె తత్తదవిఖండితశక్తివిశేషసంపదన్. 64

ఆ. ఇతని కొఱ కపర్ణ మృదులాంగి యయ్యుఁదాఁ
జేయ రానితపము చేయు టొప్పు
నితనిదాస్య మొందు నతివయె ధన్య నా
నెన్నఁదరమె కురువు నెక్కు కన్య? 65

చ. అతికమనీయరూపవిభవాంచిత మీమిథునంబు లోకసం
స్తుతముగ ధాత యొండొరులతో జత గూర్పక యుండెనేని యి
ట్లతులితకాంతి యీ యిరువురందు ఘటింప నొనర్చినట్టియ
ద్భుత మగు యత్న మెల్లఁ గడుఁ బొల్లునఁ బోవదె యెట్లు చూచినన్.

క. నిక్కం బీతఁడు రోసం
బెక్కి సుమాయుధుని కాయ మేర్పఁడు మరుఁడే
చక్కని యీ జగదొరఁ గని
మిక్కిలిసిగ్గమెయి వీడె మేనుఁ దనంతన్. 67

క. చెలి! తలఁపుల కెల్లగు నీ
బలుదొర చుట్టఱిక మొలసి భాగ్యవశతచే
నిలఁ దాల్పఁ బొడవు గనుతన
తల మన నగరాజు తుంగతరముగ నెత్తున్. 68

మ. ఎలమిన్ వీనుల విందులై తనరఁగా, ని ట్లోషధిప్రస్థపుం
బొలఁతుల్ వల్కెడు సుద్దులన్ వినుచు నాముక్కంటి తాఁజేరె మం
జులకేయూరచయంపు రాపిడులచేఁ జూర్ణంబులౌ లాజము
ష్టుల బల్ వృష్టులఁ బొల్పు మీఱు మిహికాక్షోణీధరాగారమున్. 69

 మ. శరదభ్రంబుననుండి భానుఁడుబలెన్ శంభుం డటన్ గోపురం
దరు బల్వీఁపుననుండి శౌరి చెయియూఁతన్ బూనుచున్ డిగ్గి ముం
దర వాణీశుఁడు త్రోవ సూపుచుఁ జనంగాఁ జొచ్చెఁ దా నల్లనన్
ధరణీభృన్మణిమందిరోత్తమమునన్ గక్ష్యాంతర శ్రేణులన్. 70

చ. అతనికి వెన్క వాసవముఖాఖిలలేఖనికాయమున్ బుర
స్కృతఋషిసప్తకం బగుమునీంద్రసముత్కరమున్ గణంబులున్
క్షితిధరసోము ధామమునఁ జెచ్చెరఁ జొచ్చెను భాసురార్ఘసం
హతి యనపాయమై తగు నుపాయము పాయక చేరు తీరునన్.

చ. అనువుగ శూలి పీఠగతుఁ డై యట, రత్న సమన్వితార్ఘ్యమున్
గొనబుగఁ దేనె గూరిచిన గోదధి నవ్యదుకూలయుగ్మమున్
బొనర యథావిధిన్ శిఖరిముఖ్యుఁడు గూరిమి మీఱఁ దెచ్చి యి
చ్చిన యితరార్థముల్ గొనె నశేషము మంత్రసమేతమై తగన్. 72

చ. సలలితపట్టవస్త్రధరు శంకరుఁ జేర్చిరి పెండ్లికూఁతుచే
యలఁతి కటన్, వినీతు లయి యంతిపురంబున దక్షు లైన వా
రలు; సితఫేనసంచయవిరాజిసరిత్తరుణీమనోహరున్
జెలియలికట్ట చేరువకుఁ జేరుచు చందురుక్రొంజిగుల్ వలెన్ 73

చ. ఎలమిని బెంపు చెందినముఖేందురుచిం దగునావెలంది పొం
దొలసి శివుండు పుల్లనయనోత్పలుఁడున్ విమలోజ్జ్వలన్మన
స్సలిలుఁడు నై చెలంగెఁ గదు; శారదభూరిమనోజ్ఞవేళతో
నెలసి నితాంతకాంతిని రహించెదు లోకము సంచు గాంచుచున్.

గీ. ఎదురుపడునెడ బెదరు చొకింత నిలిచి
మగుడుచుఁ బరస్పరాసక్తిఁ దవిలి యున్న
వారి చూపులు నునుసిగ్గు వలన నపుడె
సెందె సంకోచభావంబు చెన్ను మీఱ. 75

ఉ. గ్రావనికేతనుం డపుడు గైకొనె శైలవతంసుఁ డీయఁగాఁ
జేవుఱు లీను వ్రేళ్ళనయు చేడియ కేల్ నిజభీతి నయ్యుమా
భావిని మేని లోన దనప్రన్నని నెమ్మెయి దాఁచుకొన్న యా
పూవులవింటిదంటతొలుమొల్కను బోలెఁ గరంబు హాళితోన్. 76

క. ఉమకు మెయిఁ బులక లెసఁగెను
జెమ రొదవె వృషాంకునకును జెన్నగు వ్రేళ్లన్

58



సుమశరు చెయిదము సమముగ
నమరఁగ నిరువురకుఁ బరిణయము పంచె ననన్. 77

క. పరిణయ మగుతఱి నెవ్వరి
యరుదా రెడిసన్నిధాన మనుపమశోభా
కర మితర దంపతుల కా
యిరువుర యలనాఁటి సిరి నిఁకేలా తెలుపన్. 78

తే. కదుఁబొడవు గల్గు కీలలఁ గ్రాలు కీలిఁ
జుట్టి వచ్చెదు నలజంట సొగసు మీఱెఁ
బరఁగ నన్యోన్యసంసక్తి వఱలి మేరు
పరిసరంబునఁ దిరుగు రేవగళు లనఁగ. 79

తే. అట మిథఃస్పర్శసుఖమీలితాక్ష మైన
యలయుగళిఁ ద్రిప్పి, ముమ్మరు ననలుచుట్టుఁ
బెండ్లికొమరితచే విడిపించె లాజ
లమర దీప్తార్చి యగు వహ్ని నా పురోధ. 80

చ. అమర గురూపదేశమున నంజలితో వదనంబు సేర్చె నా
రమణి సుగంధయుక్త మయి రాజిలు లాజల ధూమ మద్దియున్
భ్రమద కపోలదేశములఁ బర్వెదు బల్సిగలన్ ముహూర్తమా
త్రము చెవి నల్లగల్వ లయి రాణ వహించెను మించుఁబోణికిన్. 81

మ. చెమ రొక్కింత వహించి కెంపుజిగితోఁ జెన్నారు చెక్కిళ్లయం
దముతోఁ గాటుకకప్పురం గెదయుచున్ దళ్కారు కన్దోయి యం
దముతో మ్లానయవాంకురోజ్జ్వలవరోత్తంసంబుతోఁ బొల్చె రా
జముఖీవక్త్రము లాజధూమచయ మాచారార్థమై గైకొనన్. 82

ఆ. పెండ్లికూఁతుతోడ ద్విజుఁ డనెఁబట్టిరో!
నీ వివాహమునకుఁ బావకుండు
కర్మసాక్షి సలుపు ధర్మువు పతి యైన
చంద్రమౌళితో విచార ముడిగి. 83

ఆ. అనుచు యాజకుం డనిన యానుడి భవాని
చెవులు కనులకొనలఁ జేరఁ జాఁచి
త్రావెఁ గడునిదాఘతాప మొందిన నేల
యాదిమైంద్రవారి నానినట్లు. 84

క. ధ్రువుడు ప్రియదర్శనుఁడు నవు
ధవుఁడు ధ్రువున్ జూడు మన, వదన మెత్తి యనెన్
జవరాలు త్రపాగద్గద
మవు నెలుఁగునఁ గానఁబడె నఁటం చెటొ తుదకున్. 85

క. జ్ఞాతాగముఁడు పురోహితుఁ
డీతీరునఁ బెండ్లి దీర్ప నీప్రజ కెల్లన్
మాతాపితరులు వా ర
భ్జాతాసనుఁ దైనవిధికి సల్పిరి ప్రణతిన్. 86

చ. "కనుము సుమంగలీ! సుతు నఖండపరాక్రమశాలి" నంచు దీ
వన యిడెఁ బెండ్లికూఁతునకు వారిజసంభవుఁ డష్టమూర్తియం
దునఁ దగఁ బేర్కొనం జను మనోరథ మే మని యంచుఁ జింతలో
మునిఁగి విముగ్ధుఁడయ్యెను; విభుం డతఁ డయ్యును బల్కుఁగల్కికిన్.

ఉ. ఆవల నాయుగంబు చతురశ్రమమున్ గుసుమాస్తృతంబు నౌ
పావనవేది చేరి యట భర్మమయాసనమందు నుండి యిం
పావహిలంగఁ బోసికొని రౌదలలం దలఁబ్రాలు; లౌకికం
బై విలసిల్లు వాడుకయు నాదరణీయమె గాన నెందునన్. 88

చ. సలలిత మైన ముత్తెముల జాలరిసొంపు హరింపఁ జాలునం
చలజలబిందుజాలమున జా నయి, యాయతదండమంజిమం
బెలయఁగ నేర్చునాళమున నింపగుతామరసాతపత్రమున్
గలుముల మించుఁబోఁడి యొడికంబుగఁ బట్టెను బెండ్లి జంటకున్

క. అల దంపతులను బొగడెను
బలుకులచెలి యిరుదెఱంగుఁ బలుకులగమిచే;
నలఘువరు నమరవాణిని
వలిమలసుతఁ జులకఁదెలియు వైకృతఫణితిన్. 90

ఉ. ఇంబుగ సంధులన్ వివిధవృత్తులు దేటపడన్ రసానుకూ
లంబుగ రాగముల్ దనర లాలితభంగిఁ జెలంగి యంగహా
రం బెసఁగన్ గరంబు రుచిరం బగునొప్పున నప్సరఃప్రయు
క్తం బగు నాదిరూపకము గాంచి రొకించుక సేపు జంపతుల్. 91

చ. అది ముగియంగ మౌళిఘటితాంజలు లొప్ప నమస్కరించుచున్
త్రిదశులు పెండ్లియై నవసతీయుతుఁ డైన గిరీశు డాసి యిం





పొదవఁగ విన్నవించి రపు డొయ్యన శాపము దీఱి మూర్తితోఁ
బొదలెడు పంచబాణు కొలువుం గృపఁగ్రమ్మఱ సమ్మతింపఁగన్. 92

చ. అపుడు నిరస్తకోపుఁడగునవ్వి భుఁడున్ దయ నిచ్చగించె మ
వ్వపుమరునంపగుంపు పరవన్ దనయందును గూడ నట్లయౌ
నెపుడును గార్యవేత్తలు నిజేశులకున్ దఱిఁ జూచి చేయు వి
న్నపము లభీష్టసిద్ధిని ఘనంబుగఁ గూర్పక రిత్త వోవునే. 93

ఉ. పిమ్మట నిందుమౌళి యలవేలుపుమూఁకల వీడుకొల్పి, మో
దమ్మున గట్టుపట్టి చెయితామర పట్టి సువర్ణపాత్రయు
క్తమ్ము సుమాదిభక్తిలలితమ్మును భూమితలాస్తృతోరుశ
య్యమ్మును నైన కౌతుకగృహమ్మును జేరె సుఖావహమ్ముగన్. 94

పంచచామరము.
నవోఢతాత్రపావిభూషణన్ వరోపనీత మౌ
స్వవక్త్రమున్ మలంచికొంచుఁ బాన్పుబోంట్ల కైన మా
రువల్కకున్నకల్కి నాహరుం డటన్ గణాస్యనూ
త్నవిక్రియాళి నెట్టకేనిఁ దా నగించె లోపలన్. 95

---

పంచచామరము.
సమస్తదేహిసంతతిస్వసామ్యరమ్యభావనా!
యమాత్యవంశపావనా! సమాత్తబంధమోచనా!
భ్రమప్రమాదదుస్తమోనిరాసిబోధలోచనా!
సుమాన్యకూచిమంచిసోమసుందరార్యభూషణా. 3

తే. ఇది యుమాపరిణయం బన నెసఁగు సప్త
మంపుసర్గంబు శ్రీకూచిమంచి సోమ
సుందరకవీంద్రవేంగమానందనాగ్ర్య
సాంబశివకృతాంధ్రకుమారసంభవకృతి. 4

---

శ్రీః

# శ్రీమదాంధ్ర కుమారసంభవము

## అష్టమాశ్వాసము

---

శ్రీవిపులాధరతనయా
జీవితనాథాంఘ్రిపద్మసేవాభిజ్ఞా!
దేవగురుజైత్రబుద్ధివ
చోవిభవసమజ్ఞ! సోమసుందరప్రాజ్ఞా! 1

క. అవధారు కాళిదాస
జ్ఞవరామరసూక్త్యనూక్తిచణనాదగ్రా
హివినూత్నయంత్రదాంధ్ర
ప్రవిమలవాక్తతి సవినతిఁ బైకత వినుతున్. 2

---

తే. పరిణయానంతరము ధరాధరవతంసు
తనయ హరునెడ రతిభావ జనిత కాత
రత వహింపఁగ, దానిచే నతని కొదవె
మదనసందీపనం బగు మంజుసుఖము. 1

క. పలికినను బదులు పలుక, ద
వలికిం జనఁజూచుఁ బ్రియుఁడు పైకొం గొడియన్
జెలి పెడమో మయి శయ్యా
స్థలి నుండు; నటయ్యుఁ బెంచె సదయుని కింపున్. 2





తే. ఈ చెలువ యేమి సేయునో చూచెద నని
మగఁడు నిదురించినట్లుండి నగుచుఁ దన్నుఁ
గన, నెదుర్పడు తనదుచూడ్కిని మొగిడ్చె
వనిత మెఱుమున మిఱుమిట్లు గొనినయట్లు. 3

క. మెలఁతుక తన పొక్కిలికిన్
జెలువుఁడు సెయి దార్ప మానిచెన్ వడఁకుచు, నా
వల వీడెఁ దనంతనె యల
పొలఁతిదుకూలంపుఁబోకముడి కదుదవుగన్. 4

క. "ఈవిధిఁ జెలి! యేకతమున
సేవింపుమ వెఱపు దీఱి శివు" నని చెలువల్
వావిరి దెలిపిన బుద్ధులు
భావిని ప్రియుప్రోల మఱచె వ్యాకులతమెయిన్. 5

తే. అనవసర మైన యర్థంబునందుఁ గూడ
నుబుసుపోకకుఁ బ్రశ్నింప నుత్సహించు
నంగభవజిష్ణు చూడ్కుల నాదరించి
రమణి తలయూపుననె యుత్తరము నొసంగె. 6

తే. చేలఁ దొలఁగించుహరు కనుల్ కేలుదోయి
నతివ మూయఁగ నతఁ డలికాక్షిఁ జూడ,
తన జతన మిట్లు విత యైన వనజనయన
యేమియును దోఁచ కుండెఁ దా నేకతమున. 7

ఉ. ముద్దిడ మోవి యొగ్గ దతిమోహము గాటపుఁగౌఁగిలింతలన్
దద్దయు హస్తయుగ్మము గదల్పదు, చేఁతకు మారుచేఁత దా
నెద్దియుఁ జేయ, దట్లు త్రప యేడ్తెఱచే మరుమించు కుంచినన్
ముద్దియ తొంటికూటమి విభున్ బ్రమదాంబుధి నోలలారిచెన్. 8

క. పలుకెంపులు కెమ్మోవికిఁ
గలుగని ముఖచుంబనమును గాయపుగుఱుతుల్
గొలుపని నఖరదముల చేఁ
దలుఁగల మృదురతికె గాని తాళద నవలా. 9

క. రాతిరి నడిచిన చర్య వి
భాతమునం దడుగ వచ్చు ప్రాణసఖులకున్

గౌతుక ముడుపదు సిగ్గునఁ
జేతోగతిఁ ద్వరిత యయ్యెఁ జెలి వర్ణింపన్. 10

తే. అద్దమందున సురతంపుటానవాళ్లు
గాంచుచు లతాంగి తనవెన్కఁ బొంచియున్న
ప్రియుని నీడను దన నీడ వెనుకఁ జూచి
సిగ్గున నొనర్చె నేమేమొ చెయిదములను. 11

క. శితికంఠభుక్తయౌవన
నతులితసుతఁ జూచి జనని యాద దొఱంగెన్
బతిమన్నన గన్న సుతా
మతల్లి గద మాన్పు తల్లి మది యుమ్మలికన్. 12

క. ఎట్టెటొ కొన్నాళ్ళుడుగున్
బెట్టించె రతిన్ హరుండు ప్రియచే; నటపై
గట్టుసుతకు సురతపుఁజవి
బుట్టిన మెలమెల్ల రతివిముఖత యోసరిలెన్. 13

ఆ. కవుఁగిలించు బిగ్గఁ గౌఁగిలింపఁగఁ జెల్వఁ
డతఁడు వేఁడ మోము నవల సేయ
దరితి రశనపొత్తు నభిలషించెడు వరు
కరము నాఁగు వదులుగా లతాంగి. 14

చ. అమరఁగఁ జెయ్వులం దెలియునట్టిది విప్రియ మన్నమాట లే
శమును నెఱుంగనట్టిదియుఁ జాటువచోరుచిరంబునున్, నిమే
షము నెడఁబా టనన్ వెఱ పెసంగెనడునట్టిదియున్ బరస్పరా
ర్థము నగుప్రేమ నాటె నలదంపతులందుఁ గొలందినాళ్ళకే. 15

చ. కులగిరి రాజకన్య తనకుం దగునావరునందు నెట్లు రా
గిలె నటె శంకరుండు నల కీరమనోహరవాణియందునున్
వలనుగ మేలుదాలిచె నపాంపతిఁ దప్పునె జహ్నుకన్యకా
జలరుహనేత్ర? తన్ముఖరసంబునఁ గా కతఁడున్ సుఖించునే? 16

క. సురతకళాగురుఁడగునా
హరుచే నేకాంతశిష్యురాలయి, యుమ యే
తరుణులచదురుం గఱచెను
గురుకుచ దా నదె యొనర్చె గురుదక్షిణగాన్. 17





క. కరకిసలయములు వేదనఁ
గరము విదల్పఁగఁ, బ్రియుండు గఱచి విడుచు వా
తెఱనోవు మాన్పుకొనె బి
త్తరి చలువలు చిలుకు చెలువుతలనెలతునుకన్. 18

క. కలికిత ముద్దిడుతఱి నల
కలచూర్ణపునలక లురులఁగా, మెఱఁగెడున
య్యలికాక్షి నిలిపె శంభుఁడు
జలజంబుల వలపు లొలకు సతియా ర్పొలయన్. 19

క. ఈవిధి నింద్రియసుఖ మగు
త్రోవన్ జేకొని, సుమాయుధుని దయఁ గనుచున్
గ్రావేందునింట నొకనెల
భావజరిపుఁ డుండె, హైమవతితోఁ గూడన్. 20

చ. అనుఁగుఁగొమార్తెతోడి విరహంబునకున్ మది సైఁప లేక వే
దన పడునా కులాచలవతంసున కెట్టులొ యొప్పఁజెప్పి దా
ననితరసామ్యయానవిభవాంచితభద్రతురుంగుఁ డై స్వయం
జని యగునమ్మహామహుఁడు సల్పె విహారము, లచ్చటచ్చటన్. 21

చ. అనిలజవాఢ్య మైనయలయానము నెక్కి మహానటుండు దాఁ
గనకనగంబు చేరి యటఁ గగ్రమహిరణ్మయపల్ల వాంశక
ల్పనయుతతల్పమందు హిమవత్కులశైలకుమారికాఘన
స్తనపరిరంభపూర్వసుఖతత్పరతన్ గడపె న్నిశీథిని న్. 22

చ. హరికరకంకణాంకితశిలావళి బల్ దళుకొత్తఁ గ్రొత్తగా
దొరసినవేల్పుటోగిరపుఁదుంపరగుంపున నింపు వెంచు సుం
దరతరమంద రాచలనితంబములన్ నివసించెఁ బ్రేయసీ
సరసముఖాంబుజాతమధుషట్పద మావిధుమౌళి హాళితో. 23

చ. అల యళినీలకుంతల దశాస్యనిశాచరసింహగర్జచే
నులికి స్వకీయకోమలభుజోజ్జ్వలబంధము కంధరంబునన్
వెలయఁగఁ జేయఁ దా ననుభవించె జగజ్జనకుండు శూలి య
ర్మిలిచెలి కిన్నరేంద్రుగిరి నచ్చపుమెచ్చగు పండువెన్నెలల్. 24

ఉ. కోమలచందనాగముల కొమ్మల నూఁచి, లవంగ కేసర
స్తోమము మోచి, మారుతకిశోరుఁడు శంభుననుంగుటాలికిన్

గామునిసామునన్ గలుగుగాసిని బాచెc, బ్రియోక్తిరీతిగా
నామహితుం డొకప్డు మలయాచలసీమ రమించు చున్నచో. 25

ఉ. మేలిమితామరన్ బ్రియుని మేలముకై ప్రహరింప, నాతcడున్
గేల జలంబు గైకొనుచుc గేరుచు మీcదికిc జల్లc గన్గవన్
బాలిక మూయుచున్ జలిపె మంజుగతిన్ జలకేళి; వేలుపుం
జాలువ మీలచాల తనసప్తకికిం దుగపేట గూర్పcగాన్. 26

చ. చెలువకు బేసికంటి కయిసేసె సురేంద్రపురంధ్రికుంతలా
వళి కగుపారిజాతవరపాదపజాతలతాంతసంతతిన్
జెలు వగునందనోపవనసీమc గడుం దడవార వేలుపుం
దలిరులబోండ్లు తన్ గని మనంబుల నువ్విళు లూర సారెకున్. 27

ఆ. ఇంతితోడ నిట్టు లిలయందు దివియందు
కలసుఖంబు లెల్లc గాంచి గాంచి;
యెండ యెట్టిc బారునెడ నొకానొకనాcడు
హరుcడు గంధమాదనాద్రి కరిగె. 28

ఉ. అం దపరంజిజానెలవులందు వసించుచు నిందుమౌళి క
న్విం దయి కానిపిచు నరవిందసఖుం దిలకించి, డాబుజం
బుం దగ నూcత చేసికొనుముద్దియ నా సహధర్మచారణిన్
జందనగంధి మేచకకచన్ గని యిట్లనుcగూర్మి హెచ్చcగన్. 29

ఉ. కెందలిరాకుcబోcడి! నునుcగెంజిగు లొల్కు తృతీయభాగముల్
చెందిననీకనుంగవc గుశేశయమంజిమc జేర్చి నంచు నె
న్నం దగుచున్ దినేశుcడు దినంబు నిదే సమయంగc జేసె బెం
పందినవిశ్వమున్ విలయమందు హరించువిరించిసంచునన్. 30

ఉ. వ్రాలెదు హేళి నైజకరవర్గము సంగతిc బాతజాతకీ
లాలకణోత్కరంబునకు లావతి దూరము సేయ, శ్రీసము
ద్వేలమహేంద్రచాపపరివేషములన్ విడనాడెc జూడుమా
బాలరొ! నిన్నుcగన్నతని ప్రన్ననియీసెలయేటికూటువుల్. 31

ఉ. సారసకేసరం బొకటి సాము మెసంగి తొఅంగి యార్చుచున్
సారెకు నొక్క టొక్కటిc గనన్ గుతుకల్ మఱలించు చివ్వగన్
దారుణదైవతంత్రనిహతం బగుజక్కవదోయి కించు కౌ
దూరము తోర మయ్యెదును దొయ్యలి! తోయరుహాకరంబునన్. 32





చ. గొనబగు నందుగుంజిగురుcగొమ్మలప్రయ్యలc గమ్మతావి నొ
ప్పిన పగలింటియిక్కలను వీడి కరుల్ రవి తూర్పునందుc దోc
చినయది యాదిగాc దమభుజించిన మేcతకుc జాలునట్లు గా
వనరుహలగ్నభృంగ మగువారి గ్రహించెదు నొక్కసారిగా. 33

గీ. పశ్చిమదిగంతమున వ్రేలు భానుcడు దన
కరము నిడుపారునీడచే సరసినీటి
కుదిరిబంగరుటనకట్ట యొనరిచె నన
వెలిcగెడును జూచితే లెక్కపలుకులాcడి. 34

చ. పలుమఱు లోcతురొంపి గల పల్వల మెల్లc గలంత వెట్టి, బి
ట్టలమినయట్టి యెండ యుడు కాఱ, తటంబులు సేరెc గాcటియే
కలములమూcక నేలు గమికాం డ్రగుకొమ్ములపందు లిందు; వం
క లగు బిసాంకురంబులు ముఖంబులc దాల్చువితానc బొల్చుచున్.

చ. ధరణిరుహాగ్రభాగమునc దావల మైనశిఖావలంబు బం
గరుజలపోతకెంపుజిగిc గ్రాలెడువిచ్చుపురిన్ ధరించుచున్
బరcగ దినాంతిమాతపము పాన మొనర్చెదునట్లు తోcచెడిన్
గరికరసుందరోరువర! గా కది యేల తఱుంగుc గ్రచ్చుఱన్? 36

ఆ. పంక మొక్కవంక బయ లయ్యె నన నిరు
లింద్రు దెస నెసంగె నెండవీటి
వేవెలుcగు హరింప, వి న్నొ కించుక దక్క
వట్టినట్టి కొలcకు వడుపు దాల్చె. 37

చ. రమణిరొ! యాకుటిండ్ల యజిరంబుల నెక్కొనులేళ్లతోడ మూ
లములc దడాఱ కుండcగ జలంబులు వోసిన లేcతచెట్లతో
నమర సముజ్జ్వలంబు లగునగ్నులతో వెసc జొచ్చు హోమధే
నుమణులతోడc బొల్చెదు; ననూనరుచిం గని యీ తపోవనుల్.

క. ముకుళించుచు నించుక మూ
యక దలవాcకిలి నిమేష మబ్జ మునిచె మ
న్కికిc దావు తడవు మధుపము
నకుc జోటు నొసంగc దలcచినదియుం బోలెన్. 39

ఆ. కరము జాతి, కొలcదిగా నున్న రుచులతో
నెనసి యెట్టవాఱునినునిc దాల్చి

మంచియకరు లొలయు మంకెనపూబొట్టు
దాల్చుకన్నె యనఁగఁ దగెఁ బ్రతీచి. 40

చ. వెలుఁగుల వేఁడిఁగ్రోలుచును, వెన్కొని వచ్చెదువాలఖిల్యము
ఖ్యులు రథవాజిహర్ష మొనఁగూర్చునెలుంగుల సామగానముల్
సలుపుచు వేయుదోయముల సన్నుతి సేయుచు నున్నవా రిదే
మలయజగంధి! పావక సమర్పితభాను సహస్రభానునిన్. 41

చ. సురపథవీథినుండి దిగుచోఁ గడువంగినకంఠపంక్తితోఁ,
గరమును వాలి కన్గవలఁగప్పెడువీనులచామరాళితో
బరు వగుకాడి జాతీ కడువంగిన కేసరరాజితో హరుల్
పరు గిడ నత్తమిల్లె నిదె భానుఁ డహంబును దాఁచు చంబుధిన్.

ఆ. విన్ను నిదురఁ జెందువిత మయ్యె రవి వాయ,
నెచ్చు తేజమునకు నిదియె రీతి;
యొదవి తెలివి గొలుపు నది యెంత కంతకు
నగును మాపునకె తదస్తమయము. 43

చ. చరమశిలోచ్చయాగ్రతలశాయినియై జనవంద్యయౌ దివా
కరవరమూర్తి వెంబడినె గ్రక్కున సంధ్యయు నేగె నట్లు ము
న్నరుణమయూఖుచేత నుదయావసరమ్మున నిమ్ముగాఁ బుర
స్కరణము గాంచి వాని వెనుకం జన జంకునె యిమ్ము దప్పినన్? 44

ఆ. కుటిలకచ! మొగిల్లకొన లివె తులకించెఁ
బసపు నెఱుపు బూదె వన్నె లెనసి
కాంతు వీ వ టంచుఁ గడసంజ కుంచియ
గొంచు, రంగు దీర్చె నం చనంగ. 45

క. మృగరాజకేసరములకుఁ,
జిగురుంజొంపముల నీనుచెట్లకు, ధాతు
స్థగితనిజశృంగములకును
నగపతి యీ రెండ పంచె నాఁ దగెఁ గంటే? 46

చ. ధరణినిఁ బార్ష్ణిభాగములఁ దాఁకక నిల్చి విధిజ్ఞు లైన యీ
పరమతపోధనాగ్రణులు పావనవారి నొసంగి యర్ఘ్యముల్
వరుణునిదిక్కు మో మగుచు బ్రహ్మజపంబు నుపాంశువృత్తి సా
దరముగ సల్పువారు ప్రయతత్వము గోరి సరోరుహననా! 47





ఉ. కావున నాకు నొక్కత్రుటికాల మనుజ్ఞ యొసంగ నీ కగున్
బావనసాంధ్య కాలనియమక్రమనిర్వహణార్థ మీ యెడన్
వావిరి నింతలోన శుకవాణిరో! యిష్టవినోదకల్పనా
కోవిద లైననీచెలులు గూర్తురు పోఁడిగ నీకు వేడుకల్. 48

ఆ. పెదవి విఱిచికొంచు విభుమాట వినిపించు
కొనక కొండతేనియనుఁగుఁబట్టి
యంచ నున్నవిజయ నామతించి వచింపఁ
గడఁగె దానితో నకారణముగ. 49

క. దివసావసానసముచిత
మవుకృత్యము మంత్రయుక్త మైతగ శివుఁడున్
సవరించి యలుకఁ బలుకని
శివఁ గ్రమ్మఱఁ జేరి వలికెఁ జిఱున వ్వొలయన్. 50

ఉ. ఊరక కోపగించుకొనునుగ్మలి! మానము మాను సంధ్యకున్
గౌరవ మొప్ప మ్రొక్కితిని గాని మ తొక్కటి గా దెఱుంగవే
వారిరుహాయతాక్షి! యనపాయభవత్సహధర్మచారితా
చారవిధారథాంగనభసంగమసన్నిభశీలశాలి నన్? 51

ఉ. ఏతను వూఢ్చె మున్ను పితృసృష్టి యొనర్చినవెన్క ధాతతా
నాతనువున్ విధిజ్ఞు లుదయాస్తమయావసరంబులందు వి
ఖ్యాతముగా భజింతు రది గావున నిచ్చలు నాకు గౌరవ
శ్రీ తనరారు సంధ్యయెడఁ జిత్తమునన్ జగదేకసుందరీ! 52

ఉ. క్రమ్ము తమోభరమ్ముపెనురాయిడి నీయెడ, నేలనూఁదు చం
దమ్ము వహించు సంధ్యను ఘనాఘనవేణిరో! దీనిఁ జూడుమా
యిమ్ముగ నొక్క తీరమున నెంతయు సాంద్రముగాఁ దమాలసా
లమ్ములచాలు దాల్చుచుఁ జెలంగెడు ధాతురసంపుఁజాలు నాన్. 53

చ. సురిగి కొలందిగా మిగిలి శోభిలు నెట్టని సందె యెండతోఁ
బరఁగుచుఁ బశ్చిమాశ కడు భాసిలె నెత్తుట జొత్తు దాల్చుచు
ర్వరపయి నడ్డవాటముగఁ బాతము చెందిన హేతితోఁ బరి
స్ఫురణ వహించుసంగరవసుంధర సంచు ధరించు మించుతోన్.

ఆ. రేయుఁ బవలుఁ గలియునాయెడ నడరెడు
వెలుఁగువేల్పుగట్టు వెనుక మఱుఁగఁ

గడcగి వాలుcగంటి కటిక చీcకటి యిదె
యెదురు లేక పొదలె నెల్లదెసల. 55

తే. క్రిందికిని మీదిcకిని వెన్క ముందలకును
ప్రక్కలకు నేని జూడ్కి పర్వదు రవంత
గ్రమ్మc దనుc జిమ్మచీcకటి దిమ్ముమావి
జగము నిశిc గ్రాలె గర్భవాసమునcబోలె. 56

క. కలుషము విమలముc దిరమున్
జలితము కుటిలంబు ఋజువు సకలము నొకరూ
పొలయించెc దమము కాల్పనె
తులువలసిరి, గుణవివేకదూరము గాదే? 57

ఉ. ఒత్తగునైశసంతమస మొయ్యనc జోపcగ వచ్చుచున్నవాc
డిత్తఱి యాయజూకవిభుc డిందుcడు తప్పక చూడుమా! నిలిం
పోత్తమదిఙ్ముఖం బిదె సముజ్జ్వలకాంతిరమానిశాంతమై
పుత్తడిబొమ్మ! క్రొమ్మొగలిపుప్పొడిcగప్పినయొప్పు దాల్చెడున్. 58

ఉ. మందర ధారుణీధరముమాటున నెక్కొనుమండలంబుతో
జం దగునిందుచేc గర మెసంగెను జుక్కలతోడిరేయి నేc
బొందుగ మీర లాడుకొనుముచ్చటలన్ వినc వెన్కc బొంచcగాc
గ్రందుగc జుట్టుకొన్న చెలికత్తెలపొత్తున నుండునీవలెన్. 59

చ. తలcపcగ నాదినాంతము నితాంతమునున్ వెలిcగ్రక్క రాని రే
పొలcతుకతేనిబింబ మనుభూరిరహస్యము మున్నలంతివె
న్నెల యెలనవ్వుగానcబడ నిర్జరరాజదిశాశశాంకమం
జులముఖి బైటc బెట్టెc దనుc జోదన సేయc ద్రియామ యల్లనన్.

చ. అతివరొ! చూడు పండిన ప్రియంగుఫలంబువలెన్, వరారుణ
ద్యుతి నలరారుకైరవహితుండు నభఃస్థితమున్ సరోజిబింబ
బితమును నైనబింబ మనుబింబమునుం గల తీవి దవ్వులన్
జత నెడcబాయుజక్కవలజంటను బోలెడిలీలc దాలిచెన్. 61

గీ. అలcతియవపైరునునుసూది మొలకలగమి
కరణి నొప్పారుకోమలాంకురము లెనయు
నెలరుచుల నీనుcబువ్వుల నీ కొనర్పc
బొదివి కొనగోటిగిల్లులc జిదుమ వచ్చు. 62



క. కురులగమి వ్రేళ్ళచేcబలెc
గరములచే నిరుల నొడిసి, కదు మొగిచిన తా
మరకనులతోc దనరు శ
ర్వరి మోమును ముద్దు గొనెదురహి నెల యలరెన్. 63

చ. గిరికుల రాజకన్య! పరికింపు నవామృతరుఙ్మరీచికో
త్కరములచేc దమిస్రము విఖండిత మై సగcబాలు వ్రీలు సం
బరము రహించెc, గేళి కయి వన్యగజంబు గలంచి వీడినన్
మరలc బ్రసన్నతన్ గనెడు మానసదివ్యసరోవరం బనన్. 64

గీ. ముందు గల రాగము దొలంగc జందమామ
మండలం బిదె కరము నిర్మలత నొందెc;
గాలదోషవశంబునc గలిగినట్టి
వికృతి నిలుచునె నిర్మలప్రకృతులందు? 65

గీ. నిలిచె వెన్నెల యున్నతి గలుగుపట్ల?
నైశతమ మొప్పె నైచ్యంబు నునుచుచోట్ల
సత్యముగc మేలుcగీళ్లకు జలజభవుcడు
వాని వానికిc దగు గతుల్ తానె సేసె. 66

చ. కలువలతేని వెల్లులను గల్గుచు, జాల్కొను చంద్రమశ్శిలా
జలకణపఙ్క్తిచేత గిరిచంద్రుc డవేళనె మేలుకొల్పెడున్
నెలcతరొ! నెత్తపుందరుల నిద్దుర చెందుచునున్నయాశిఖా
వళముల నెల్ల నుల్లమున వర్షభయంబు జనింపcజేయుచున్. 67

మ. అవుc గాదంచన రాని యందములయిక్కా! మున్గనుంగొంటె యా
దివిజాతావనిజాతజాతశిఖలన్ దీపించుక్రొమ్మించులన్
దొవవిం దందము సెందె; నీతరువులందున్ వ్రేలు ముక్తాఫలో
జ్జ్వలహారావళులన్ గణింప మదిc గాంక్షం బూను చున్నాcడనన్.

చ. ధరమున మిఱ్ఱువల్లములు దద్దయుc గల్గుటcజేసి యిర్లతో
బెరసి రహించునీ యరిదివెన్నెల చెన్నలరారె నెంతయున్
బరcగcగc బెక్కుతోయముల వ్రాcతలతోcగర మొప్పcగా మద
ద్విరదము మేన బల్చెలువు పెంపcగc బూసినభూతిరీతిగన్. 69

ఉ. భూరితరాశc జేసి యెగcబోయుచుc ద్రావినచారుచంద్రికా
కారరసంబుదాల్పc దనగర్భమునం దెడ లేక నిక్క మీ

కైరవ మంబుజాననరొ! గన్గొనుమా మదచంచరీకఝం
కారముచేత గ్రంథిలుచుఁ గ్రచ్చఱ ముచ్చిక కంట విచ్చెడున్. 70

చ. సురధరణీరుహంబునను సొంపుగ వ్రేలెడి యీవినిర్మలాం
బరవరముం గనుంగొనుము మానిని! యచ్చపుఁబండువెన్నెలన్
బెరయుటఁజేసి యాకృతివివేకము దుష్కర మయ్యు నియ్యెడన్
గరువలి వీనఁబట్టి తిరుగంబడి యాడుచు రూప మేర్పడెన్. 71

ఆ. తరులక్రింద నురులువిరులట్లు మిహిఁ దాల్ప
దళచయంపురాపు లొలసి తునియు
నిందుకాంతిపరియ లివి వ్రేళ్ళఁ బయి కెత్తి
ముడువ వచ్చు నీదు ముంగురులను. 72

చ. సరసిజసన్నిభాననరొ! చాల వడంకెడు మండలంబుతో
హరు వగు నిత్యతార నమృతాంశుఁ డిదే కదియంగ నేగెడున్;
సరసదరాతికంపితలసన్మృదుగాత్రలతామనోజ్ఞతన్
బరఁగెడుక్రొత్తపెండిలికొమార్తెను బెండ్లికొమారుఁడుం బలెన్. 73

చ. నెఱియం బండిన తెల్లు కాండముల వన్నెన్ దెల్పి నల్వారుచుం
దెలఁగొప్పన్ బ్రతిబింబడంబరమునన్ దీపించు నీ చెక్కులం
దొఱ పార న్నునుమొల్క లెత్తె నన నుద్యోతించు రేయెండ యే
డ్తెఱ వీక్షింపుమ చంద్రమండలసముద్వీక్షావిలోలేక్షణా! 74

ఆ. కెంపులొలుకువిన్ను గెంపురాఁబనఁటిలోఁ,
బెట్టు చెట్ల మదిరఁ బట్టికొంచుఁ
గవిసె గంధమాదనవనదేవత యిట,
కీవు వచ్చుటెఱిఁగి యిదె తనంత. 75

ఆ. పుట్టుమంపుఁగెంపు దొట్టిన కనులతోఁ,
బచ్చి పొగడపూల వలపుఁగలుము
లెలయు నీదు వదన మెనసి కాదంబరి,
యేమిగుణము దెచ్చునిఁకనొ యనుచు. 76

క. “ఐనఁ జెలు ల్మన్ననఁ గై,
కోనర్హలు దీనిఁగొనుము గొల్పును బావి
ల్కాని నిది” యనుచు నేర్పున,
నానించె సుర న్గిరీశుఁ డగసుత చేతన్. 77





క. ఆన నది నగజ కైనది,
మానయ్యె వికారమయ్యు మాకందతకు
న్మానితదురూహ్యదైవవి,
ధానజ మగు తేనెమావితనమున కెనయై. 78

క. ఎడపుచు బిడియము దార్చుచుఁ,
బదుకకుఁదమిరేఁచునట్టిపతియన సురఁగ
ల్గెడు కైపనఁ; దగుదోయికిఁ,
గడువడినా పడఁతిమిన్న కైవసమయ్యెన్. 79

గీ. వడిగఁ దిరుగుఁడువడుకనుల్ దడఁబడియెడు
నుడులు జెమ్మటనీటిచిన్కులు నహేతు
కపునవుల్ గల మగువ మొగమ్ము ప్రియుఁడు
మోమునవె గాదు గ్రోలెఁ జూపులనె చిరము. 80

శా. ప్రాంచత్కాంచనకాంచి వ్రేలఁగ నితంబస్ఫారభారంబుచేఁ
గించి త్తేనియు నెత్తరాని చెలి రక్తిన్ శంకరుం దెత్తి గై
కొంచుం జొచ్చెఁ దలంచినం దనకుఁ గొంగుంబంగరై యుండునా
మించుంగల్మిజనించుమానికపురామేడన్గడు న్వేడుకన్. 81

తే. అందు నల్వహుమా తెల్వి నలరువల్వ
క ప్పెనసి గాంగసైకతకాంతిఁ జెనయు
శయ్యఁ బవళించె నుమతోడ శంభుఁ దమృత
కరుఁడు రోహిణితో శరద్ఘనమున బలె. 82

ఉ. అక్కటికంబు దక్కి తివియంగఁ గురుల్ హరు మౌళిఁగ్రాల లేఁ
జుక్కలతేఁడు వాడి చనఁ, జొప్పడ హద్దు దొఱంగి గోళ్ళక్రొ
న్నొక్కులు మచ్చరంబులును నూల్కొనఁగా, గమరు ల్తమంతనే
గ్రక్కున వీడఁగా వఱలుగౌరి రతిం దనియందు శూలి దాన్. 83

తే. అనుఁగుటా లోప దిఁక నంచు నచ్చపుఁగని
కరముననె శూలి దారానికరము లుడుగు
నెడఁ దనదువెడఁదయెడఁద నప్పడఁతి కిడుదుఁ
జూడ్కులను మోడ్పుఁ బొందింప వేడ్కఁ బూనె. 84

ఉ. ఆ కవివర్ణనీయుఁడు నయంబుగ హేమమయాంబుజాకరా
నీకముతో సకాలముగ నిద్దుర మేల్కనెఁ గిన్నరోత్తముల్

వేకువఁ గైశికాఖ్య మగువిశ్రుతరాగము మూర్ఛనాగతిం
జేకొని పాడుచు న్వినికి సేయఁగ మంగళగీతజాతముల్. 85

తే. కొలిచె నాజంట వారు కౌఁగిళులు క్షణము
సడలిచినయెడ మానససరసికిఁ దరఁ
గల నెఱపి, తమ్మివిప్పులఁ దెలియఁజెప్పు
గంధమాదనవనసదాగతిశిశువులు. 86

ఉ. ఆ రసికావతంసు కను లారమణీరుచిరోరుమూలల
గ్నోరునఖాంకపంక్తు లపు డొయ్య హరింప నతండు సెచ్చెరన్
వారణఁ జేసె వాయుహతిఁ బాసినపట్టము పూని క్రమ్మఱన్
గూరుప నంగవించు తన కూరిమి తొయ్యలి చెయ్యి వట్టుచున్. 87

చ. అరిదిగ నిద్ర లేమి నెఱు పారుకనుల్ పలుగంట్లు లోఁతుగాఁ
బొరసిన మోవియున్ జెదురుముంగురులున్ గరము న్విమృష్టమై
పరఁగెడుబొట్టునుం గలిగి భాసిలుప్రేముడి లేమమోముఁజం
దురుఁ గన మున్నె రాగి యగు ధూర్జటికిం దమి హెచ్చెఁగ్రమ్మఱన్.

చ. కదుఁ జదనాఱఁ జాళ్ళువడుకప్పుదుదుప్పటియొప్పిదంబుతో
నడిమికిఁబ్రోగు గూడఁగ గుణంబు తునింగిన కాంచిసంచుతో
నడుగుబెడంగుఁదామరలయావకపుం గుఱిచాలుమేలుతో
నొడు పగుపాన్పు వీడ నతఁ డొల్లఁడ తెల్లగఁ దెల్లవాఱినన్. 89

తే. మిక్కుటం బగు రహి నించు మక్కువసతి
మోవితేనె యహర్నిశంబును భజించు
వేడుక మునింగి విజయ దెల్పినను దర్శ
నార్థులకు దర్శనం బీయఁ డాయె నతఁడు. 90

---

ఉత్సాహ.

ఎడలె నూఱు నందు సామఋతువు లొక్క రేవలెన్
బడఁతిపై సరాసరిన్ దివానిశానుషంగుఁడై
యదరు మృదుని కైనఁ దనియఁ డతఁడు దాన నబ్ధిఁగ్రా
లెడి మహాగ్ని తనివి సనని లీలఁ దద్రసర్థులన్. 91

---





పంచచామరము.

భవాంఘ్రిసారసార్పితాత్మపాణినేత్రనీరజా!
స్వవాక్సుధారసప్రశాంతసాధుశిష్యధీరుజా!
అవంధ్యబోధభానుభానిరస్తహృత్తమోరజా!
పవిత్రకూచిమంచివంశవార్ధిపూర్ణిమాత్రిజా! 3

తే. ఇది యెనిమిదవ సర్గ, ముమేందుధరస
మాగమమనోహరము కూచిమంచిసోమ
సుందరకవీంద్రవేంగమానందనాగ్ర్య
సాంబశివకృతాంధ్రకుమారసంభవకృతి. 4

---

శ్రీః

# శ్రీమదాంధ్ర కుమార సంభవము

## నవమాశ్వాసము

---

కం॥ శ్రీకంఠచరణభక్త! క్షు
ధాకులితాతిథికులానిశార్పితభుక్తా!
ప్రాకటతత్త్వవిచారా
స్తోకామృతభోక్త! సోమసుందరవక్తా! 1

ఆ॥వె॥ తజ్జ్ఞమల్లినాథదశశతకరకృత
వ్యాకృతిప్రకాశవర్జితసుర
వాగ్వనాంతరమున బాట సీతారామ
కృతిశశాంకవివృతిఘృణి నరయుచు. 2

కం॥ వివరింతు నవధరింపుమ
యవలి కతఁ గుమారసంభవామరవాక్కా
ద్యవియద్గందాకుల్యా
భవదమలాంధ్రోక్తియుక్తిఁ ద్వత్పదభక్తిన్. 3

---

కం॥ ఆ లీలఁ గుసుమశరరస
లాలసతఁ బ్రియాస్యనవజలజమధుపంబౌ
శూలి గనె నొక కపోతము
హేళిం గేళీనికేతనాంతరముసొఱన్.
పాఠాంతరము. 1





కం॥ ఆ లలిఁ బ్రియాననాంబుజ
రోలంబం బైన శంకరుఁడు స్మరలీలా
వేళఁ గనె నొక కపోతము
హేళిం గేళీగృహాంతరాళము చొఱఁగన్. 1

ఆ.వె. మగువ మిన్న మంజుమణితంబు మఱపించు
నెలుఁగు లిడుచుఁ ద్రిప్పు చెల్లి కన్ను
లెసఁగఁ గుతుక సాఁచి యెత్తి వంచుచు సొరు
మించు తోఁక సారెఁ గుంచు దాని. 2

తే.గీ. తగ విశృంఖల పక్షతి యుగలి గలిగి
నలి ముదముఁ జేసి రహిఁ గుల్కు నడల నదరి
జటిలచరణాగ్రమయి శశిచ్ఛాయఁ బొలిచి
వలయగతులను నిందందు మలయు దాని. 3

కం॥ రతి తోడ నోలలాడుచు
రతిపతి కలఁచెడు సుధాసరసి నుండి నవో
ద్గత మగు డిండీరతతికి
జత యగు దానిఁ గని క్షణము శశిధరుఁ దలరెన్. 4

కం॥ అనుపమతద్దివ్యాకృతిఁ
గని సర్వాత్ముండు కపటఖగ మగు ననలుం
డని యెంచి నిశ్చయించుచుఁ
బెనుగినుకన్ బొమలు ముడిచి బెట్టిదుఁ డగుడున్. 5

కం॥ ఆ వెనుక స్వస్వరూపము
పావకుఁడు ధరించి భీతి వడఁకుచు నిమ్మై
భావభవారికి విశదము
గా వాకొనెఁ గంప్రపాణి ఘటితాంజలియై. 6

సీ॥ ఈ వొక్కఁ డొడయఁడ వీలోకములకెల్లఁ
బాపు దాపదలు దేవతల కీవ
గాన మహాదేవ! దానవేశ్వరులచేఁ
బడిన నిర్జరులు నిన్ భక్తిఁ గొల్తు
రట్టి నీ వనుఁగుటిల్లాలిబాళికి దక్కి
యేకతమున రతాదృతి వసింతు

ఋతుశతం బేగెఁ ద్వద్వీక్షానవాప్తి దై
న్యము నొందె సురలతో హరిహయుండు

తే.గీ. పరమ! భవదీయసేవావసరనిరీక్ష
కులు బలారాతిముఖరు లఖిలవిబుధులు
వేఁడ వచ్చితి నిటు నిను వెదుక నెంచి
సమయ సముచిత విహగరూపము ధరించి. 7-8-9

కం॥ కావున నీయర్థము నీ
భావమునఁ దలంచి కావ వలె మా తప్పుల్
దేవా! జాలము నోరుతు
రే? విమతవిమాననార్తు లీశరణార్థుల్. 10

కం॥ దేవ! దయఁ గను నిజాత్మజు
వేవేగ సృజింపు మతనిఁ బృతనాధిపతిన్.
గావించి వజ్రి త్రిదివ
శ్రీవిభుఁడై నీదు కరుణఁ ద్రిజగము లేలున్. 11

కం॥ అల జాతవేదుఁ డర్థము
బలకొన వాకొనిన విన్నపము విని నెలదా
ల్పలరె నలరించుఁగద! దొర
వల నెఱిఁగిన మాటకార్ల వాటపుఁ బలుకుల్. 12

ఆ.వె. మారవైరి శాంతమానసుఁడై యించు
కాత్మలో భవిష్యదర్థ మెంచెఁ
దారకుని జయింప స్వారాజు మొన గెల్పు
గొన నయింప నోపు తనయు జనికి. 13

తే.గీ. ఊర్ధ్వరేతస్కుఁ డనలాక్షుఁ డొగి హిరణ్య
రేతు నందుంచెఁ గల్పాంతవీతిహోత్రుఁ
బోలె దుర్విషహంబు నమోఘతమము
నగు రతాంతచ్యుతాత్మతేజోఽంశభరము. 14

కం॥ అనలాక్షవీర్యభరభృతి
ననలుని ముకురామలాంగ మత్యుష్ణశ్వా
సనితాంతక్లాంతాంతర
మును నత్యంతము వివర్ణమును నయ్యె నటన్. 15





కం॥ సురతసుఖభంగరుష నీ
శ్వరి దహను శపించె సర్వభక్షకుఁడవు భీ
కరకృతి విధూమగర్భుఁడ
వురుకుష్ఠవిలుఁడ వగుమ హుతవహ! యనుచున్. 16

తే.గీ. దక్షుశాపంబుచేతఁ బ్రాప్తక్షయుఁడగు
చంద్రు వలె హిమహతిఁ గందు జలజముకుళ
ముం బలెను భీమవీర్యభారంబుచే వి
కృత మయిన మేను దాలిచి కీలి వెడలె. 17

కం॥ అనలాలోకరుషాకుల
తనుకాంతి స్మరత్రపాసదరహసితనతా
నన నగజఁ దేర్చె శంభుఁడు
మనసిజరసగర్భితాతిమధురోక్తులచేన్. 18

చ॥ ఘనతరఘర్మవాశ్చయనికామవికీర్ణత నాననాకళం
కనిరుపమేందునం దొలయు కజ్జల పంకకళంకరేఖఁ దా
ననువుగఁ బాపె నాత్మహృదయప్రియకా వెనకయ్యయయ్య యొ
య్య నిజభుజాగ్రజాగ్రదమలాంశుకసంచలదంచలంబునన్ 19

కం॥ అలసము శ్రాంతాంగుళికముఁ
జలమును నగు కేలఁ దుడిచి శంభుఁడు లీలన్
దొలఁచెను వీవన వీవలి
సలలితగిరిజాననాంబుజశ్రమజలమున్. 20

కం॥ అమృతాంశుమౌళి రతిగళి
తము నంసాలంబితాంతతాంతలతాంతో

---

ఆ.వె. నిర్భరోష్ణబాష్పనిశ్శ్వసితస్పర్శ
మకిల నడుమ పొనరు ముకురమట్టు
లనలు నమలమూర్తి హరవీర్యభరణార్తి
నయ్యెఁ గడు వివర్ణ మతిరయమున. పాఠాంతరము. 15

మ॥ ప్రకటస్వేదజలావకీర్ణము లసద్వక్త్రాకళంకేందుబిం
బకళంకప్రతిపాదకంబు నగు దృక్పంకేజనిర్యన్మిళిం
దకనత్కజ్జలపంకలాంఛనముఁ గ్రన్నన్ బాపె నర్ధాంగి క
బ్జకళామౌళి నిజోత్తరీయసిచయాంచచ్చంచలాగ్రంబునన్. పాఠాంతరము 19

త్తమము నగు తుఱుము ముడిచెను
దమి రమణికిఁ బారిజాతతరుసుమమాలన్. 21

కం॥ చెలి చెక్కిలికవ వ్రాసెను
జెలువుఁడు కస్తూరికావిచిత్రమకరికా
ళుల స్మరసిద్ధుఁడు లోకా
వళి నలిఁ దమి కొల్పు మంత్ర వర్ణతతివలెన్. 22

తే.గీ. కొమ్మ నెమ్మోముఁ దేరు కర్ణమ్ము లొద్ద
కమ్మజతబండికండ్లుంచెఁ గాంతుఁ డెమ్మె
దాని నసమాస్త్రుఁ డాతతసూనచాపుఁ
డెక్కు లోకత్రయజిగీష నిక్కువముగ. 23

కం॥ చెలువుఁడు చెలిమెడఁ జనుమొన
లలమఁగ నిడ హారలతిక నది దగె నిరుపు
త్తళిమలల తలలఁ చాఱుచ
దలుజాలుందోయి మేలు దాలుచు లీలన్. 24

కం॥ నెలకూనల వరుసల బల్
వలనగు చెలి బటువుఁబిఱుఁదుపై మరుసూఁ డ
ర్మిలి మొలనూల్‌గట్టెను నిజ
చలచిత్తమృగంబుఁ గట్టు స్మరపాశమనన్. 25

తే.గీ. వ్రేలఁ బుడికిన కాటుక భాలనయన
కీలిఁ గరఁచి కువలయాక్షి క్రాలుఁగనులఁ
జాల రంజించి తుడిచెనా వ్రేలు హరుఁడు
పులక లలమిన నిజనీలగళమునందు. 26

కం॥ సరసిరుహాయతలోచన
చరణసరోజాగ్రమందు జతురసము సుధా
కరమౌళి చమరి తన చే
యరుణిమ స్వశిరోఽమరాపగాంబులఁ దొలఁచెన్. 27

---

కం॥ పలు గోర్వంకల గొనబగు
వలఁతి బటువుఁ బిఱుఁదు మీఁద వలరాపగవాఁ
డెలమి మొలనూలు గట్టె స్వ
చలచిత్తమృగంబుఁ గట్టు స్మరపాశ మనన్-పాఠాంతరము 25





కం॥ బూదియ పూసిన తన మెయి
నాదర్శము లెస్సఁ దుడిచి యది మండనశో
భాదర్శనార్థముగ లీ
లాదృతమతిఁ జూపె విభుఁడు ప్రాణేశ్వరికిన్. 28

కం॥ హరదర్శితమణిముకురాం
తరమున రతి చిన్నె లొలయుత తనమెయిఁ గనుఁగ్రా
చురులజ్జ గగురు నెపమునఁ
దరుణి వెలిచె నతని పైనఁ దనహృది బాళిన్. 29

కం॥ వరవిరచితభూషాశ్రీ
నరయుచు నద్దమున సదరహాసముగా సుం
దరులందుఁ దన్ను మిన్నగ
గరిత దలఁచె మదిని దొలివికారము తలఁగన్. 30

తే.గీ. అప్పు దరుదెంచి ప్రియవయస్యలు జయావి
జయలు లోనికి మిహికాంశుశకలమకుటు
నంకతలమందుఁ జెలువొందు ప్రాణసఖిని
గొలిచిరి ప్రసాధనకళాకుశలత లలర. 31

తే.గీ. చలపిరి[1] విచిత్రచరితరుచ్యముగ బైట
వడిగ మంగళగానముల్ వందివరులు
పాడె గంధర్వబృందంబు గూడ శంఖ
రవయుతిగ భూరిగిరిధనుర్ధారి చెలఁగ. 32

కం॥ కొలువఁగఁ దఱి గని నంది య
వలవాకిలిఁ జొచ్చి యడఁకువన్ బ్రాంజలియై
తెలిపెఁ బురారికి దేవా
వళులు తదీక్షైకనిరతి వచ్చి నిలుచుటల్. 33

కం॥ ఆ నిఖిలపతి స్వమానస
మానసకలహంసి గిరికుమారి కరము చేఁ

---

1 సలిపిరి = వ్రాఁతప్రతి, చలుపు = చేయు, కడపు, సలుపు = కుఱుపు, పుండు మొదలగునవి బాధపెట్టు, శబ్దరత్నాకరములో రెండు రూపముల నంగీకరించుట విచారణీయము.

బూని యరుదెంచె రతిలీ
లానిలయము వెడలి వారలను గన లీలన్. 34

కం॥ మౌళుల మోడుపుఁగేలుం
గీలించి సురేంద్రముఖ్యగీర్వాణులు దా
మోలిఁ దెలచి రీశ్వరునకు
శైలసుతాదేవి సర్వజగదంబికకున్. 35

కం॥ ఆ విబుధుల రంజిల సం
భావించి వృషాంకుఁ డనిపి స్వైర విహృతికై
గ్రావజతోఁ జనె నుక్ష
క్ష్మావరు మూఁ పెక్కి నంది కైదండ యిడన్. 36

కం॥ గిరిశుఁడు మనోఽతిరయభా
స్వరు వృషవరు నెక్కి గగనపథమధ్యమునం
దరుగు తఱిఁ దెలచి రంజలి
ధరులు విమానగతికేళితత్పరు లమరుల్. 37

చ॥ అసమసురాపగాంబుకృతహారివిహారుఁడు కాంతకామినీ
ప్రసవశరాహవాత్యయభవశ్రమభారుఁడు భూరిపారిజా
తసుమసుగంధసారసముదారుఁడు చారుసమీరుఁ డింపు పెం
పెసఁగ గిరీంద్రజామరగిరీశశరాసులఁ గొల్చె నిర్వరన్. 38

ఉ॥ భాసిదిగంబరావృతము భవ్యసుధాంశుమణిజ్వలచ్ఛిఖో
ల్లాసము భోగిభోగసమలంకృతిచిత్ర మఖండభూతివి
న్యాసము స్ఫాటికాశ్మనిచయాచ్ఛమునై తన మేనుఁ బోలు కై
లాసనగంబు డాసె సవిలాసముగాఁ బరమేశుఁ డయ్యెడన్. 39

తే.గీ. అందుఁ బటికంపుఁజూ గోడ లందునఁ దమ
నీడ లారసి సిద్ధమానినులు సవతి
కాంత లను భ్రాంతి రోసింత్రు కాంతుల పయి
వారు నిజపాదపద్మవందారు లైన. 40

ఉ॥ అం దనుబింబితం బయిన యైందవబింబము పల్గుఱాల డాల్
గ్రందు కడింది వెల్లి మునుఁగంగఁ దదంకము పొంక మొందె గౌ
రీందునిభాస్య దా నిడిన హృద్యసురారసమందుఁ గమ్మవ
ల్పుం దనరింపఁ జేరిచిన భూరికురంగమదాంశపుం బసన్. 41





కం॥ కరిపతు లటఁ దమ నీడల
నరసి పలుగురాల గోడలం దితరమదో
ద్ధురకరు లని భ్రమఁ దాఁకుచు
నురుభయదరదాహతివ్యథోపహతిఁ గనున్. 42

తే.గీ. అచటి పటికపురాల యిండ్లందు రేలు
వెలుఁగు చుక్కల గముల నీడలను గనుచు
రతులఁ దునిఁగిన తారహారముల మౌక్తి
కము లివి యుటంచు సిద్ధముగ్ధలు భ్రమింత్రు. 43

మ॥ ఖచరేందీవరలోచనాజనపరిష్కారక్రియాదర్పణ
ప్రచురశ్రీరుచిరేందుఁ డుల్లసిలెనా భవ్యాచలాగ్రోర్విఁ బొ
ల్పుచు మాంగళ్యనిశాంతసంతతిఁ గడున్ శోభిల్లు ప్రాలేయశై
లచయోత్తంసు నమూల్యమౌళిమణిలీలన్ గ్రాలు బింబంబుతోన్. 44

కం॥ మరు నెంజిలి నేకతమున
సుర లట రతినిరతిఁ దఱిసి సుదతులఁ దమ రొం
టరు లయ్యుఁ బలుగు రైనటు
పరఁగుదురు పలుంగురాలఁ బ్రతిబింబితులై. 45

తే.గీ. అల్ల నెలదాల్పుదొరయు నిరంతరాతి
హృద్యశృంగారచేష్టల నెలమి మీఱ
నిచ్చ విహరించె హిమభూమిభృత్కుమారిఁ
గూడి తడవుగ స్ఫటికాద్రికూటవాటి. 46

కం. అల యలరువిలుతుపగతుని
యలరుం జెయి వట్టి గౌరి యల్లన నడిచెన్
బలు బెత్తము చేకొని ముం
గల నరుగుచుఁ ద్రోవ సూపఁగా నంది రహిన్. 47

చ. నలిఁ జలియింప జుట్టులకొనల్ వికృతంబులు గాఁగ గాత్రచే
ష్టలు పొడవై తనర్పఁగ నొడల్ గడు వెల్లఁదనంబు గల్గి య

---

చ॥ అనువుగ సిద్ధముగ్ధహరిణాక్షు లటన్ బటికంపు మేడలన్
దినుసుగ వెల్లుచుక్కగమి నిద్దపు నీడలు గాంచి రేలు నె
మ్మనముల భ్రాంతి గాంతు రసమానసుమాస్త్రరణాంతవేళలన్
దునిఁగిన తారహారముల లోకపుముత్తెము లంచు సత్తుగన్ – పాఠాంతరము

గ్గలమగు వాఁడిమిం దగ మొగంబును నాట్య మొనర్చె భృంగి యా
వలిమలపట్టి వేడ్కకుఁ గపర్ది దనుం బురికొల్ప గన్బొమన్. 48

కం. పునుకసరి మెడ నటింపఁగ
ఘనదంష్ట్రాభీకరాస్య కాళిక యాడెన్
దన కూర్మిసతికి సంతస
మును బెనుపఁగఁ బ్రీతినా విభుఁడు ముదల యిడన్. 49

కం. గట్టుకొమారిత గని యా
బెట్టిదముగ నఱచు కాళి భృంగిని భీతిన్
గట్టిగఁ దనంతఁ గౌఁగిటఁ
బట్టెను దమి బలిమి నతనుపగతుని కుతుకన్. 50

కం. బలుపొడవు బలుపులను నెడఁ
దెలియని కుచమండలము హృది న్నాటి వెఱన్
చెలిపైఁ బడి యిడు కౌఁగిలిఁ
బులకితుఁడై యపుడె తమి శివుఁడు మయి మఱచెన్. 51

మాలిని:

అమృతకరకిరీటుం డ ట్లుమానర్మలీలా
విమలవివిధరీతిప్రీతుఁడై రాజతాద్రిన్
బ్రమదరసమహాంభోరాశిలోఁ దేలుచున్ దన్
బ్రమథు లతులభక్తిన్ వశ్యులై కొల్వ నుండెన్. 52

కం. సుమహితసౌజన్యా! యు
త్తమకావ్యరసాభినవసుధాపానాశ్రాం
తమహోదన్య! జగత్త్రయ
సుమనోజనమాన్య! సోమసుందరధన్యా! 8

తే.గీ. ఇది నవమసర్గ మగజామహేశరతిశ
మనవిలాసాంచితము కూచిమంచి సోమ
సుందర కవీంద్ర వేంగమా నందనాగ్ర్య
సాంబశివకృ తాంధ్రకుమారసంభవకృతి. 5

---



శ్రీః

# శ్రీమదాంధ్రకుమారసంభవము

## దశమాశ్వాసము

---

కం. శ్రీరమ్యకూచిమంచికు
లోరుపయోరాశిపూర్ణిమోత్పలినీకాం
తా! రుద్రపదాబ్జాళికి
శోరత్స్వస్వాంత! సోమసుందరదాంతా! 1

కం. అవధారు! కాళిదాస
జ్ఞవరారోపితకుమారసంభవకృతిశే
షవిచిత్రకథ వినుతు నేఁ
బ్రవిమలనైజత్రిలింగవాగ్గుంఫనచే. 2

కం. గురుతరహరతేజోభర
ధరుఁ డల వైశ్వానరుండు దఱిసె నిఖిలని
ర్జరచక్రవర్తి సుమనో
వరపరిషద్వర్తి శ్రితవిపత్తినివర్తిన్. 1

కం. పొగయుచు ధూమల మయి గన
వెగటగు మండలము తోడ వికృతశరీరుం
డగు దేవముఖునిఁ గనె ము
జ్జగములతోఁ డాదరం బెసఁగ వేగనులన్. 2

కం. ఆ రీతి నున్న పావకు
నారసి బలవైరి కలంత నందెడు మతితో
మారాసుహృన్మహోగ్రహ
కారణకం బయిన యెగ్గుగాఁ దడ వెంచెన్. 3

కం. విన్నని మోముల తోడన్
దన్ను నిలింపులు క్షణక్షణము గన నతఁడున్
బన్నుగ సురపతి ప్రేమస
మున్నతిఁ దన కిడిన పీఠమునఁ గూర్చుండెన్. 4

కం. హుతవహ! యీ దుర్దశ యే
కతమున నీ కయ్యె నని మఘవుఁ డటు లడుగన్
గృతనిఃశ్వాసపురస్సర
మతఁ డిటు ప్రతివచన మిచ్చె నాదృతమతియై. 5

చ. శతమఖ! యింద్ర! నీదయిన శాసన మెప్పు డలంఘ్య మౌట నౌ
చితి దగఁ బావురా యొడలు చేకొని నే హిమవత్సుతారతా
దృతుఁ డగు శంకరున్ దఱియ నేగి కృతాంతభయంకరాత్ముఁడౌ
నతను విరోధిసన్నిధి నిజాకృతిఁ దాల్చితిఁ గ్రమ్మఱన్ వెఱన్. 6,7

కం. జంభహర! యతఁడు ననుఁ గని
దంభవిహంగముగ నెఱిఁగి తజ్జ్ఞుఁడు రుట్సం
రంభమునఁ దలంచె నేర్చన్
జృంభత్కీలాత్మభాలదృక్పుటుకీలిన్. 8

కం. తీయనయి యర్థవంతము
లై యడరెడు నుడులఁ బొగడ నడఁకువమెయి నే
నా యలఘుఁ దలరె సన్నుతి
సేయఁగ నెవ్వాఁడు సంతసింపఁడు జగతిన్? 9

కం. శరణార్థివత్సలుఁడు శం
కరుఁ డఖిలావనుఁడు నన్నుఁ గాచె నిజరుషా
స్ఫురదగ్ని కెఱ నగుదు నను
పరమానిర్వారభీతిభర ముడిపి కృపన్. 10

సీ. గిరిసుతాలింగనత్వర వీడి క్రీడకై
యతను లీలారతాదృతి దొఱంగి

72



సురతాంతరాయవిచ్యుత మమోఘము జగ
త్త్రయదాహకము దుర్భరంబు నైన
తన తేజ మపుడె నా తనువం దతఁడు సేర్ప
నతిదుర్విషహ మగు నాహలాహ
లాహారివీర్యదావాగ్నిచే దందహ్య
మానమౌచున్న యీ మేను నేను

తే.గీ. దాల్పఁగాఁ జాలఁ గాలకంధరమహోమ
హోగ్రశిఖిఁ గాలి పేలు నా యుసురు లింక
వేగఁ ద్వత్కరుణారసవృష్టిఁ గురిసి
కావు జీమూతవాహ!భక్తావనేహ! 11...14

చ. ఇటువలెఁ బావకుండు వచియించిన పల్కుల నాలకించి యా
దట విబుధేశ్వరుం డతని తాపము వాపఁగ వైపు రోయుచున్
చటుమతి నుగ్రవీర్యశుచి మ్రగ్గు తదంగము లాత్మపాణి వి
స్ఫుటకమలంబుచే నిమురుచున్ మఱి వాని కొకించు కిట్లనున్. 15

సీ. అనఘ! స్వాహాస్వధాహంతకారములచే
నీవు ప్రీతుఁడ వౌచు దైవతపితృ
మనుజుల సంప్రీతులను నీవ చేయుదు
వారికీ వొకఁడవ వదన మగుట
నమరలోకావాప్తి కమర నీ వొకఁడవ
హేతువ వగుటచే హోతృజనులు
హవ్యముల్ వేల్చి నీ యందుఁ బాప విముక్తు
లయి నాకభోగము లనుభవింత్రు

తే.గీ. తపములకు నీవు దొరవౌటఁ దపసు లెల్ల
వేదమంత్రప్రపూతహవిర్గణంబు
సలిపి హోమంబు నీ యందు జాతవేద!
నిజతపస్సిద్ధి ధన్యులై నెగడు చుంద్రు. 16...19

సీ. ఆహుతుల్ గొని యుంతు వర్కునం దతఁడు ప
ర్జన్యుఁడై కురియు వర్షంబు దాన
నగు నన్నములు ప్రజ లగుదురు వానిచేఁ
గావున నీవు జగత్పితృఁడవు

మెలఁగుదీవీ భూతముల లోనఁ దత్సము
ధ్రువజీవననిదాన మవుదు వీవ
హితకారి వొకఁడవీ వీ విశ్వమునకు నీ
కంటె నేరీ కార్యఘటనపటువు?

తే.గీ. లీయమరసముదయమున కీవొకఁడవె
కార్యసాధనచాతుర్యధుర్యతముఁడ
[1]వనఘ! లోకోపకారపుణ్యవ్రతులకుఁ
గలుగునాపదలైన శ్లాఘ్యములుకావె? 20…23

కం. మును గంగాదేవీమణి
పనుగొని మెప్పింపఁబడియె భక్తిని మాచే
మునుఁగంగా నాయమ పా
వనజీవనకుక్షి నీకు జ్వరభర ముడుపున్. 24

కం. కావునఁ బావక! దైవత
శైవలవతిఁ జేరు మసలఁ జన దిఁకఁ జేయం
గా వలయు పనుల వేగము
గావించుట కార్యసిద్ధికారణము గదా! 25

కం. ఆ విబుధసరిద్దేవియ
జైవాతృకశకలమకుటజలమయతనువై
భావజహరదుర్వహతే
జోవరభర మామె దాలుచున్ గొని నీచేన్. 26

కం. అని యిటు మఘువుఁడు విరమిం
చిన ననలుం డతఁడు వనుప సెలవుగొని చనెన్
వనధినిషంగశిరోరం
గనటద్రంగత్తరంగ గంగఁ గనంగన్. 27

సీ. కాంచెఁ ద్రోవ తరించి కాంచనేంద్రియుఁ డట
నిర్వాపితాఖర్వసర్వఖేదఁ
ద్రిదివాధిరోహణవిదితాధిరోహిణిఁ
గైవల్యమార్గాధిదైవతమణి

1. వనల! - పాఠాంతరము.





నుద్ధతదురితశిలోచ్చయోగ్రాశని
ఘోరసంసారకూపారతరణి
శివజటాజూటవాసిని దుర్విషయలోల
ఖలసహితాఖిలకులపునాన

తే.గీ. ధర్మధారిణి హరిపదోదారవికసి
తాబ్జమధుధార బ్రహ్మలోకావతీర్ణ
స్వత్రివేణీసదాపావితత్రిభువని
నిఖిలగుణఖని దేవధునీజననిని. 28…31

కం. అట వచ్చు ననలు సుమన
స్తటినీరత్నము భృశప్రసన్నత నర్ధ
స్ఫుటఘటనేచ్ఛం బిలిచెను
జటులోద్ధతవీచిహస్తసమితి ననఁ దగెన్. 32

కం. అతిమదమత్తతఁ గలకూ
జితములు దగ మేళగించి చెలఁగించు సమం
చితహంసరుతుల నది యనె
నతని కితము లిడుదు వెతల నడఁతు నటంచున్. 33

కం. ఇవతలి దరిఁ దఱియఁగఁ బటు
జవమునఁ బఱతెంచి వచ్చు జగ కరదులచే
దివిషన్నది యెదురేగెను
బవమానునిచెలికిఁ బ్రీతిభరితాత్మ బలెన్. 34

కం. ఆ తటిని దాసి యటఁ దా
పాతురుఁడౌ నగ్ని గ్రుంకెనానీట గడున్
బ్రాఁతిఁ బ్రభూతవిపత్పరి
భూతాత్ములు జాగుసేయఁ బూనుదురె? ధృతిన్. 35

కం. శ్రమహరము శుభకరము పు
ణ్యమణీరత్నాకరము భవవనధిమందరమౌ
నమరసరిత్పుష్కరమున
నమరముఖుఁడు దోఁగి తాప మాఱి సుఖించెన్. 36

కం. అంతస్సంతాపవిప
చ్ఛాంతిక్షమ మున్నతోర్మిచయమగు రక్షో

హంతృస్రవంతి యందుఁ బు
రాంతకు ధామంబు సేరె నగ్ని నెడయుచున్. 37

ఆ.వె. అగ్నితేజు ధామ మాశ్రయాశుని వల్ల
నమరధుని గొనంగ నాదరమున
నమృతవృష్టిఁ బోని యా జలంబులఁ దేవి
యురుసుఖాప్తి నిచ్చఁ దరలెఁ గీలి. 38,39

చ. అరుదగు శంబరాంతకు మహామహు దుస్సహమౌ మహామహో
భరము ధరించుచుం ద్రిదివవాహిని తాపము నొంద లోకభీ
కరవిలయోజ్జ్వలచ్ఛిఖిశిఖాపరితప్తవదుద్ధతోష్ణసం
జ్వరితతదంబులన్ వెడలి పై కుతికెన్ జలజంతుసంతతుల్. 40,41

కం. ఆ రహి స్మరహరతేజో
భూరిభరంబునను బొంగి పొరలుచుఁ గరమున్
దారుణ మగు తన వారినె
సౌరసరిన్మణి భరింపఁ జాలని దయ్యెన్. 42

కం. పరఁగ జగచ్చక్షుండగు
నరుణకిరణుఁ డించు కభ్యుదయనోన్ముఖుఁడౌ
తఱి మాఘమాసమున నా
ర్గురు వచ్చిరి కృత్తికల్ మరున్నదిఁ గ్రుంకన్. 43

కం. అమరసరణి నొఱయుచు విమ
లము లయిన తరంగశతములన్ సురలకు ని
త్యము నిజవీక్షాప్లవనా
చమనాదికసుకృతనికరసాధనచణయున్. 44

కం. కృతసుస్నానులు మునివరు
లతులితపూజోచితంబు లయినసదూర్వా
క్షతము లగు పూలు చల్లిన
ప్రతీరబహిరుర్వులన్ సుభగమగు నదియున్. 45

సీ. సుస్థిరబ్రహ్మాసనస్థితు లగుచు బ్ర
హ్మధ్యానతత్పరాయణమతు లయి
యతులయోగసుషుప్తిరతు లయి యోగప
ట్టము దాల్చు యోగిసత్తముల చేత





నిలఁ బదాంగుష్ఠాగ్రముల మోపి నిలుచుండి
యినబింబబద్ధలక్ష్యేక్షణు లయి
వరపరబ్రహ్మజపప్రసితాత్ములై
వఱలు భూసురఋషివరుల చేత

ఆ.వె. సేవ్యమాన యైన దివ్యాపగాదేవిఁ
గాంచి యపుడు కృత్తికలు చెలంగి
రలరఁ జేయ దెవని నాసుధావాహిని
దన్నుఁ గాన వచ్చు ధన్యమతిని? 46...48

చ. తన తలఁ బూను దేనిని సుధాకరమౌళి యగణ్యపుణ్యద
ర్శన యెది యేది శౌరిపదసారససంభవ దుర్దమాఘమ
ర్దని యెది యేది ముక్తిపదదాయిని యా యనఘామరాపగాం
బను గని పొంగి వంగి కడు భక్తి శిరంబుల మ్రొక్కిరా సతుల్ 49,50

కం. అసదృశసౌభాగ్యచయై
కసులభ నపవర్గలగ్నకశిఖామణి ది
వ్యసరిత్సతి వినుతించిరి
సుసాధ్వు లట శ్రద్ధ తోడి చొక్కపుబత్తిన్. 51

మ. వరకైవల్యరమావశీకృతికళాప్రావీణ్యధుర్యంబులౌ
పరిపక్వామితభాగ్యజాలసుకరప్రాప్యాభ్రధున్యంబులన్
బరిశుద్ధిం గని యాతపస్వినులు గ్రన్నన్ దోఁగి మోదించి రాం
తరమాలిన్యనివృత్తి ధన్యలనుగాఁ దమ్మెంచుచుం దద్దయున్. 52,53

కం. దైవతతటినీసలిలా
ప్లావిత లగు మౌనిసతుల వరగాత్రములన్
బావకవీర్య నవంధ్యం
బౌ వీర్యము సంక్రమించె నావెనువెంటన్. 54

కం. దహనాత్మక మయి యతిదు
ర్వహ మగునా రౌద్రధామభరమున మునిరా
ణ్మహిళలు తాపము సెందిరి
మహావిషమయాంబునిధినిమగ్నల మాడ్కిన్. 55

కం. అతిదుర్భరహరతేజో
భృతి కోర్వఁగఁ జాల కార్తివికలత జలని

ర్గతవైరి లోన దరికొను
హుతవహుంc దాలిచిన చంద మొందుచు నబలల్. 56

కం. అమరసరిన్ముక్త మవం
ధ్యము నగు పురవైరి భూరితరవీర్యము సం
యమితనుమధ్యోదరమ
ధ్యమున సముద్దీప్త మగుచు నమరెన్ జ్వాలై. 57

కం. అది గర్భ మగుట బోధా
స్పదలా యమ లెఱిcగియున్న భరియింపcగలే
కెదలోc జెందిరి కర మద
వద పతిదరమున నపత్రపాభరముననున్ 58

కం. తెగువ నల యరిది గర్భము
మగువలు వెస డించి సభయమందాక్షంబై
తగc గనుపపులుపొలంబున
వగవక చని రవల స్వస్వభవనంబులకున్ 59

మత్తకోకిల:
కామినీమణు లందు వీడిన గర్భరాజము గ్లోకళా
కోమలద్యుతి మించు చర్యమకోటిజిష్ణుమితప్రభా
క్రామితాంబరగర్భషణ్ముఖకంజుcడై యుదయించెc బై
తామహాస్యచతుష్కతోర్థమదచ్ఛిదార్థముగా నసన్. 60

మాలిని:
వితరణజితకర్ణా! వృత్తవైదుష్యపూర్ణా!
ధృతివిభవకృతోర్వీభృత్కులాగ్రణ్యవర్ణా!
సతతశివపదాంభోజాతసద్భక్త్యుదీర్ణా!
శ్రితసుజనదరిద్రశ్రీవిధానాతితూర్ణా! 3

తే.గీ. ఇది దశమసర్గ మగజాసుమేషహరకు
మారజనిరాజితము కూచిమంచి సోమ
సుందర కవీంద్ర వేంగమా నందనాగ్ర్య
సాంబశివకృ తాంధ్రకుమారసంభవకృతి. 4

---



శ్రీః

# శ్రీమదాంధ్రకుమారసంభవము

## ఏకాదశాశ్వాసము

---

కం. శ్రీకూచిమంచివంశధు
నీకాంతప్రౌఢకుముదినీపతి! దిక్కాం
తాకుచముక్తాహారా
స్తోకయశోవితతి! సోమసుందరసుకృతీ! 1

కం. అవధారు కాళిదాసకు
కవిరచితకుమారజననకావ్యకథాపూ
ర్తివిధాయకకృత్యనుసృతి
నవలి కతన్ వినుతు నిర్మలాంధ్రోక్తితతిన్. 2

చ. అతులశతక్రతుప్రభృతులౌ సుర లందఱు నేగుదెంచి న
మ్రత యెసcగంగ వేcడcగ నమర్త్యతరంగిణి స్వీకృతాంగనా
కృతి యయి యా స్తనంధయునికిన్ ద్వరమైc గుడువంగcబెట్టెన
మృతరసుధారసాకరము నాత్మపయోధర మాదరమ్మునన్. 1

ఉ. ఆ నిసు వాని యా నిరుపమాభ్రధునీ జననీస్తనద్వయా
నూనలసత్పయోఽమృతరసౌఘముc గూర్మి క్షణక్షణంబునున్
మానుగ వృద్ధి గాంచుచు సమంచదనిర్వచనీయరూపమున్
బూనెను దన్నుc గృత్తికలు పూనిక నార్వురు వచ్చి పెంపcగన్. 2

కం. ఆ దివ్యనందనుం గని
యాదిత్యధునీమణీదహనకృత్తికలా
మోదాస్రాకులలోచన
లై దమలో మిగులc దగవు లాడి రతనికై. 3

కం.[1] అంతటిలో రతికాంతమ
దాంతకుcడు విమాన మెక్కి యంబిక తోడన్
స్వాంతాధికరయమున దివి
నెంతయు విహరించు చటకు నిచ్చున్ వచ్చెన్. 4

తే.గీ. ప్రకృతివశవత్సలత హర్షరసము హృదయ
కమలముల నిండి బాష్పమై కనుల వెడల
హరభవానులు గని రందు నాఱుమోము
లొందు లెక్కాఱు ప్రొద్దుల కందుc జందు. 5

కం. అవల శశిమౌళి కుమ యనె
నెవcడీ మన మ్రోల బాలుc దేకృతి యీ ది
వ్యవపుర్ధరుపిత? యే భా
గ్యవతీమూర్ధన్య నోచి కన్నదొ యితనిన్. 6

తే.గీ. ఏల యీ గంగ యీ కీలి యీ పవిత్ర
కృత్తికాషట్క మిటు కలహింత్రు మత్ప్ర
సవ మితcడు గాcడు నీ పట్టి సరి నిజంబు
గాదు మా బిడ్డc డని విలక్షణము గాcగ. 7

ఆ.వె. ఈ యఖిలజగత్త్రయీసతీతిలకాయ
మానుc డభవ! యెవరి సూనుc? డిందుc
గాక యెవరి కాన్పు గరుడాహిసిద్ధగం
ధర్వపూర్వసురసుపర్వులందు. 8

కం. అని కుతుకమున మనఃప్రియ
తను నడిగిన నుడువు విని సుధాకరమకుటుం

---

కం.[1] బాలేందుమౌళి యాలో
శైలాత్మజతో విమానసమధిష్ఠితుcడై
లీల మనోఽధికరయ వా
హ్యాళిన్ దివిc జనుచు వచ్చె నచ్చటి కిచ్చున్. 4



దనె సదరస్మితముఖుcడై
ఘనహర్షజసుఖనిదానకమనీయోక్తిన్. 9

మ. విను! లోకత్రయతోషణుం డయిన యీ వీరుండు వీరాగ్రణీ
జననీ! నీ తనయుండె సుమ్ము దివిషత్సంతానకల్యాణసా
ధనవిజ్ఞానధురీణ విక్రమరమాస్థానాగ్ర్యనిర్మాణ మ
న్యనభోమధ్యల కెట్లు సాధ్య మగుc ?గల్యాణీ! విమర్శింపcగన్. 10

మ. త్రిజగన్మంగళగీతహేతు వగుచున్ దీపించునీసర్గత
ల్లజమోదేవి! భవన్నిదానకమ యేలా సంశయం బందcగా
నిజ మిద్దానికి మూలకారణ మనన్ నీవే యొరుల్ గారు గో
త్రజ! రత్నాకర మందుc గా కొదవునే రత్నోత్తమం బెప్పుడున్. 11

మ. విను మట్లొటను సావధానమతినీ వృత్తంబు మున్నే హుతా
శనునం దుంచిన బీజ మభ్రనదిలో సంక్రాంతమై దానిలో
మునుcగం గృత్తికలందు గర్భభరమై పొల్పారcగా వార లం
త నమోఘం బగు దాని నుంచిరి శరస్తంబంబునన్ నేర్పుతో. 12

కం. అం దది సకలచరాచర
సందోహాభూతపూర్వసమ్మోదశ్రీ
కందాయమాన మగు నీ
కందువుగాc బరిణమించెc గంజదళాక్షీ! 13



ఆ.వె. అయి తఖిలజగత్ప్రియాలోకనుం డైన
యితనిచే సుపుత్త్రవతుల కెల్ల
మేలుబంతి వచలబాల! జాల మిcకేల?
యంక మెనయc జేయు మాతృతనయు. 14

చ. పలుక సుధాంశుమౌళియటు బల్ రహి నెమ్మొయి పొంగc బోషితా
ఖిలచరసుస్థిరాత్మ హిమగిర్యధిపాత్మజ మౌళికీలితాం
జలులయి బాసవాల్గములు సంభ్రములై దివి నిల్చి మ్రొక్క మి
క్కిలి వడితో విమానము డిగెన్ దనయగ్రహణోత్సుకాత్మయై 15,16

ఉ. సారెకుc గృత్తికాదహనజహ్నుసుతాదులు మోద్పుcగేల జో
హారు లొనర్చుచున్నc గన కద్రికుమారి సముత్సుకాత్మయై
చేరెను దత్కుమారు సుతసేవధిలాభమహోత్సవాప్తిచే
నే రుచిరాస్య యింపు వహియింప దవశ్యము పారవశ్యమున్. 17

[1]కం. ప్రమదాస్రాకులలోచన
యుమ నిముసము గనక మ్రోల నున్న తనయు మే
నిమురుచుఁ గరకిసలయమున
నమర ననిర్వాచ్యనవసుఖాంతరము గనెన్. 18

మ. ప్రమదాశ్రుప్రథమోర్మి వేగము శమింపన్ బ్రౌఢవాత్సల్యపూ
ర్ణమనః పంకజశంకరప్రియఘనానందాద్భుతోత్ఫుల్లదృ
క్కమలశ్రీవిభవాభిరామ యగుచున్ గన్నార వీక్షింప సు
క్షమ యయ్యెన్ నిజడింభకోదయసమంచద్వాసరాధీశ్వరున్. 19

కం. కనుచా సుతుఁ గోరెను వే
యనిమిషనయనముల నెనయ నచలాత్మజ యె
వ్వని నెమ్మన మనునిమిషము
తనియుఁ గనియుఁ గరముఁ దనయదర్శనశుభముల్. 20

కం. నమదమరాసురచరమాం
గముల నిమురు పాణిపల్లకములఁ గొని యుమా
రమణి నవోదయరాకా
హిమకరరుచిరాంగుఁ గొడుకు నిడికొనియె నొడిన్. 21

కం. కొమరు జగదేకవీరో
త్తము నమృతనిధాన మటు సుధాకరముఖి యం
కమునందుఁ జేర్చుకొని కర
మమరెఁ గుమారప్రసూజనాగ్రార్చితయై. 22

మ. వరనైసర్గికవత్సలత్వరసశుంభత్పూరసంసిక్తమే
దురసమ్మోదసుధౌఘపూరితజగద్వ్యాపైకమాతృత్వధూ
ర్ధర శర్వాణి తదేకనందను నిజోత్సంగంబునం దాల్పఁ ద
ద్గురువక్షోజగిరుల్ తమంతఁ దొఱఁగెన్ దుగ్ధామృతస్యందముల్. 23

---

మ. ఘనమోదాశ్రుసమాకులాక్షి యగుచున్ గ్రావాగ్రణీపుత్రి యొ
క్క నిమేషం బెడుటన్ మెలంగు సుతునే కానంగ లేకుండి యా
తని మే నాత్మకరాగ్రపల్లవము చేతన్ దాఁకుచున్ గాంచె ని
చ్చ ననిర్వాచ్య మభూతపూర్వమునునౌ సౌఖ్యాంతరాంచద్రమన్. 18
పాఠాంతరము.



కం. వే తదశేషజగత్త్రయ
మాతృస్తన్యామృతం బమరఁ గ్రోలెను షా
ణ్మాతురుఁడు కృత్తికాగం
గాతటినులు సస్పృహముగఁ గనఁ బలుమరుఁ దన్. 24

మ. అరు దొప్పారఁగ నేకనాళభవపుల్లాంభోజషట్కంబు డం
బరముం బూనెడు డింభకోత్తము ముఖాబ్జాతంబు లాఱున్ సుధా
కరచూడామణి రాణి ముద్దిడియె రంగన్మోదబాష్పాంబు స
భరితాత్మీయముఖాంబుజం బొకటనే భవ్యక్రమారూఢితోన్. 25

మ. అనురూపంపు ఫలంబు నూను తపనీయాహార్యసంజాతకాం
చనవీరున్మణి తీరు మీఱి వికచాబ్జం బూని జానౌ నభో
ధుని బల్చందము చెంది చెందొవలవిందుం గందువుం దాల్చి పొ
ల్చిన పూర్వాశ సుశోభ గాంచి యుమ మించెన్ మోయు చానందనున్.

కం. అమృతాంశుమౌళి యమలుఁడు
ప్రముదితచేతస్కుఁడై కరవలంబ మిడన్
గొమరు నొడిఁ జేర్చుకొని యుమ
యమరసరణి నొఱయ వ్యోమయానము నెక్కెన్. 27

కం. హరుసమున గరు లెసఁగ మెయి
హరుఁడును గొనెఁ దనయు నగజ యంక మెడపి శం
కరు వలన నంబ గొనె శశి
ధరుఁ డంబిక వలన గొనె సుతస్నేహమునన్. 28

కం. [1]అనిశదృగమృతైకప్రదు
ననఘుఁ దనయు నెత్తుకొని నగాత్మజ యాలిం
గన మొనరింపఁగఁ దనుఁ దన
మనికికి నెలదాల్పు చనె విమానజవనతన్. 29

---

తే.గీ. [1]అనిశనయనసుధాప్రదానైకధుర్యు
విమలచర్యుఁ దనయవర్యుఁ బ్రేమ నార్య
యెత్తికొని కౌఁగిలింపఁ ద న్నిందుమౌళి
చనియెఁ దన మన్కికి విమానఘనరయమున. – పాఠాంతరము. 29

మ. [1]అకలంకస్ఫటికాద్రితుంగతమశృంగాగ్రంబునన్ రామణీ
యకసాకల్యనికాయ్యమై తగు స్వకీయామేయహర్మ్యంబులో
శకలైణాంకకలాపుఁ డుండి యిడె నాజ్ఞన్ భూరిపర్వంబుఁ గో
రికఁ జేయన్ బ్రమథాద్యపారమహిమశ్రీమద్గణశ్రేణికిన్. 30

కం. దొరఁకొనె నటుపై గిరిజే
శ్వరుల తనయు జనిమహోత్సవము సవరింపన్
వరసమ్మదభరితాంతః
కరణము నురుగుణమునౌ  సకలగణగణమున్. 31

కం. కట్టిరి పెట్టుంజెట్టులఁ
బుట్టిన పువుగుత్తిగములఁ బొలు పెసఁగెడు లే
రొట్ట పసిఁడితోరణముల
నిట్టలముగ స్ఫాటికాశ్మగృహములఁ బ్రమథుల్. 32

కం. హరిదధిపభటు లితరసుర
వరు లట మొరయించు మంద్రపటుపటహాడం
బర మాశ లలమి విశ్వం
భరఁ బరవె మహంబు మహిమ మహిఁ జాట ననన్. 33

తే.గీ. అమ్మహోత్సవ మారయ నరుగుదెంచి
యెలమి గంధర్వవిద్యాధరేందుముఖులు
ధరజచే మన్ననలు గాంచి తద్గృహమునఁ
బ్రీతిఁ బాడిరి మంగళగీతచయము. 34

కం. లలి వేడుకఁ దగవులు చే
తులఁ గొని మాతృకలు వచ్చి దూర్వాక్షతలన్
దలపై నిడి జననీవ
త్సలతను నొడి నునిచికొనిరి ధరజాతనుజున్. 35

మ. అమరన్ గ్రందిల మంద్రరావమున భవ్యాంకోర్ధ్వకాలింగ్యనా
మమృదంగాదికవాద్యవర్గములు సమ్యక్సంధిబంధంబుగా

---

చ. [1]అరిది పలుంగుఁగొండ పొడ వారు తలన్ లలి మీఱ భూరిసుం
దరతరమందిరాంతరమునం దిరవొందుచు యామినీమనో
హరశకలావతంసుఁడు మహాప్రమథాదిసముల్లసద్గణో
త్కరముల కాన దా నిడె ముదంబునఁ జేయ నఖర్వపర్వమున్–పాఠాంతరము





సముదంచద్రసభావసంతతముగా సద్వృత్తగీతానుసా
రముగా నాడిరి రక్తి మీఱ సురవారస్త్రీశిరోరత్నముల్. 36

సీ॥ కడు సుఖమ్ముగ వీచెఁ గమ్మని తెమ్మెర
లెసఁగెఁ బ్రసన్నమై యెల్లదెసలు
ధూమవర్జితభవ్యధాముఁడై శిఖి వెల్గె
నంబువుల్ మివుల స్వచ్ఛంబు లయ్యెఁ
దాల్చె విన్ వెసఁ దెల్వి దరమంద్రరవయుక్తి
హరుగృహభేరికల్ మొరసె వడిగఁ
గ్రొవ్విరి మొత్తముల్ గురియు చంబరవీథి
రమణ విమానవారము చరించెఁ

తే.గీ. జన నిటు లుమేశ్వరకుమారసంభ్రమోత్స
వంబునఁ జరాచరం బీజగం బఖిలము
మోదరసభారసముదితోన్మాదమయ్యెఁ
దారకశ్రీ యొకండె తద్దయు వడంకె. 37...39

కం. ప్రమదనిదానవిచిత్రత
తమబాలకకేళిచరితతతి నాఁచె శిశు
ద్యుమణి యుమాసాంబమనోఽ
బ్జములు మనోజ్ఞములు గావె? బాలక్రీడల్. 40

కం. అనుదితరదనము లగు నం
దనవదనము లాఱు స్వానసము లాతిటఁ జుం
బన మొనరించి రుమేశులు
ఘనతృష్ణ నొకొక్క టొక్కొకగా నానన్. 41

కం. తడఁబడు చొకకడ నొకకడఁ
దడఁ బడక వడంకు చొక్క దరి నొక్క యెడన్
వడఁకక రహి పెంచెను నె
న్నడబెడఁగుల బుడుత తా జననిజనకులకున్. 42

చ. వరభవనాంగణావనిని వావిరి నాడి ధరాపరాగధూ
సరతనుయష్టితోడ నొడిఁ జయ్యనఁ జేరి యహేతుహాసభా
సురవదనేందుఁడై నుడువుచున్ బలుమారు నలక్షితార్థమై
పరఁగు నదేదొ యా చిఱుతవానికిఁ గూరిచె భూరిహర్షమున్. 43

కం. పురహరతురంగపుంగవ
ఖరశృంగయుగంబు పట్టి గౌరీవహకే
సరి నఱిమి లీల భృంగి చి
దుర కొనసిగఁ దిగిచి వారి దుడుకఁ డలర్చెన్. 44

కం. మృదు నొడి నుండి యతఁడు మెడఁ
దొడు త్రాచుల పండు లొండు తొమ్మిది రెండేన్
బడిఁ బదియే దని యెన్ను ని
విడి శిశుమౌగ్ధ్యమున బడుత వివృతాననుఁడై. 45

కం. హరగళకపాలమాలా
స్ఫురదాననకుహరములను జొనుపుచు వ్రేళ్ళన్
ద్వరపడు రదములు చేకొన
గురుతరమౌక్తికము లంచుఁ గొమరుఁడు భ్రాంతిన్. 46

కం. శశిధరశిరస్సరిద్వర
శిశిరోర్ముల నీఁది యీఁది శిశువు తమి హిమా
తిశయజడస్వశయాబ్జము
భృశకుశలతఁ గ్రాఁచె భాలవీక్షణకీలిన్. 47

కం. లీల నొరగు మెడ నిడుచో
వాలిన జడముడిని వ్రేలు పశుపతి విలస
న్మౌళీందురుచిరఖండము
బాలుఁడు ముద్దిడియెఁ దడవు వాలిన వేడ్కన్. 48

ఉ. ఈ లలిఁ దత్కుమారమణి హృద్యతమాద్భుతబాల్యకేళి వృ
త్తాళివిలోకనామృతరసానుభవైకవశాంతరంగులై
శైలవరాత్మజాకనకశైలశరాసులు గు ర్తెఱుంగఁగాఁ
జాలక యుండి రెప్పుడు నిశాదివసం బనఁగా లవంబునున్. 49

[1] ధ్రువకోకిల
అమర నైకవిధం బపూర్వము నంద మింపును మోదసాం
ద్రమునునౌ శిశుకేళివృత్తమొనర్చు చాతఁడు మొల్కపా
యము[2] నకుంఠితబుద్ధియుం గని యందుచే సకలాగమా
స్త్రముల స్వామి యెఱింగె నంత నెసంగ షష్ఠదినంబునన్. 50





!!!!

తే.గీ. ఇది కుమారాప్తి నాఁ జను పదునొకడవ
సర్గమౌ కూచిమంచి వంశ్యమణి సోమ
సుందర కవీంద్ర వేంగమా నందనాగ్ర్య
సాంబశివకృ తాంధ్రకుమారసంభవకృతి. 3

---

1. దీనికే తరళమను పేరు ప్రసిద్ధము.
2. నకుంఠమనీష.
!!!! ఇక్కడఁగృతిపతి సంబోధనపరమగు నాశ్వాసాంతపద్యములేదు.

శ్రీః

# శ్రీమదాంధ్రకుమారసంభవము

## ద్వాదశాశ్వాసము

---

కం. శ్రీవిపులకూచిమంచిమ
హావంశపయోధిచంద్రదాత్మోజ్జ్వల! యా
శాసనవిశదీకరణయ
శోవిసరవిచికిల! సోమసుందరసుకలా! 1

కం. అవధారు! కాళిదాసబు
ధవరకృతకుమారభవకథాపూరకదే
వవచఃకావ్యానుసృతిన్
వివరింతుఁద్రిలింగసూక్తివితతిఁబయి కతన్. 2

కం. ఆ పయిఁ గ్రూరసురారికృ
తాపత్ ఖిన్నాత్ముఁ డింద్రుఁ డఖిలసురలతోఁ
బ్రాపించెఁ ద్రిపురహరునిఁ దృ
షోపప్లుతచాతకము పయోధరుని బలెన్. 1

కం. సమరనిశాటభయాతిశ
యమునఁ బొనుఁగుపడిన ఘనవిహరణసరణి నుం
డి మరుద్వర్యుఁ డుమేశాం
ఘ్రిమృదున్యాసాతిపూతగిరి నెట్లొ దిగెన్. 2

80



కం. మాతలి చేయూఁతిడఁ బురు
హూతుఁడు జీమూతరథము నొగి దిగి యట గో
కేతునికేతము దెసఁ జనె
బ్రాఁతిఁ దృషాతురుఁడు జలము వలని కటు శుచిన్. 3

కం. పటికపుఱామల నెలవుల
నిట నటఁ బ్రతిబింబతతుల యింపునఁ దన యె
క్కటిమెయిఁ బెక్కిటిగాఁ గను
చటఁ జని శంకరనిశాంత మాతఁడు చేరెన్. 4

మ. స్ఫురితాంచద్బహువర్ణరత్నరచనాపుంజోల్లసల్లోకభీ
కరచామీకరదండమండితకరోగ్రస్థేమనందీశగు
ప్తరసాస్యందను సౌధచత్వరవరద్వారోర్వరన్ నిల్పె నా
స్వరధీశుండు సుమాంబకద్విషదనుజ్ఞానప్రతీక్షార్థియై. 5

కం. నంది పురందరు నట గ్ర
న్నం దఱిసి యలర్చి మన్ననం జని తానే
కుందనపుబెత్త మిడి మడి
సందిం దగ మందలించె జగదధిపతికిన్. 6

కం. కనుబొమ్మ సన్న నావిభుఁ
డనుమతి యిడ ననిమిషేంద్రు నమరులతో శం
భుని మేలు నగరిలోనికిఁ
బొన రొందఁగ నంది నడిపె ముందరగుచుఁ దోన్. 7

శా. నైకాకారవపుర్ధరుల్ గురుతముల్ భృంగీశచండాద్యసం
ఖ్యాకుల్ పారిషదర్షభుల్ గొలువఁ ద న్నత్యర్ఘ్యనానామణీ
వ్యాకీర్ణాయతసంసదాయతనమం దాసీనుఁడై యున్న వి
శ్వైకైశ్వర్యధురంధరున్ హరు సహస్రాక్షుండు వీక్షించెఁ దాన్. 8

తే.గీ. లసదహీనఫణాహీనలలితమణిగ
ణాంశుభాసుర మున్నద్ధ మతులితోన్న
తము నగు కపర్దమును దాల్చి ధాతుదీప్త
కనకనగశృంగసామ్యంబుఁ గనెడు వాని. 9

శా. రంగత్తుంగతరంగకాంగసమితిన్ రాజజ్జటాజూటస
ద్రంగం బెక్కి నటించు చార్యను సుతోత్సంగన్ శరన్నీరదా

భంగస్వచ్ఛతమాత్మఫేనరుచి రేవన్ నవ్వు నట్లున్న స్వ
ర్గంగం బూనెడు వాని నెయ్య మెసఁగంగన్ స్తోత్రమాంగంబునన్

ච. అమరసరిచ్చలోర్మినివహాత్మతనుప్రతిబింబపంక్తిచే
నమలవలత్తుషారనికరాభశరీరసహస్రశాలి య
ట్లమరు హిమాంశుఁ దాల్చి శిర మందు గళన్మిహికాఘనౌఘపూ
గముల ధరించి మించు వలిగట్టు వలెన్ విలసిల్లు నాతనిన్. 11

కం. కసిమసఁగు దీప్తి నిందుది
వసకరదృగ్యుగముఁ గ్రిందు పఱచుచు మదనున్
వెస నేర్చిన విలయవిభా
వసునయనము నొసటఁ దాల్చి భాసిలు వానిన్. 12

కం. బహుమూల్యమణిగణాంచిత
బహుదూరపరిస్ఫురత్ప్రభామండలధూ
ర్వహకుండలమిషశబ్ద
గ్రహసంశ్రితమిహిరతుహినకరుఁ డగు వానిన్. 13

కం. బలు నీలపురా ల్చెక్కిన
వలిగుబ్బలిమిన్న కన్నె ప్రన్నని కంటెన్
బులుపునకుఁ దాల్చెఁ దాననఁ
గలియఁ బొలయు కప్పు జిగి నెగడు మెడ వానిన్. 14

కం. కాలావలీఢతనుభృ
త్పాళిచితాభసితవిశదతమతను ఘనశుం
డాలాయతాజినాంబరుఁ
గాలాబ్దోద్వాహిహిమనగశ్రీరుచిరున్. 15

ఆ.వె. వనజయోనిఘనకపాలభాజనపాణి
మురహరాదివిబుధపూజితాంఘ్రి
మనుజకుల్యఖండమండను భండనా
భీలసూన్నతత్రిశూలధారి. 16

చ. వరమకుటేందునిర్గళదపారసుధారసపూరసేకస
త్వరపరిలబ్ధజీవవిభవప్రభవప్రతిపత్తిసంపదన్
మరలఁగ వేదపాఠపటిమన్ గని మించెడు నంచమావుదే
వర తొలిపున్కపేరు నిజబంధురకంధరఁ బూను జాణనిన్. 17

81



కం. నవకనకలతాకనదవ
యవ శైలజ నునిచి హోళి నాత్మాంకమునన్
సువిరాజద్విద్యుద్ద్యుతి
దవు భాసురశారదాంబుదముఁ బో ల్మానిన్. 18

కం. సమదాంధకాసుహర మసు
రమణివధూవిధవతాకర మనన్యగ్రా
హ్యము నగు నజగవమూను న
సమవీరుఁ బురాసలీలసంహృతమారున్. 19

ఆ.వె. కాంచనాంఘ్రిపీఠ మంచ నుంచ రహించు
కనదనర్ఘ్యమణిరచనవిచిత్ర
సింహపీఠిఁ జందు జిగి తెలి సురటీల
గణయుగంబు వీవఁ గ్రాలు వాని. 20

కం. శరశస్త్రాభ్యాసకళై
కరతు సమాగతసచిత్రగణసందృష్టున్
సురమూర్తిధరస్ఫాటిక
ధరనీరాజితుని సుతు ముదమునఁ గను గురున్. 21

కం. ఆ కరణి వఱలు గిరితన
యాకాంతునిఁ గని శచీమనోऽధీశుం డ
త్యాకులపడె నిముసము గా
దాకుల మెవని మది గని మహాధామనిధిన్? 22

కం. అమరాగ్రణి హరు వికసత్
కమలవనీకామనీయకనిజాక్షి సహ
స్రమునఁ గని పులక లొలసి కు
సుమవిసరాకులరసాలసుషమ విలసిలెన్. 23

కం. కని యీశు నమరపతి వే
గనులను గృతకృత్యుఁ డయ్యెఁ గర మటఁ దత్ప్రీ
తినిఖిలనిజావయవభవ
ఘనవికృతిస్వసతి కసహనకర మని వగచెన్. 24

కం. శరశస్త్రధారుఁ జామీ
కరవరగిరిసారు హరనికటభూచారున్

గిరిశకుమారు నటన్ గని
ధరశాసనుఁ దరిజిగీషఁ దాల్చె మనీషన్. 25

కం. అరుదెంచి యచట కట బం
గరుబెత్తము కక్ష నుంచి ఘటితాంజలియై
వరగణము లందఱకు ముం
దరఁ బరముని కృపకుఁ బాత్రతనుగను వేడ్కన్. 26

కం. వాకొనె నంది హరున్ శ్రీ
శ్రీకంఠా! నీకు జోక సేయఁగ దఱికై
నాకపతి వేఁచువాఁ డిదె
వే కృప వేగంటిఁ గాంచవే ముక్కంటీ! 27

కం. కరుణించె నమరసేవ్య న
మరపతినిన్ మున్ ద్రిలోకమహితుఁడు త్రిపురా
సురవిమతుఁ డట నవామృత
భరధారలు గురియు కరణి వఱలెడు చూడ్కిన్. 28

తే.గీ. భూరిమకుటాగ్రవిగళితపారిజాత
సుమసముదయాతిసుషమశీర్షమున మించి
తెలచె నాకైకవంద్యుఁడు దేవతేంద్రుఁ
డల త్రిలోకైకవంద్య దేవాధిదేవు. 29

కం. నైకజగదేకవంద్యుఁ బి
నాకధరున్ భక్తి మ్రొక్కి నాకేశ్వరుఁ డ
ప్రాకృతకృతిత్వసంపత్
సాకల్యపవిత్రపాత్రసత్తమతఁ గనెన్. 30

కం. సురగణము లవల భవునకు
వరుసఁ దెలచెఁ జరణపీఠపరిసరధరణిన్
బురహరగణబృందము ముం
దర బంధురభక్తినమ్రతరశిరములతోన్. 31

కం. నిరతి గణానీతం బగు
పరమశుభస్వర్ణపీఠి భవు ముదలఁ బురం
దరుఁ డెదురఁ గూరుచుండి య
లరె నెవనికి ముదము పాటిలదు? దొరమాల్మిన్. 32



కం. చిఱునగవు తోడి చూడ్కిన్
గరువములోగి తేని చేతఁ గని పెరసుర లె
ల్లరుఁ గరమలరుచుఁ గూర్చుం
డిరి తమపైఁ దత్కటాక్షనికరము పరవన్. 33

కం. మరుదరికృతావమతులను
విరుచులఁ గ్లాంతాననముల విహితాంజలులన్
హరిముఖసురవిసరమ్ముల
హరుఁ డట గని యనె దయారసార్ద్రహృదయుఁడై. 34

ఆ.వె. అమితశౌర్యధుర్యులై వీరహస్తైక
సముచితాయుధప్రచండు లైన
యమరులార! యేమి హిమవాఃకణక్లామ్య
దబ్జగతిభవన్ముఖాళి సోలె? 35

కం. మీ సుకృతరాసు లక్షయ
మై సెలఁగ నెటయ్యె నయ్య నాకచ్యుతి మీ
కోసుర లిఁక విడువకుఁడీ
భాసురచిరధృతనిజాధిపత్యపదంబున్. 36

కం. మానితసుమనోభువనము
మాని యిలన్ మలయ నేల? మానవసామ్యం
బూని యనూనమహిములౌ
మానధనుల్ మీరు నాకమందిరులారా! 37

కం. ఇతరదురాపరచనసా
ధితమతిరుచిరము మహాత్రిదివ మెటుల హతా
ద్గత మయ్యె మిమ్ము విడిచి దు
రితహతి సుచిరార్జితము సుకృతము చెడు గతిన్. 38

ఆ.వె. ఎడసె మీ హృది నది యెట్లు తాదృగహార్య
ధైర్య మార్యదివిజవర్యులార!
గ్రీష్మభీష్మదుర్భరోష్మాదివశమున
హ్రదపదంబు వదలు నుదక మట్లు. 39

కం. సురలార! బలారిపుర
స్సరులై యిట కార్తి మీరు సనుదెంచితి రె

ల్లరుఁ గూడి జగత్త్రయజి
త్వరతారకపరమదైత్యు పగనో చెపుఁడా! 40

కం. ఆ పరదితిసుతుచే మీ
ప్రాపించు పరాభవంబు వాప మదన్యుం
డోపఁడు వనులకు దవదా
హోపచ్ఛమ మమలజలధరాన్యసుకరమే? 41

కం. అని స్మరహరుఁ డన ఘనవా
హనముఖదేవతలు మరల నసుధరులయి వే
ఘనమోదాశ్రుతరంగస
దనదానన కమలసమితిఁ దాలిచిరి సిరుల్. 42

కం. మృదు నుడువులు ముగిసిన వెం
బడి నటఁ దటి దొరకి వజ్రి పలుకఁ దొడఁగె నే
యెడ నదనున నుడువు నుడుల్
వడి ఫలభరితాభ్యుదయ మవశ్యము గూర్చున్. 43

కం. భూతము భవంతి భావి యె
దై తగు నది యెల్లఁ దెలియుదఖిలజ్ఞాతా!
ధూతాతతతమ మచ్యుత
మౌ తావకబోధమయమహాదీపవిభన్. 44

కం. దుర్వారదుర్విషహతమ
దోర్వీర్యుఁడు తారకసురదుర్వృదుఁడే తా
స్వర్విభుఁడై మము దివి విడి
పర్విడ నడఁచిన దెఱుంగవా? చెపు మధిపా! 45

కం. అతఁ దజకటాక్షలబ్ధా
క్షతవరుఁ డయి త్రిభువనజయచండభుజాదం
డత వెస నెసఁగి మదాద్యా
దితిజుల నందఱను గొనఁడు తృణమున కైనన్. 46

కం. స్తుతిచే మును బ్రార్థితుఁ డయి
శతధృతి మా వలనఁ గని ప్రసన్నత పురహృత్
సుతుఁ డాయతి నయి పృతనా
పతి యీ దితిసుతుని సమితిఁ బరిమార్చు ననెన్. 47





చ. అది మొద లంతరంగమున నంగద యిందనుకన్ సహించిరీ
త్రిదివనివాసు లోవసుమతీధరకార్ముక! తన్నిశాటరా
డుదితపరాభవాప్తియు హృదుత్కటశల్యవదత్యసహ్యమౌ
తదమితదుష్టశిష్టిపరతంత్రనిజాతినికృష్టవృత్తియున్. 48

కం. ఘనతపతపనాతపతా
పనతాంతౌషధులకు నవవనదునటు సునం
దను నీ నందను నీతనిఁ
బనుపు చమూపతిగ నీవ స్వయముగ దేవా! 49

కం. వదలుచునీ మా కితఁడెద
నదవద కదనాగ్రయాయి యయి త్రిజగచ్ఛ్రీ
హృదయైకశల్య మగు నా
త్రిదశాహితగురుతరువుఁ బెరికి వే ళ్ళగలన్. 50

కం. దురమునఁ జౌర నరుగుచు ముం
దర నీమా కితఁడు గుతిలఁ దలఁగ ద్రిలోకీం
దిర హృది నెక్కటి శల్యము
సురరిపువరకుతరు వగలుచు సమూలముగన్. 51

కం. నెర దురమునఁ యీ సుతు
ఖరతరశస్త్రములఁ గుత్తుకలు దెగిన మహా
సురవరుల సతుల యేడ్పులఁ
బురహర! యీ దిశలు పదియు మొరసెడుఁ గాతన్. 52

కం. గోరపు టని నీ కొడుకీ
తారకుఁ బిశితాశజంతుతతి కోరెముగా
మారుపఁ గారాస్థితనిజ
భీరుల జడ లీసురాళి విప్పెడుఁ గాతన్. 53

కం. పురుహూతుఁ డిటు వచింపఁగఁ
బొరి ననె భూతపతి యసురపుని దుశ్చేష్టా
నిరతి కమర్షభరము ని
ర్జరనికరము పైని గనికరముఁ గదుర మదిన్. 54

కం. ఒహోహో! నా నుడి వినుఁడీ
యహిహోద్యాదిత్యసముదయములు సతనయో

ద్వహముఖ మీశివదేవుఁడు
బహుసిద్ధత నడరుఁ జుఁడి భవద్ధితవిధులన్. 55

కం. మును నే నియతాత్ముఁడ న
య్యును నీగిరివరకుమారి నుపయమమునఁ జే
కొనినది తజ్జనివిక్రాం
తునిచేఁ గాకి యరాతి తునియఁ దని గదా! 56

కం. అది గావున నీయక్కఱ
కొదవిన యీ కొమరు దణియు నొనరిచి యీమీ
రొదలుచుఁ బగతుర గెలువుఁడు
త్రిదివము పొరి నేలు నీహరి సురావళితోన్. 57

మాలిని:
అని యిటు భగవంతుండౌ శివుం డాత్మసూనున్
ఘనభయదరణోదగ్రక్షణౌత్సుక్యసంపూ
ర్ణుని నిరుపమహర్షన్ జూచి తాఁబల్కె వత్సా!
యని మొన రిపుఘాతిఖ్యాతిఁ గైకొమ్ము వేగన్. 58

రథోద్ధతము :
ఆనతాత్మశిరమం దల సూనుం
డానె నైజగురు నాన యిదేగా
వైనమౌ జనకభక్తిపరాత్మా
హీనధర్మమున కెల్ల వితాలన్. 59

ఉత్సాహ :
ఆ విధమున దైత్యు తోడ నాహవంబు సేయు మం
చా విబుధవరుండు శంభుఁ డాకుమారుతో ననెన్
గ్రావతనయ యలరె సుతుపరాక్రమర్ధికిన్ రహిన్
భావమం దెవర్తు వీరమాత గాంచకుండెడిన్? 60

[1]ధ్రువకోకిల :
హరిహయుండు పరాక్రమోన్నతు నంధకారిసుతున్ మహ
త్తరబలాఢ్యుఁ బలాశిరాడ్వనితాదృగంజనభంజనున్
సరసిజాండభయాపహున్ గొని సత్వరం బలరెన్ గడున్
బర ముదున్మదుఁ డేఁడుగాఁ దభివాంచితార్థము సేకుఱన్. 61



!!!

తే.గీ. ఇది గుహబలాధిపత్యాప్తి హృద్యసర్గ
మంచితద్వాదశము కూచిమంచి సోమ
సుందర కవీంద్ర వేంగమా నందనాగ్ర్య
సాంబశివకృ తాంధ్రకుమారసంభవకృతి. 62

---

[1] ఇది తరళ మని ప్రసిద్ధము

!!! ఇక్కడఁ గృతిపతిసంబోధనపరపద్యములు లేవు.

శ్రీః

# శ్రీమదాంధ్రకుమారసంభవము

## త్రయోదశాశ్వాసము

---

కం. తరువాత జైత్రయాత్రకు
నురవగు హరువైన వేస మూని కుమారుం
డెరఁగె జగత్త్రయపరివృఢు
చరణములకు సురగణము లెసఁగఁ దన వెంటన్. 1

ఉ. మ్రొక్కిన యక్కుమారు తల మూర్కొని వీరమణీ! సుతాగ్రణీ!
గ్రక్కున నుక్కడంచి యని రక్కసు నిర్జరరాట్పదంబు స
మ్యక్కుగ నిశ్చలంపఁజవుమా యని దీవనతోడఁ గూడఁ బె
న్మక్కువ నందివాహుఁ డభినందితుఁ జేసె స్వనందనేందునిన్. 2

ఆ.వె. శిరము కరము వంచి చేసె నమ్రతతో ని
జాంబ యడుగుదోయి కతఁడు వినతి
వఱలె వీరరాజ్యపట్టాభిషేకమై
యతని కామె సమ్మదాశ్రుదృష్టి. 3





చ. అగసుత పుత్త్రవత్సల ప్రియంబునఁ గూర్చి నిజాత్మజాగ్రణిన్
బిగి కవుఁగింట నంకతలపీఠిక నుంచి తదుత్తమాంగ మి
మ్ముగఁ దనివార మూరుకొని ముద్దుఁగుమారక! సంగరోర్వరన్
బగఁ దెగటార్చి సార్థక మొనర్పుమ మామకవీరసూత్వమున్. 4

శా. భీమోద్దామనిశాచరాధిపవిపద్భీజప్రకాండుండు సం
గ్రామోద్యన్మహభానుభావశమనఃకంజాతుఁ డాపుత్త్రసు
త్రామాత్ముం డట వీడుకోల్గొని శివద్వంద్వంబుచే భక్తిమై
శ్రీ మీఱన్ దివిజాధినాథు నగరిన్ జేరన్ బయల్దేఱెఁ దాన్. 5

కం. ఆవల మఘవముఖాఖిల
దైవతవీరులును దుహినధరదుహితృమహా
దేవులకుఁ దెలచి వలగొని
యా వీరాగ్రసరు వెనుక నరిగిరి కడఁకన్. 6

చ. స్ఫురదతిలోకకాంతిపరిశోభితమండలు లొప్పన ట్లటన్
దొరఁ జను తత్సమస్తసుమనోనికరంబులచేఁ గరంబు దం
బరము వహించె నంబరము భవ్యదివావసరంబునందె ని
ర్భరరుచి మీఱు తార విసరంబుల నెల్లెడ నిండి నట్లుగాన్. 7

కం. అరిగెడు నమరుల లోపల
విరాజిలెఁ గుమారుఁ డధికవిస్ఫురణమనో
హరుఁ డయి గ్రహర్క్షతారో
త్కరములతో దివి నడుమ సుధాకరుఁడు బలెన్. 8

కం. ఆ మఘవప్రముఖు లుమా
సోమకళాచూళికాత్మజునితో నటపై
వ్యోమాధ్వముఁ గడచి నిజ
ప్రేమాస్పదజగము చేరిరి ముహూర్తములోన్. 9

కం. కడిఁది యసుర భీతికి లోఁ
బడి కడు తడవునకుఁ గనిన స్వర్గమా వెం
బడినె చొఱంబడ నేరక
తడసిరి క్షణమాత్రమా త్రిదశు లంద అటన్. 10

కం. త్వర వెఱచి సురలు దివిఁ జొఱఁ
బొరిఁ దమలోఁ దగవు పడిరి మును జనుమీ నే

నరుగను ముందరఁగఁ బుర
స్సరుఁ డీ వేఁగాను నగ్రసరుఁడ నటంచున్. 11

కం. అమరపురాలోకభవ
ప్రమదశుచిస్మేరనయనవనజులు వారల్
విమతభయచలాంచలదృగ్
భ్రమరి నిలిపి రలరు గుహు మొగము విరిదమ్మిన్. 12

కం. సమరామితవిక్రముఁ డా
కొమరుఁడు మును జనుచు సురలకుం బలికె సలీ
లమృదుస్మితయుతముఖచం
ద్రముఁ డయి యౌత్సుక్యపడుచుఁ దారకుఁ దాఁకన్. 13

ఆ.వె. వెఱపు చాలు నిపుడు చొఱుఁడీ సురలు మీరు
త్రిదివ మిపుడె రిపుఁడు దితిజవరుఁడు
మీకు దృష్టపూర్వుఁడే కద పడనిం డ
తని మదీయదృక్పథమున నిందె. 14

మ. అమృతాంధోజగదిందిరాచికురపక్షాకర్షరంగత్ప్రచం
డ మదే! వీరుని బాహుమండలము తన్మత్తారిహృత్కంజర
క్తమరంద్రద్రుతపానలీల నెరపున్ గా కిందె ఝుంకారపూ
ర్ణమహోర్వీధరకందరంబు లివి మన్నాళీకరోలంబముల్. 15

ఆ.వె. అవిహతప్రచార మలఘుపాటవసార
మతిమహఃప్రసాద మగు మదేత
దతులశక్తి ముద మిడుత మీకు ద్యోరమా
పత్కరారి శిరము పరఁగఁ దఱిగి. 16

కం. అని దనుజవధోత్సుకమతి
యనలనయనతనయుఁ దనిన యా నుడి నమృతా
శననికర మలరె సకలము
తనుహాసవిశదవదనదళదంబుజమై. 17

కం. ఉరుసమ్మదభవపులకవి
సరపరికృతగాత్రుఁ డఖిలసంహననవిక
స్వరదశశతనేత్రుఁడు హరి
యరితోఁ బయి యొలెల మార్చె నమరఁ గొమరుతోన్. 18





తే.గీ. ఘనముదశ్రుతరంగితాక్షము నురుప్ర
శాంతమును నైన ముఖచతుష్టయము చేత
నాదివృద్ధుఁడు ధాత షడాస్య మోము
లాఱు ముద్దాడె నక్కజమార నవల. 19

కం. పురహరసుతు గుహుని నుతిం
చిరి విద్యాధరహయాస్యసిద్ధప్రవరుల్
పొరి మేల్మేలను చలరిం
చిరి రహి జయ!వీర! యని వచించుచు మ్రోలన్. 20

కం. అరి గెలువ నరుగుచున్న కొ
మరుఁ బొగడుచు నారదాద్యమరఋషు లట నా
దొర పైఁడి పై యొలెలతోఁ
దరితీపున మార్చి రంత తమ వల్కలముల్. 21

కం. అమరు లల శక్తిధరు సా
యమున భయము విడిచి తొడరి రట దివిఁ జొఱఁగా
నమితబలయూథపతి యం
డ మహిన్ వేదండఘట యటవిఁ జొచ్చు నటుల్. 22

కం. వాసవవైరిజిఘాంసు మ
హాసేనుని చరమభాగ మమరులు విడి య
గ్రేసరు లైరి త్రిపురదహ
నాసక్తహరాగ్రగాము లైనటు ప్రమథుల్. 23

కం. మును మున్ను చేరి రనిమిషు
లనిశసలిలకేళిలోలుపామరవనితా
జనతాంగరాగధావన
జనితపిశంగోత్తరంగ స్వఃపదగంగన్. 24

కం. అంభఃక్రీడారతది
క్కుంభికరాహతిసముత్థగురుతరభంగో
జ్జృంభముహుఃప్లుతనిజతట
సంభవసాలాలవాలజాలన్ శ్రీలన్. 25

కం. అనుపమకేళీరసలస
దనమిషకన్యావినిర్మితాంచన్మణిశో

భనగర్భకనకసికతా
కనదురుసముద్రగ్రవేదికావ్యాప్తతటన్. 26

మ. సరసామోదభరాతిలోలమధులిట్సంగీతమౌఖర్యబం
ధురమై హేమమరాళిపాళిరమణాధూతంబునౌ సద్విక
స్వరభర్మాంబురుహాళిఁ దచ్చ్యుతరజఃపాళిన్ నితాంతంబుఁ బిం
జరమై రంజిలు వారిపూరసుకలాసం బూను శోభానిధిన్. 27

కం. కుతుకమునన్ గన నరుదెం
చి తటోర్వుల నిల్చినిజరుచిరవీచితతిన్
బ్రతిబింబిత లగు వేలుపు
టతివలచేఁ బాంథపంక్తి నలరుచు దానిన్. 28

కం. చిరదృష్ట యైన యా ని
ర్జరధునిఁ గని వేగ నలరి శక్రుఁడు దానిన్
హరగిరిజాత్మజునకు ము
న్నరుగుచుఁ గనఁబఱచె నాదరాయత్తమతిన్. 29

కం. ఆ కార్తికేయుఁ డఖిలది
వౌకఃపరివీతుఁ డగుచు నపురాదృష్టన్
నాకనదిన్ ముందరఁ గని
వే కర మబ్రపడి స్మేరవీక్షణుఁ డయ్యెన్. 30

కం. అమరస్తుతనా నది నటఁ
గౌమరుఁ డొలసి భక్తినిరతిఁ గోటీరశిఖా
గమితాంజలియై పొగడుచు
నమితానందమున మ్రొక్కె నవనతశిరుఁడై. 31

కం. నవు నళినపాళి నార్చుచుఁ
గవుఁగిటఁ గూర్చుచు మహోర్మికలఁ బొసఁగ ధునీ
పవనుఁడు గుహుఁ గొలిచెను మును
బ్రవిమలతద్గంధఘర్మవారిహరుండై. 32

---

మ. అమలామోదవశాళిగానముఖరంబై చారుచామీకరీ
యమరాళావళికేళికాతిచలితంబౌ ప్రస్ఫుటచ్ఛాతకుం
భమయాబ్జాళిని దత్పరిచ్యుతరజఃపాళిన్ గడుం బచ్చనై
రమణీయం బగు వారిపూర మనువారం దాల్చు శోభానిధిన్. 27
పాఠాన్తరము.





కం. చను చతనుహరసుతుఁడు గని
యెను మును విచ్ఛిన్నభిన్నకృతమూలోత్పా
టన విటపిస్తోమము నం
దననామము బలభిదుపవనలలామ మటన్. 33

కం. బలసూదనవన మిది యిటు
వలె సురరిపు చేతఁ గీడువడి సిరి యుడిగెన్
లలి నని కసిఁ గెంపగు చూ
పులతో భ్రూకుటిదురీక్షముఖుఁ డతఁ డయ్యెన్. 34

కం. కనె నతఁడు కృత్తలీలా
వనము సుదుశ్చరవిమానపథ మతివిధ్వం
సనగమితరాజగృహగణ
మనూనవిశ్వైకసార మమరనగరమున్. 35

కం. ప్రతిరోధివరవిమానిత
గతరమ సర్వత్రదైన్యకలుషదశాసం
గత యయి పతిసుతరహితసు
దతిఁ బోల్ దివిఁ జూచి మది నతఁడు గడు వగచెన్. 36

ఉ. ఆ వగ నున్న దాని నఖిలామరపాలకరాజధాని నా
పావకసూతి గాంచి సురవైరికుచేష్టకు రోషకీలియున్
దైవతవాసదుర్దశకుఁ దద్దయు జాలియు సంగరంబుపై
వావిరి హాళియున్ మదిని బైకొనఁ జొచ్చె సుపర్వయుక్తుఁడై. 37

తే.గీ. దితిసుతమదమదావళతతిరదహతి
చూర్ణసాత్కృతమధ్య ముదీర్ణభుజగ
కంచుకావృతజాలకోత్కరము స్ఫటిక
హర్మ్యచయ మందుఁ గనఁగానె యతఁడు కుందె. 38

మ. ఘనదిఙ్నాగమదావిలాంబులు సముత్ఖాతాచ్ఛహేమాబ్జముల్
కనకశ్వేతగరుచ్ఛయోజ్ఝితములున్ భగ్నోరువైదూర్యశో
భనసోపానము లంకురన్నవతృణవ్రాతంబులౌ తద్విలా
సనిశాంతాంచితదీర్ఘికల్ గనుచు నాశర్వాత్మజుం డాత్మలో. 39

కం. దుర్వారగర్వతిమిరా
ఖర్వాంధారాతిహేతుకంబైన మహా

దుర్విషహవిషమశకునా
నిర్వాచ్యాశ్చర్యశోకనిఘ్నుతఁ గనియెన్. 40

తే.గీ. మును సనుచు గుహు వృష తెచ్చె దనుజదంతి
దంతహతహేమకుడ్యము తంతువాయ
తంతుతతిపిహితమణీవితాన మైన
వైజయంత్యాఖ్యనిజహర్మ్యరాజమునకు. 41

కం. దివిషత్పతి సృతిఁ దెల్పఁగ
దివిభవు లందఱును నరుగుదేరఁగ వెంటన్
బ్రవిగళితవివిధమణిఘృణి
యవు సోపానాధ్వ మెనయు నానగ రేగెన్. 42

తే.గీ. సహజకల్పద్రుతోరణస్రజము పారి
జాతసుమమాలికాఢ్యము స్వర్మునీంద్ర
తతికృతస్వస్త్యయనము నంతఃప్రవిష్ట
సుందరీబృందమా మేడఁ జొచ్చె నతఁడు. 43

కం. అమరాసురకులమున కా
దిమవృద్ధుఁడు కశ్యపర్షి దివ్యాంఘ్రుల కా
కొమరుఁడు వలగొని ప్రణమిలె
నమర శిరము లాఱు వంచి సాంజలి యగుచున్. 44

కం. తెలచె నట యుమకుమారుం
డల మునిసతి దేవజనని యదితిపురంధ్రీ
తిలకము జగదేకార్చ్యా
మలపదముల కొనర భక్తిమహిమానతుఁడై. 45

తే.గీ. అల్ల కాశ్యపమునియునా యమరమాత
వర్ధిలఁగఁ జేసిరా చమూపతి నిరువురు
తారకు ననేకలోకజిద్ఘోరవీర్యు
నని నతఁడు గెల్వఁ జాలు దీవన లొసంగి. 46

కం. అతనిఁ గన రాఁగ శుభదే
వత లదితిశ్రితలు వారి పదముల కతఁడున్
నతి సేయఁగనా పతిదే
వత లలరిచి రతని మరల బలుదీవనలన్. 47



కం. అతనువిమతసుతుఁడు పులో
మతనయ సుమనోఽధిభూరమణి శచికి నమ
స్కృతి యట సల్పఁగనా గుణ
వతి యాశీరుక్తి నతని వర్ధిలఁ జేసెన్. 48

కం. ఘనమోదలు కశ్యపసతు
లనఘాత్మలు సప్తమాత లటఁ గూడి రహిన్
మును దీవన లిడి రతిభ
క్తిని డాకొని తమకు మ్రొక్కు గిరిశసుతునికిన్. 49

కం. ఘనవాహోద్యఖిలసుధా
శను లట రహిఁ గూడి సర్వసైన్యపతిత్వం
బున కభిషేకించిరి ప్రే
మను మోదతరంగితాత్మమానసు నతనిన్. 50

తరళము :
సకలనిర్జరవీరసత్తమసైన్యసంచయపాలనా
ప్రకటదుర్ధరుఁడౌ నపారపరాక్రమక్రమశాలి త్ర్యం
బకకుమారుని చేత సర్వసుపర్వలోక మశోకమై
యకృతకాజ్యవకాశవైరిజయాశలం గనెఁ గ్రమ్మఱన్. 51

తే.గీ. ఇది గుహ బలేశతాభిషేకేద్ధసర్గ
మణి త్రయోదశ మగుఁ గూచిమంచి సోమ
సుందర కవీంద్ర వేంగమా నందనాగ్ర్య
సాంబశివకృ తాంధ్రకుమారసంభవకృతి.

---

శ్రీః

# శ్రీమదాంధ్రకుమారసంభవము

## చతుర్దశాశ్వాసము

---

కం. సమరోత్సుకుఁ డరివిజిగీ
షమనీషం దంధకారిసుతుఁ డెసకొల్పన్
సమకట్టిరి తారకసం
జ్ఞ మహాసురు నహితు వెసఁ దునుమ బలిమి సురల్. 1

కం. ధృతశక్తిచాపుఁడై యతఁ
డతిమానసజవ మవార్య మతిదుష్ప్రేక్ష్యం
బతులజయశ్రీప్రద మ
ప్రతిఘనము విజిత్వరాఖ్యరథ మపు డెక్కెన్. 2

తే.గీ. ఆతనికిఁ బట్టెఁ ద్రిదశాలయాపదబ్ధి
తారణం బసురసంపదుత్సారణంబు
ఘోరవీరారిమారణకారణంబు
హారిహైమోష్ణవారణం బమరుఁ డొకఁడు 3

చ. శరదృతువిస్ఫురద్రుచిరచంద్రమయూఖచయాభచారుచా
మరవరవీజ్యమానుఁ డగు మారవిరోధికుమారు నిష్టసం
గరుని నెలుంగు లెత్తి యెసఁగన్ నుతియించిరి సారె కగ్రత
స్సరు లయి సిద్ధకింపురుషచారణవీరు లుదారభారతిన్. 4





మ. చనెనా క్రౌంచవిదారి వెంబడిని బ్రస్థానాగ్ర్యవేళార్వశో
భననైపథ్యము దాల్చి క్రూరమహిభృత్పక్షచ్ఛిదాదక్షతా
ఖని ఘోరాశనిఁ బాణిఁ బూని స్ఫటికక్ష్మాభృత్సగర్భ్యన్నభో
ఘనవేదండవరంబు నెక్కి బలరక్షః శిక్షణం దాదటన్. 5

కం. వెనుకొనె రిపుపైఁ గనలున
ననలుఁడు గడు దీప్తుఁ డగుచు నగశృంగనిభం
బును బొగరుఁ దొగరు నెక్కుచు
ఘనహేతిమయోగ్రహేతికరుఁ డగు చతనిన్. 6

కం. వెనుక మఘవనీలాగా
తను భీకరతనువు శృంగదళితమహాజీ
వనధర ముద్ధుర మగు దుం
త నెక్కి గుదియఁ గొని రహి నతని జముఁ డెయిదెన్. 7

కం. అతిమదమత్తప్రేతా
స్థితుఁ డయి నైరృతుఁడు ఘనదితిజవైరభర
ప్రతిఘోగ్రుఁ డగుచు వెనుకొనె
నతులాంధకహరతనయు భయదసమితి కటన్. 8

కం. హరితనయు నతని వెనుకొనె
వరుణుఁ డని కవార్యపాశపాణి యయి నవా
బ్ధరభీకరదర్శనఘన
తరమకరారూఢుఁ డయి ప్రధనశౌర్యరమన్. 9

తే.గీ. క్షణహరిద్వ్యోమలంఘనచంగము నని
వారణవిహంగమక్రమాభంగము నగు
ఘనకురంగము నెక్కి వే యనిలుఁ డెయిదె
సంగరక్రీడరతి భూశతాంగతనయు. 10

కం. అరిజనరుధిరపిపాసిత
పురుగద ఘనవాహనుండు పూని మహాసం
గరశరధిప్లవనోద్ధుర
తరమతిజిగమిషుఁ బురారితనయు వెనుకొనెన్. 11

చ. అరిగిరి రుద్రు లాజికిఁ బురారిసుతానుగులై యటన్ ఫణా
ధరవరసూత్రనద్ధసముదారజటాభరణుల్ హిమాద్రిసో

దరవృషరాజవాహను లుదగ్రపినాకకరుల్ సముజ్జ్వలత్
పరవశితత్రిశూలనిరపాయబలోగ్రకృపాణపాణులై. 12

కం. ఇతరసురతతులు నెయిదెను
నతని మహాహవమహఃప్రియత నాయతమై
యతిబలనిజయానాధి
ష్ఠిత మయి ముద్వికచముఖకుశేశయరమతో. 13

సీ. సముదగ్రతరకనచ్చామీకరధ్వజ
వరదండకాండాతిబంధురములు
మహితనానావర్ణమండలోజ్జ్వలరంగ
దాతపత్రౌఘనిరంతరములు
ప్రసరద్ఘనశతాంగభైరవారవపూర్ణ
ఘనకులక్ష్మాధరకందరములు
నాగేంద్ర ఘంటా నినదచండఘీంకృతి
వ్యాలీఢసకలదిశాంతరములు

తే.గీ. దీప్రశస్త్రాంశువలయదేదీప్యమాన
సాంగదిక్చక్రదివిషత్పథాంతరములు
సురమహాసైన్యనికరముల్ శరధిశరధి
తనయవరుఁ డట తన వెంటఁ గొనుచుఁ జనియె. 14,15

కం. ఉఱుకుచుఁ గోలాహలమున
నరుగు సురల పెను మొనల ఘనాలఘుకేతుల్
నెరపె నిరుచ్ఛ్వాసనిరం
తరముల దిక్చక్రయుతఖతలభూతలముల్. 16

తే.గీ. మొరయు పటహసమూహము నెరపె నట ని
లింపరిపుసంపదబలాప్రకంపకార
ణముల దిఙ్మండలప్రతినాదమేదు
రముల గ్రస్తాఖిలాంబరారవభరములు. 17

చ. అమరవరూథినీసముదితాలఘు ధూళికులాకులాంతరి
క్షము దగె మథ్యమాన ఘటసాగర ఘోరరవావధీరణ
క్షమ మయి క్షోణిభృద్దమనశత్రుసతీజనగర్భపాతనో
గ్ర మగు మహానకప్రతివిరావతతిన్ మొఱవెట్టు నట్లుగన్. 18





చ. గురురథఘట్టనన్ నలిగి ఘోటఖురాహతిచూర్ణమై మద
ద్విరదవరేణ్యకర్ణతతిఁ బెల్లుగ నెల్లెడఁ గ్రమ్మి కేతనో
త్కరముల చేత ధూత మయి గంధవహప్రకరేర్యమాణమై
హరిపదవీథి కెక్కె నటహాటకశైలరజోభరం బొగిన్. 19

కం. వరరథతురంగసత్తమ
ఖురహతి నలి రేగి కనకకుధరపరిసరో
ర్వర రజము కర మెఱుపు గనె
హరిదంతము లొలసి యులియు నాశుగతతిచేన్. 20

కం. క్రిందికిఁ బైకిఁ బిఱిందికి
ముందరికిం జుట్టుఁ బ్రాకి మొనలందు మరు
ద్బృందహతిఁ గుందనపురజ
మొందెను గ్రొందమ్మివిందు నురుకాంతిరమన్. 21

మ. పృతనోద్ధూతసువర్ణభూమిజరజోబృందంబు గీర్వాణప
ద్ధతిదిక్ప్రాంతసమాస్థితం బయి నితాంతం బొప్పె నాకాళి కా
తతసంధ్యారుణకాంతిసంగతిభవత్త్వింగళ్యసంపద్యుత
క్షితిభృత్పాళిసముత్థసాంద్రజలదశ్రేణీతృణీకృద్రుచిన్. 22

తే.గీ. గురుమదహరిత్కరీంద్రముల్ కుందనంపుఁ
గందువుల స్వప్రతికృతుల ముందరఁ గని
బలిగృహోద్యత్ప్రతిద్విపభ్రాంతి సారెఁ
జెనకె రదకాండములఁ బెను కినుక దనుక. 23

కం. వరసిందూరరజఃపిం
జరములు మంథరము లమరసైన్యమహోకుం
జరము లెదురఁ గనఁజాల వ
పరంజిమల నెలవు లందు స్వప్రతికృతులన్. 24

కం. సురపతిబల మిటు గురుసం
గరశరధిక్రీడనోత్సుకత భర్మగిరిన్
ద్వర దిగె నొగిఁ గోలాహల
పరిగతఘూర్ణితతదద్రివరకందరమై. 25

మ. గురుసైన్యోరురథాలఘుప్రథిసముద్ఘోషాన్వితాలోలఘం
టరణేభాధిపబృంహితారవమిళన్మంద్రస్వనాభీలభే

రిరవోద్యత్ప్రతినాదమేదురబలారిగ్రావరాడ్భూరికం
దరనిద్రాసుఖవైభవానుపరమస్థైర్యాగ్ర్యహర్యక్షముల్. 26

కం. నిర్భీకనిరాకులతా
స్వర్భూధరరాజు లగుచు సార్థక్యరమా
నిర్భర మొనరించె నిజా
గర్భాప్తమృగాధిరాజఘనతమసంజ్ఞన్. 27

చ. అచలతటాంతదారణచణామరభూరిచమూసముత్థిత
ప్రచురరవంబు వైరిహరివారకృతాహవహూతిగర్జిత
ప్రచయ మటంచు నైజమృగరాజపరార్థ్యపరాక్రమోచితా
త్యచలధృతిన్ ధరాధరగుహాగృహగర్భవినిర్గతంబులై. 28

కం. గరువమున వెఱ దొఱఁగి కే
సరులు దరుల వెలిని నిలిచె సవిలాసముగా
సురబలసమ్మర్దనజని
దరభరమునఁ ద్వరగ సురిగె దవ్వుగ మృగముల్. 29

కం. వరసైనికనికరము సుర
ధరణీభృత్ప్రాంతవిపులధరఁదఱిసెన్
సురలోకజనులు దవ్వులఁ
దరుణీయుతు లగుచు వేడ్కఁ దనుఁ గనుఁగొనఁగన్. 30

కం. పఱపుగ నెల్లెడ నెగసె ద్యు
ధరాగ్రగత మైన నీలధవళారుణగౌ
రరజముల నభ మయాత్మిక
వరగంధర్వపురసంభవభ్రమ నెరపెన్. 31

కం. భువనవ్యూహకబళనము
శ్రవణకుహరదారణంబు సంక్షుబ్ధమహా
ర్ణవభరణము బలసమ్మ
ర్దవిశేషోత్థితము రవభరము గడుఁ బేర్చెన్. 32

కం. పటహధ్వని మునిఁగి చనెన్
బటుకరిగురుబృంహితముల బహుభయదహయో
త్కటహేషలఁ బృథురథచయ
చటులప్రధివిలయజలధిసదృశార్భటులన్. 33

91



కం. అమరబలజనిరజము బృహ
దమరార్యంతఃపురాంగనాలకదృక్ప
క్ష్మమహాకుచమండలుల హ
యమదగజధ్వజరథముల నలమె క్షణములోన్. 34

కం. ఘనతమ మయి యినమండల
మును గప్పి చదలు పొదవు చమూధూళులఁ గ
న్గొనుచు ఘనభ్రమ హంసలు
చనె మానససరసికిం పెసఁగ నాడె శిఖుల్. 35

కం. ఘనము లయి నవజలదబృం
దనిభము లగు సురచమూత్థితరజోవ్రజముల్
మిను గ్రమ్మి హైమపృథుకే
తనములు స్ఫురదురుతటిద్విత్వతి వలె వెలిఁగెన్. 36

తే.గీ. భరితపురుభూనభోఽంతరగురుపరాగ
సంచయము గాంచి జనులు తర్కించిరి పొరి
నొగి దిగెనొ?నేల కిది నింగి నుండి గాక
నేల నుండియె యెగసెనో నింగి కనుచు. 37

తే.గీ. ముందటికి వెన్కకును బైకిఁ గ్రిందికిఁ గెలఁ
కులకు నసుభృద్విసరము చూడ్కులు పొలయవు
సూచికాగ్రైకభేద్యమై యేచి యెల్ల
చోట్లఁ బొదలిన సేనారజోవ్రజముల. 38

కం. హరిదిభగణమదహరములు
సురయానగవాక్షజాలసుప్రతిరవమే
దురములు నగు నవిరతబహు
గురువాద్యధ్వనులు మిను మిగుల మార్ మ్రోసెన్. 39

కం. ధరఁ గ్రమ్మి యెందుఁ బట్టక
యురుసేన విశాలనాక మొంది యదియు ని
ర్భర మగు తన యునికికిఁ గ
ట్టిఱుకైనఁ గలంగెఁ జనుటిఁ కేదెస కనుచున్. 40

కం. అతిమదకరటిఘటాబృం
హితముల నుత్తుంగతురగహేషలఁ జలదు

ద్ధతఘనరథనేమిస్వన
తతిఁ గలఁగి జగము దగె గతశ్వసితగతిన్. 41

కం. ఘనకరటుల గురుబృంహిత
నినదముల రణోద్ధతచలనిర్ఝరఘంటా
ధ్వనుల మదోత్కటభటగ
ర్జనముల ముఖరత్వమును దిశలు గనెఁ గరమున్. 42

కం. గురుకరిమదసలిలోర్ములఁ
ద్వరగఁ దరంగిణు లనేకధా నిను పగుచున్
బురదయి హయధారాక్షు
ణ్ణరజస్తతి నేల యయి తనరె నరదములన్. 43

ఆ.వె. ఒఱకములు సమత్వ మొందె నెల్లెడ మిఱ్ఱు
పట్లు వరుత లయ్యెఁ బ్రచలదశ్వ
ఖురనిహతుల నలిఁగి కరిరాణ్మహారథ
పంక్తి నంతటను సపాట మయ్యె. 44

తే.గీ. దేవవర్త్మదిగంతప్రతిస్వనాతి
దారుణము లలఘుగిరితటదారణములు
జలధిసంక్షోభఖేలనచణములు నగు
భయదభేరీరణముల విశ్వము గలంగె. 45

కం. ఉలియు నుదిరి చిఱుగంట తె
గలఁ దగి యిటు నటును గాలిఁ గదలు పతాకా
వళు లాశాగమననిరో
ధు లయి నభోగతపరాగతోయధి దోఁగెన్. 46

కం. వరకరుల నిబిడవిస్మృమర
గురుభీకరబృంహితోరుఘోషల ఘంటో
త్కరదారుణతరరణములఁ
బొరి సేనానకనినాదములు మఱుఁగు పడెన్. 47

కం. బలరవమున మొగ మెత్తి మి
గుల వాకొను చంబరము నగులఁ జేయు రజ
స్వలల దిశలఁ గని మఱుపడెఁ
గలయ నలము తుమురు టిరుల గమి రవి యెటనో. 48





కం. త్వర మును సైనికు లలమిన
హరిదబల రజోఽతికలుష నరసి దివము భే
రిరవోర్వనురవముల బి
గ్గర గర్జిలె మిగులఁ జలపకారమున బలెన్. 49

పంచచామరము :
కరుల్ చొఱంబడెన్ దివం బఖండమారుతేరిత
స్థిరాధరవ్రజంబు డంబు చెంది భూరివారిదో
త్కరంబు పద్ధతిన్ క్షితిన్ శతాంగరాజి రాజిలెన్
బరంగె నిచ్చటన్ రణంబు వ్యత్యయంబునా నిటుల్. 50

ధ్రువకోకిల :
అతిబలోన్మదదైత్యలోకభయంకరక్షయకాల జృం
భితతరంగసముద్రఘోషణభీషణంబులు మజ్జదు
ద్ధతధరాధరకోటులై తగు దానవాహితసైన్యముల్
భృతమహీగగనాంతరంబులు పేర్చె మిక్కిలి వృద్ధితోన్. 51

తే.గీ. ఇది త్రిదశజైత్రయాత్రామహిమచతుర్థ
శాంచితసుసర్గమణి కూచిమంచి సోమ
సుందర కవీంద్ర వేంగమా నందనాగ్ర్య
సాంబశివకృ తాంధ్రకుమార సంభవకృతి.

---

శ్రీ

# శ్రీమదాంధ్రకుమారసంభవము

## పంచదశాశ్వాసము

----

కం. బలరిపుఁ డంధకహరసుతు
బలపతిగఁ బురస్కరించి వచ్చె మొనలతోఁ
గలని కని గుండెలదరుచు
బలు నానుడి వచ్చె దైత్యవర్గము నందున్. 1

కం. పురహరసుతుఁడు జయశ్రీ
శరణుఁడు సేనాని యగుచు సహజిత్వరని
ర్జరబలుఁ డయి వచ్చెడు స
త్వర మని విని వడఁకి రెడఁదఁ దడ వసురవరుల్. 2

కం. అల దితిజపతిపురస్థులు
కలిసి దొరను దఱిసి మకుటఘటితాంజలులై
తెలచి తెలిపిరి యుయుత్సుఁడు
జ్వలనాక్షజుతో బలారి వచ్చె నటంచున్. 3

తే.గీ. నిజభుజిష్యకృతాఖిలత్రిజగతీకు
నను మును శచీశుఁ డెన్ని మా ర్లని గెలువఁడు?
నిజ మిపుడు గిరిశతనుజన్ముభుజబలమున
గెలుచు నను చెక్కసక్కెము పలికి నవ్వె. 4





మ. ఉరురోషస్ఫురితాధరాధరుఁడు లీలోద్యత్త్రిలోకీజయో
ద్ధురతర్షోగ్రుఁడు తారకాసురుఁ డటన్ దోర్విక్రమాఖర్వగ
ర్వరజోంఽధీకృతచిత్తులన్ నిజచమూపశ్రేష్ఠులన్ బిల్చి సం
గరసన్నాహము సత్వరం బొనరుపంగాఁ జేసె నిర్దేశమున్. 5

కం. ఉరుబలపతు లతులాయుధ
ధరు లయి త్వర సజ్జు లగుచుఁ దండములై ని
ల్చిరి నతనృపసంకులనిజ
పరిపాలక చత్వరాగ్రవరమధ్యమునన్. 6

కం. కనెనా దొర ప్రణతుల వా
హనవరగూఢుల మహారణార్ణోనిధికం
పనచండుల సైన్యేశుల
ననేకులను ముందరఁ బ్రతిహారులు చూపన్. 7

కం. చనెనా బలి బలరిపుబల
హననము హరిదిభరవద్రవాంతకఘోర
స్వనము నగాబ్ధ్యనివార్యగ
మన మగు ప్రతిభయశతాంగమణి నెక్కి యిటన్. 8

మ. చనునా బల్దొర వెంట నంటి నడచెన్ సంవర్తసంక్షుబ్ధతో
యనిధిధ్వానకముల్ చలాచలపతాకానీకసంఛన్నతా
పనచండాతపముల్ ధరోద్ధతరజఃపాళీసలీలావలీ
ధనలిన్యాప్తదిగంతముల్ సుభటరాడ్గ్రాహోగ్రసైన్యాంబుధుల్. 9

కం. అనిమిషుల పైకిఁ జను ఘన
దనుజుని మొన దుమ్ము దిమ్మ దగె దిఙ్నాగా
ర్జునరదశాఖల సితమున
తనుమదజలతత్పుకుంభతటుల నసలునై. 10

కం. గిరికందరదారణపటు
తరతద్బలపటహభవదదభ్రధ్వనులన్
గురుశరనిధు లతివేలతఁ
బొరి ఘూర్ణిలె నొక్క మొగి నభోనది పొంగన్. 11

కం. సురరిపుపరివృఢగురుతర
వరూథినీసంకులారవము లలమిన మిన్

సరితు సకమలోచ్చోర్మిని
కరముల స్వరగారతతులఁగస టఱఁ గడిగెన్. 12

తే.గీ. అంత యానోన్ముఖుండగు నసురపతికి
మునుమున నగాధధుర్వ్యధాంబోధిమధ్య
మగ్నుఁ డగు దీవనుచుఁ జేటు మందలించు
దుర్నిమిత్తపరంపర దోఁచె నొకట. 13

కం. అసురపలభావ్యశనకే
ళిసతృష్ణో(గ్రాత్యమాంగళికఖగతతి రా
క్షససైన్యోపర్యుపరి ది
వసమణిరుచి మఱుఁగ వచ్చి స్వస్థలి నిలిచెన్. 14

చ. విసరెఁ బోరిం బ్రభంజనుఁడు వీఁక దలిర్పఁగఁ గేతనాతప
త్రసమితి నేలఁ గూలఁగఁ బ్రసర్పదిలాతరరేణురాశి వె
క్కస మయి లోకవీక్షణనికాయము గప్ప నితాంతధూతమై
యసదృశవాజివారణమహారథరాజితిరోహితంబుగన్. 15

కం. చనియెను సద్యోభిన్నాం
జనపుంజాసితమహాహిచయము విషాగ్నుల్
పెను నోళ్ళ వెలార్చుచుఁ గడు
కొన మును గల సరవి మీఱి ఘోరాకృతియై. 16

కం. విమతామిషాశనవినా
శము దెలుపుచు మత్సరాతిశయమున నన న
ర్యముఁడు మిళదురుభయంకర
తమ విషధరఘోరపరిధి దాల్చె బెడిదుఁడై. 17

కం. దురము కడ వెస నసురరా
ద్వరరుధిరము బలిమిఁ ద్రావ వాంఛించు గతిన్
బరుషముగా నఱచె శివో
త్కర మినబింబమున కెదురుగా గమి కొనుచున్. 18

కం. పగలును వడి గల చలతా
రగణము రాణువులఁ గలయ రాలుట జనముల్
మిగులఁ గని వగచి రాత్మల
నగు నసుర కసుక్షయాంత మగు నెగు లనుచున్. 19

94



కం. పరితఃస్ఫురదురుదీధితి
భరసందీప్తాఖిలదిగవధినభ మయి యు
గ్రరవచ్ఛిన్నహృదయ మయి
త్వర నశని విఘనఘనపదవి నుండి పండెన్. 20

కం. అసృగస్థిజ్వలదుల్మక
విసరము దివి మివులఁ గురిసె వెలిచె జ్వలనముల్
వెసఁ బొగల గముల మొగముల
దెస లూనె ఖరగళసమశితిరజోవితతిన్. 21

తే.గీ. కుధరశిఖరదళనము దిక్కుహరగగన
భక్షణంబు శ్రవఃకుడ్యభంజనంబు
ప్రకుపితకృతాంతగర్జాతిరస్కరణము
నెగడె నిర్భరనిర్ఘాతనిస్వనంబు. 22

కం. అరిబలము స్ఖలన్మదగజ
మరపతదశ్వము పరస్పరాశ్లిష్టభటో
త్కర మయ్యెఁ గరము క్షుభ్య
చ్ఛరనిధిభిన్నోరుగిరిరసాకంపమునన్. 23

ఉ. మోరలు మీఁది కెత్తికొని ప్రొద్దు పయిన్ దమ దీనదృష్టులన్
జేరిచి నిల్పుచున్ జెవులు చిల్లులు వోవఁగ జాలికొల్పఁగా
వారక కూడి కూయిడుచు వంతు మెయిన్ శునకంబు లెల్ల నిం
ద్రారివరేణ్యు ముందర బయ ల్వెడలెన్ నతకర్ణపాళులై. 24

కం. పిశితాశుఁ డిటు దురంతా
పశకుననికరంబు గనియుఁ బ్రగమనయత్న
ప్రశమన మొనరింపఁడ నిజ
భృశకోపోద్ధతిని దుష్టవిధికుటిలహతిన్. 25

కం. పరిణతిఘోరాహితజని
దరమున వల దన్న బుధులు దనుజేంద్రుఁడు ముం

---

ఆ.వె. మోర లెత్తి పైకిఁ బొద్దుపైఁ జూడ్కులు
నిలిపి జాలిగాఁ జెవులు పవులఁగ
నేపు లెల్లఁ గూడి యేడ్చుచు వంతున
బయలువెడలె దనుజపతి మునుమున. 24 పాఠాంతము.

దరికె చనె లేబరము గద!
దురాగ్రహాంధులకుఁ గోవిదుల హితబోధల్. 26

కం. ప్రతికూలమారుతాహతి
నతని సువర్ణాతపత్ర మవనిం బడి యం
చిత మయ్యె మృత్యుభోజన
కృతి కొనరించిన హిరణ్యపృథుపాత్ర మనన్. 27

కం. తెలివి గల మౌళి రాఁగల
తల త్రుంగు టెఱింగి బలువెతఁ దొఅంగెడు దృ
గ్జలతరళకణావళి యనఁ
బలుమరు బొమిడికము విడిచి పడె ముత్తియముల్. 28

కం. అనుచరులు పొరింబొరిఁ జో
పినఁ దద్గ్రహణేచ్ఛఁ బోలెఁ బెల్చన గ్రద్దల్
దనుజు భవిష్యద్వధసూ
చన మొనరుచు చతని మౌళి చాయనె యెగిరెన్. 29

చ. అతని పతాకపైఁ గనె జనౌఘము నూతనపాతితాంజనా
ప్రతిమసితేతరచ్ఛవిభరంబు ఫణామణిజాలవిస్ఫురద్
ద్యుతివలయంబు నిర్యదతులోగ్రవిషోల్ముకవహ్నిగర్భపూ
త్కృతితతినిర్భరాననదరీకమునౌ ఘనదందశూకమున్. 30

కం. అసురేశ్వరు పృథురథధూ
రసమయలగ్నోగ్రదహనుఁ డట రథ్యసటా
విసరశ్రుతిచామరయుతి
నెసఁగ నిషూత్కర శరాసనేషుధు లేర్చెన్. 31

తే.గీ. ఇటు లరిష్టంబు లశుభంబు లెన్నొ తోఁప
మరల దుశ్శకునవిహన్యమానుఁ డసుర
తా మదాంధుఁడై యుద్ధంబు దారి విడఁడ
యపుడ వినిపించె దివి నుండి యమరవాణి. 32

కం. చనకుము రోరి! మదాంధుఁడ
ఘనతరదోర్దండతైక్ష్ణ్యగర్వమున రణం
బన నరిజిత్వరబలమ
ర్దనముఖసురపరివృతస్మరహరాత్మజుతో. 33





మ. విను మార్ ప్రొద్దుల నెత్రు కందు వయి యే వీరుండు తా నొక్కయం
పనె యభ్రంలిహతుంగశృంగశతదిఙ్మండల్యభిచ్ఛిన్నక్రౌం
చనగగ్రామణి బెజ్జ పుచ్చె నెదిరించన్ లేరు నీ దైత్యు లె
వ్వనిఁ జండాంశుని శార్వరాంధతమసవ్రాతంబు లంటించునే! 34

కం. ఆశరకులకుంజర! నీ
కాశరవణభూగుహోగ్రహర్యక్షముతో
నీశాత్రవ మేల? సమి
ద్ధాశుగసఖు శలభకలభ మనిఁ జెనకునటుల్. 35

మ. ధనురామ్నాయ మెఱింగి సాంగముగఁ గందర్పారిచే నే భటుం
డని ముయ్యేడు మరుల్ విరోధినరనాథాస్రోరునీరాభిషే
చనక్లప్తిన్ స్వరుషాగ్నినార్పు చఖిలక్షత్రచ్ఛటాకాళిరా
త్రిని గల్పించెనొ భూతధాత్రి పయి నాభృగ్వన్వయోత్తంసుఁడున్. 36

కం. త్రైలోక్యైకభటుండయి
వాలిన యే త్రిపురదానవద్విట్సుతుతో
నాలమున కనఁగ రావడు
నా లావరిఁ దరమె?నీకు నని మార్మ్రోఁగన్. 37

కం. పొగ రుడుగు మదాంధుఁడ! గా
కగధన్వసుతోరుశక్తి కగ్గ మిపుడె యా
జగజెట్టినె తప్పక శర
ణుగ వేఁడుము చిరతరము మనుము ధర దానన్. 38

కం. ఘనతమనా ద్యోవాణిని
దనుజాగ్రణి విని మదక్రుధాపరత దివిన్
గని వడఁకుచు ననె బిగ్గర
గ నశేషజగత్త్రయీప్రకంపకుఁ డయ్యున్. 39

కం. హరసుతపక్షానుసరాం
బరచరఘనదివిజు లేమి వదరెద రెటు మ
చ్ఛరఘోరవ్రణపీడా
భర మింతటి లోనె మఱపు వచ్చెను మీకున్. 40

కం. నిలిచి దివి నేమి వెగ టెలుఁ
గులఁ బ్రేలెద రా అహముల కుట్టు బలిమి మా

పులు వని నిచ్చఁ దిరుగు న
క్కలుఁ గార్తికికోన్మదశునకములుం బోలెన్. 41

కం. జననాదితపస్విజుఁడీ
కనికరపు నిసుంగు చెడు నికము దొంగల చె
ల్మిని సుజనుఁ డట్లు మీ పొం
దునఁ దునుముదు ముందు మిము వెనుక నాతనినిన్. 42

కం. వికటాట్టహాస మొనరిచి
ప్రకటాహంకృతి నెఱా కరాచురి యొఱ దూ
సి కడున్ వడి నల రథి వృష
నికటమునకె పఱపు రథ మనియెను నియంతన్. 43

కం. కనె సారథీరితము నతి
మనోరయమునౌ శతాంగమణి నెక్కి వెసన్
జను చతిభయదమనంతము
ననిమిషబలజలధి నెదుట నసురేంద్రుఁ డటన్. 44

కం. కని పిదపనా భటాగ్రణి
యనంతసురసేన నెదుట నలరి గరుల్ గాం
చెను గడు రణలీలోత్సుక
త నిజసముద్దండబాహుదండయుగమునన్. 45

కం. సురరాడ్భటవరులు చమూ
చరు లట ముందరి కరిగిరి సమరక్రీడా
దరమతుల మనోజ్ఞ తీత
త్వర రణలాలసులు మృథవిధానాలసులే? 46

కం. సురరిపుసైన్యచరులు ముం
దరఁ దనరు పురందరపృతనాశరనిధి నే
ద్తెఱఁ దాఁకి నిజాఖ్యలు బి
గ్గరఁ దెలిపిరి బాహులెత్తి కర మెదిరి కటన్. 47

తే.గీ. ఘనులు జేజేలు తమ మ్రోలఁ గ్రాలు దనుజ
బలమహోదధిఁ గని తల్లడిలిరి చాల
ననిని నిర్లక్ష్యమతిఁ జేరు హరకుమారు
నొక్క కనుఁ గోనఁ జొచ్చిరి యోధు లెల్ల. 48



కం. విమతబలత్రస్తామర
చమువులఁ గనె నంధకప్రశమను కుమారుం
డమితసమిదుత్సవాదృతి
యమరఁ బ్రసారామృతోత్కిరాలోకమునన్. 49

కం. అని శక్తిధరుని దర్శన
మున సోత్సాహాత్ములై విబుధు లహమికతో
మొనసి రరిసమితి గెలువఁగ
ఘను సంగతి నెవఁడు గాఁడు? గండఁడు జగతిన్. 50

కం. సురపతదరిభటులు పర
స్పరరణవిజిగీషఁ బెనఁగఁ బ్రహరణకరులై
త్వరఁ గలియఁబడిరి వందిని
కర మెత్తిలి దెలుపఁ దమ మగఁటిమినిఁ బేర్లున్. 51

మ. సవభుగ్దైత్యబలాంబుధుల్ప్రలయకృత్సంగ్రామయోగాతివే
లవిహారంబు లశేషదిక్ప్రసరముల్ కాలార్పితాతిథ్యభు
క్తివిధాయుల్ పొనరించె గ్రావతటవీథీభేదనోష్ణంబు లో
కవితానగ్రసమానభూరిముఖరోగ్రంబున్ మహాధ్వానమున్. 52

తే.గీ. ఇది సురాసురసంఘట్టవిదిత మైన
పంచదశసర్గ శ్రీకూచిమంచి సోమ
సుందరకవీంద్ర వేంగమా నందనాగ్ర్య
సాంబశివకృ తాంధ్రకుమారసంభవకృతి. 53

---

శ్రీ:

# శ్రీమదాంధ్రకుమారసంభవము

## షోడశాశ్వాసము

----

కం. జరిగె సురేశ్వరదనుజే
శ్వరుల బలంబులకుఁ జండభండన మట నొం
డొరుల పయి భటులు పఱపిన
ఖరతరభీమాస్త్రశస్త్రకాండంబులచేన్. 1

కం. ఆ దురమునఁ దలపడిరి ని
షాది నిషాదియును సాది సమసాదియునున్
బాదాతికుఁ బాదాతికుఁ
డాదట నరదంపుజోదు నరదపుజోదున్. 2

కం. ధీరగతి నొండొరులతోఁ
బోరికిఁ బఱతెంచు శూరముఖ్యుల పేరుల్
హారితరోక్తులఁ దెలిపిరు
దారాత్మీయాన్వయావతంసులు వందుల్. 3

కం. తమ విక్రమసందోహ
క్రమ మమరఁ బఠించు వందిగణఫణతికిఁ జి
త్తముల సమర్పించిరి వీ
రమణుల్ క్షణ మాలసించి రణకుతుకముతోన్. 4





కం. సమరానాందావేశవ
శమున సరోమాంచమై యెసఁగఁ బొంగిన యు
త్తమవిక్రాంతుల గురుగా
త్రముల పయిం గంచుకములు గ్రంచరఁ బిగిలెన్. 5

కం. నిర్దయనిస్త్రింశనివహ
నిర్దళితతనుత్రనికరనిర్యత్పిచుస
మ్మర్దభృశవిశదరుచు లయి
స్పర్ధిశ లెసలారె జాతపలితములు బలెన్. 6

కం. వీరకరాధూతంబులు
భూరిరుధిరరసవిలిప్తములు ఖడ్గలతల్
సూరకరవ్యతికరమున
నైరావత్యురువిభారమాప్తి నెసంగెన్. 7

కం. ఘోరముఖోద్దీర్ణార్చి
ర్వారము లయి కాలభుజగభయదములౌ బల్
నారసములు భృశరోషిత
వీరభటవరేరితములు వెస నభ మలమెన్. 8

కం. కర మనరులు నొవ్వఁగ నొం
డొరు నేయు ధనుర్ధరుల మహోగ్రాశుగముల్
త్వర దూసి యెదిరి మేనులు
ధరఁ జొఱఁబడె నరుధిరాంకితముఖంబులతోన్. 9

చ. సమరమహాప్రహర్షిభటసత్తమమార్గణరాజి మున్ మదే
భములను జీల్చి కూల్చి ధర వాలెఁ బరస్పరసంకషత్పృష
త్కముల జ్వలచ్ఛిఖానలముఖంబులు గాఢనిరంతరీకృతా
భ్రములునుగా విమానచరవారము దూరము వాఱి బోరునన్. 10,11

కం. విలుకాండ్ర వాఁడి తూపుగ
ముల మిన్ను విభిన్న మగుచు భూరితరార్తిన్
బలు డేగ పే రెలుఁగు మా
రులివు మిషన్ బెట్టిదముగ నులిసె ననఁ దగెన్. 12

కం. ఆకర్ణసమాకృష్ట
జ్యాకలితధనుర్గణేరితాజిహ్మగముల్

వే కడు దవు పఱచె సమీ
కాకాంక్షి జనాస్రపారణాత్యాశ బలెన్. 13

చ. త్వర నొఱ దూసి బం ట్లని స్వపాణులఁ బూను కృపాణజాలముల్
పరఁగె రహిన్ హసించు నటు స్వచ్ఛనిజచ్ఛవిసంచయోపధిన్
సురుధిరలిప్తమై యవి రజోనిబిరీసవిశాలసంగరో
ర్వర విలసిల్లె మించుగమి భాతి భటాగ్రకరాబ్దనర్తనన్. 14,15

కం. సమరాంగణమున నతిచం
డముగా దీపించు భండనప్రియభటభ
ల్లము లమరెఁ గాలవిషధర
సమధికరసనోగ్రయంత్రసామగ్రి యనన్. 16

కం. చాక్రికవరచక్రంబు ల
వక్రోజ్జ్వలకాంతిచక్రబంధురములు జ
న్యక్రతుభుక్సృతిఁ జేసె భ
మక్రమవిధి చండభానుమండలశోభన్. 17

మాలిని :
త్వరితగతిని దాఁకన్ వచ్చు దుర్వారవీరో
త్కరము సలుపు నుచ్చైర్గర్జలన్ వ్యగ్రులై నె
ప్పరి పడిరి స్వవాహభ్రష్టులై కొంద దుర్విన్
బొరసిరి భయభారోద్భూతవైక్లబ్య మన్యుల్. 18

ద్రుతవిలంబితము :
తను బొరింగొన వచ్చెడు దండి జె
ట్టిని గనుంగొని పొంగిన డెంద మం
దును నొకం దరి యక్కిలితో మలం
గిన నలంగెఁ బ్రియావహకేళియై 19

తోదకము (లేక) పాదపము :
విక్కుచుఁ బోరియొ పెక్కుర తోడన్
మిక్కిలి వేడ్క భ్రమించియొ యాజిన్
స్రుక్కక ప్రాగ్వృత శూరులచే పే
రుక్కునఁ జేరిరి యుద్ధపటిష్ఠుల్. 20

98



స్రగ్విణి :
ఆరివేరంబు సేయన్ సమిద్దర్పదు
ర్వారులౌ శూరు లారంగ రాఁ గాంచుచున్
స్ఫారరోమాంచచంచద్భుజాదండులై
భూరియుద్ధోద్ధురుల్ పొంది రానందమున్. 21

వంశస్థము :
సితాసినిర్ధారితసింధురేంద్రకుం
భతత్యధఃప్రచ్యుతమౌక్తికాళి సు
ద్యుతిన్ సమిత్క్షేత్రనిరుప్తసద్యశః
ప్రతానబీజాంకురపంక్తిమైఁ దగెన్. 22

రథోద్ధతము :
వీరఘోరరవభీతిచే మహా
వారణవ్రజము పర్వుచున్ సృణుల్
చీరికిం గొనక చేరె బోరునన్
వారితంబు లయినన్ దిగంతముల్. 23

తోటకము :
గతహస్తిపకంబులు కాండచయ
క్షతవిగ్రహముల్ పృథుసామజముల్
తతయుద్ధవనీభ్రమతత్పరముల్
యుతరక్తధునీతతిలో మునిఁగెన్. 24

తోదకము :
నిరవధికాస్రధునీర్ఝరి నుచ్చైః
పురురథపాళియు బ్రుంగిన హుమ్మం
చురుశరవర్షము నుగ్రపు టల్కన్
బరపిరి వైరులపై రథు లన్యుల్. 25

---

మ. అసినిర్ధారితకుంభికుంభగళితావాకీర్ణరక్తౌఘు మొ
ప్పె సమిత్క్షేత్రనిరుప్తసద్భటయశోబీజాంకురశ్రేణిమై
నసదృగ్వీరకఠోరఘోషపరిభీతానేకపానీకముల్
వెస ధూతాంకుశముల్ వలంకులకుఁ బర్వెన్ బోర దుర్వారమై. 22

ఉపేంద్రవజ్రము :
సితాసినిర్ధారితశీర్షులై రా
హుతుల్ స్వవాహచ్యుతి నొందుచున్నన్
క్షితిన్ బడన్ గూల్చిరి చీల్చి శస్త్రా
హతిన్ నిజారాతిచయంబుఁ దొల్తన్. 26

స్వాగతము :
శూరవారశిరసుల్ దెగి శస్త్రీ
ధారలన్ బడుచు ధారుణి దష్టో
ష్ఠోరుదారుణము లుర్కె రుషన్ దు
ర్వారరాహుగతి వైరుల మీఁదన్. 27

ఇంద్రవజ్రము :
సారంబులౌ కాళుల సాళువంబుల్
క్రూరార్ధచంద్రాస్త్రవిలూనయుధ్యద్
వీరేంద్రమూర్ధంబులు వీఁకఁ గైకొం
చారంగఁ బూరించె ఘనాధ్వ మెల్లన్. 28

ఇంద్రవంశస్థము :
వేదండముల్ చండత వీఁకఁ దాఁక నెం
తే దంతి దంతాగ్రము లెక్కి సాదులున్
పాదాతికుల్ దీసిరి ప్రాసపాళులన్
భేదించి యాధోరణనిర్భరాసువుల్. 29

భుజంగప్రయాతము :
అసిచ్ఛిన్ను లైనన్ నిజారోహకుల్ బల్
కసిం దిర్గు చిం దండుఁ గల్పాంతకాలో
ల్లసద్వాతధూతాచలవ్రాతరీతిన్
వెసం గ్రాలె గంధాంధభీమద్విపంబుల్. 30

ప్రమితాక్షర :
గురునాగముల్ పెనఁగఁ గూడఁ బర
స్పరయుధ్యమానులు నిషాదివరుల్
త్వరమై ఖరాగ్రకరవాలములన్
హరియించి రొండొరుల ప్రాణములన్. 31





తోటకము :
ఉరురోషమిథోమిళదుద్ధతకుం
జరదంతవిఘర్షణజజ్వలనం
బరిశస్త్రహతిక్షపితాసువులౌ
వరయోధుల నేర్చెను వైళముగాన్. 32

శ్యేని :
జాతరుద్ద్విపేంద్రశస్త్రహస్తసం
వీతులై పదాతివీరు లుద్ధతిన్
హేతిఘాతసంహృతేభరాడసు
వ్రాతు లైరి నైజభర్తృసన్నిధిన్. 33

ప్రియంవద :
కరటు లెత్తి దవుగా దివిఁ జిమ్మన్
బరఁగ జోదులను వారల యాత్మల్
బొరసె దివ్యగతి భూగత మయ్యెన్
మరలనా పరమ మానుల మేనుల్. 34

మయూరసారి :
శ్వేతధారహేతి ఛిన్నతుండి
వ్రాతమండముల్ ధరాసమానం
బై తగం బొనర్చి యంతఁ దృప్తిన్
ఖ్యాతయోధు లంద రాత్మ లందున్. 35

భుజగశిశురుతము :
కరులు దివికిఁ బదాతో
త్కరముఁ గరములఁ జిమ్మన్
సురులు మరులు మెయిన్ వ
చ్చిరి గయికొనఁగ వారిన్. 36

వసంతతిలకము :
కోదండి సాదులు లకోరులఁ దాము నొంచన్
వేదండవాహనులు పెల్లుగ మూర్ఛ గంచున్
వే దెల్వి తప్పి పడ వేచిరి పెద్ద ప్రొ ద్దా
జోదుల్ పొరిం దెలియ శూరత సారెఁ బోరన్. 37

చంద్రిక :

త్వరఁ గరి తనుఁ బట్ట రా రుషన్
దరవలిఁ ద్రెవి తత్కరంబు గా
లరి రదముసలంబు లెక్కెఁ గుం
జరసరభససంజిహీర్షచేన్. 38

ఉత్సుకము :

వారణదంతయుగం బసిన్
నేరిమిఁ జెండి మొదంటికిన్
వైరిబలంబునఁ జొచ్చియున్
దారునఁ గాలరి వెల్వడెన్. 39

భద్రకము :

చండతుండిగురుశుండచే
గండఁ డారఁగ గృహీతుఁడై
యుండి వే తదసులే యసిన్
దండి తా నొవకె గైకొనెన్. 40

హలముఖి :

ఈటె సాటి తురగి తొ
మ్మాఁటి సాది యరి ధరన్
బాటు గంచుఁ దన యెదన్
దూఁటుటే గనఁడు మదిన్. 41

చంద్రవర్త్మ :

వైరికుంతహతిఁ బాసియు నుసుఱుల్
గూరుచుండి ఘనఘోటము పయి ది
ట్టార జీవయుతు నట్లు దిరిగె వ
జ్జీరుఁ దెత్తుచును జేఁ బెనుపరిఘన్. 42

జలోద్ధతగతి :

అరాత్యసిహృతాసు నాశ్వికవరున్
ధరానిపతితాత్ముఁ దా విడుచుచున్
వరాశ్వ మెటుఁ బో దబద్ధ మయినన్
బొరిం గనుల నశ్రువుల్ దొఱఁగుచున్. 43

100



రుగ్మవతి :

వైరిశితాగ్రప్రాసహతుండై
ధారుణి పైనం దాఁబడు చున్నన్
గూరక మూర్ఛన్ గోరెను బల్ రౌ
తీరస దాయన్ హింసితుఁ జేయన్. 44

తోటకము :

ప్రచురోగ్రపరస్పరభల్లహతుల్
ప్రచలాశ్వపరిచ్యుతవర్ష్మలు భూ
మిచరుల్ గసిఁ బోరిరి మీరి కచా
కచిఁ గత్తులఁ బాహుయుగంబులతోన్. 45

చంద్రకళ :

హతు లయి రథులా రథాధ్యబా
ణతతుల సుదృఢాసనస్థులై
యతుకుచు శిథిలాశుగాసన
ప్రతతిఁ దగిరి ప్రాణవద్విభన్. 46

మనోరమ :

రతి నిజోరుశస్త్రమూర్ఛితున్
రథినిగొట్టఁ బూన కప్పటన్
పృథుమృథేచ్ఛ వైరి తేఱ సు
ప్రథుఁడు వేచె శౌర్యనిష్ఠతోన్. 47

అర్ధపంచచామరము :

పరస్పరప్రమాపితుల్
వరాయుథుల్ ద్యుసంగతుల్
వరించి యిర్వు రొర్తుఁ బో
రి రచ్చరన్ రథుల్ పోరిన్. 48

ప్రహేయము :

అతిరథయుగ మన్యోన్యార్ధచంద్రా
కృతిఖరశరనిష్కృత్తోత్తమాంగ
ద్వితయము గనె స్వర్వీథిస్థమై చం
డత క్షితి స్వకబంధంబుల్ నటింపన్. 49

స్వాగతము :

ఆడె నట్టగము లాయుధపాణుల్
పాద భూతమహిళాతతి మ్రోయన్
దోడవాద్యములుఁ దోరపు నెత్రుం
బాడి జాఱు నని వాకిట నెట్లో. 50

మత్తకోకిల :

ఏనుఁగుంగములు న్మనుంగ నసృజ్నదీతటులన్ మరు
న్మానుషాదబలంబు లిట్లు పెనంగ రక్కసి భూరిరో
షానలారుణదృగ్భ్రమద్భయదాలఘుభ్రుకుటీదురీ
క్షాననుం డయి వే యుయుత్సు సురాధినాథులపైఁ జనెన్. 51

తే.గీ. ఇది సురాసురబలరణాఖ్యేద్ధ షోడ
శాంచితసుసర్గ శ్రీకూచిమంచి సోమ
సుందర కవీంద్ర వేంగమా నందనాగ్ర్య
సాంబశివకృ తాంధ్రకుమారసంభవకృతి. 52

---





శ్రీరస్తు

# శ్రీమదాంధ్రకుమారసంభవము

## సప్తదశాశ్వాసము

---

మ. పురుసంగ్రామవిలాసకౌతుకఘనామోదుల్ దురంతాశుగో
త్కరసంజాతతమఃపయోనిధినిమగ్నప్రాజ్యకాష్ఠానభోఽం
తరు రక్షోవరు నభ్యుపేతు నెదుటన్ గంచాదిశాధీశ్వరుల్
త్వరమైఁ గూడి రటన్ రణప్రియమతిన్ బాహాబలాహంకృతిన్. 1

మ. అమరారాతికులాధినాథుఁ డటపై నత్యంతభీమాట్టహా
సము గావించి దురంతసంతతశరాసారాభివృష్టిం బొన
ర్చె మరుద్వీరవరేణ్యవారమును బ్రావృట్కాలకాలాభ్రస
త్తమ ముత్తుంగధరాధరప్రవరసంతానంబున ట్లుద్ధతిన్. 2

మ. పురుహూతాదికలోకపాలకధనుర్ముక్తాతిశాతాశుగో
త్కరముల్ సత్వర మాశరేశ్వరపృషత్కశ్రేణులన్ వీఁక సం
గరరంగంబునఁ దాఁకి తుత్తుమురుగా గండ్రించెవేగన్ ఖగే
శ్వరబృందంబులు దందశూకతతులన్ జక్కాడు నక్కైవడిన్. 3

మ. అతఁడున్ వెండి జ్వలత్ఫలాగ్రములు నాత్మాఖ్యాంకితంబుల్ తిరో
హితదిక్చక్రనభోఽంతరాళములునై యేపారు క్రూరేషు సం
తతులన్ దేవచమూశరోత్కరములన్ ఖండించెఁ బైఁగప్పు తూ
లతతుల్ కీలి సకీలజాలముల లీలన్ గాల్చు చందంబునన్. 4

కం. త్వర నని సహేలముగ రు
ద్భరభీకరుఁ డసురవరుఁడు పరపిన శరముల్
కరమున్ బంధించె సురే
శ్వరముఖుల మహాహిపాశభయదాకృతులై. 5

చ. హరిహయముఖ్యులై పరఁగు నాహరిదీశ్వరు లామిషాశికుం
జరగురునాగపాశశరసంతతికీలితగాత్రు లౌచు సం
గరవిముఖాత్ములై శ్వసితగంధవహాకులదీనవక్త్రులై
స్మరహరసూనుఁ జేరిరి వెసన్ విపదబ్ధిసముత్తితీర్షులై. 6

తే.గీ. పురహరాత్మజు దృక్పాతపురుమహిమనె
గిరిగరుచ్ఛేదిముఖులైన సుర లురుఫణి
పాశగురుబంధవిపదార్తివార్ధి దరిని
దఱిసి తమయంతఁ బొగడిరి తజ్జిగీషు. 7

మ. పలికెన్ జండభుజాబలుం డట సుదీప్తస్ఫారరోషానలుం
డల దైత్యేభ్యుఁడు వే స్వసారథికి నౌరా! బల్మి నే నింద్రము
ఖ్యుల నస్త్రంబులఁ గట్టఁ జూడికినె సద్యోముక్తులం జేసెఁ బొ
త్తుల పాపండు కపర్దిపుత్త్రకుఁ డిదే దుర్మానసారాత్ముఁడై. 8

కం. కావునఁ జూచెద నాతని
లా వని రథ మతని మందలకుఁ జేర్పు వెసన్
నీ వీరి విడిచి వానినె
గావింతు రణోర్వి ఖగమృగములకు నెఱగాన్. 9

తే.గీ. ఆ రథము సారథీరణ నరిగెఁ ద్వరగ
భీషణము విలయజలదగంభీరధీర
ఘోషణము దారితాఖిలద్వేషణపల
లాస్థ్యసృక్పంకమగ్నరథాంగము నయి. 10

మ. ప్రలయాభీలమరుద్ధతాద్రివరకల్పంబై దళద్దేవతా
బలనిర్ఘోషవిశేషభీషణగతిన్ బై కుద్ధతిన్ వచ్చు ను
జ్జ్వలరాత్రించరరాడ్రథంబుఁ గని జంభద్వేషిసైన్యంబు భీ
తిలి కంపించుచుఁ దల్లడంపడియె నెంతే స్వాంతరంగంబులన్. 11

తే.గీ. నలి నలంగిన దిక్పాలకుల మొన గని
శస్తకోదండదండప్రచండదోఃప్ర

102



కాండుఁ డసురుండు ఖండనాఖండకేళి
కౌతుకాదృతు హరసుతుఁ గదిసి పలికె. 12

శా. ఓరీ! శంభుతపస్విడింభ! భవదీయోద్దామదోశ్శక్త్యహం
కారం బిక్కడ మాను మాను సురరాట్కార్యంబు చాలింపు బా
ల్యారంభాతిమృదుత్వదీయభుజవల్ల్యత్యంతభారాయిత
స్ఫారాస్త్రాదులతోఁ బనే మవి యిటన్ వ్యర్థంబు లత్యర్థమున్. 13

చ. హరగిరిమౌళిబాలలకు నబ్రపు టెక్కటి పట్టి వీవు మత్
ఖరశరపాళి పా లయి కృతాంతనితాంతము సేర నేల? డా
మరసమరోర్విఁ బాసి చనుమా మనుమా రయ మారఁగా స్వమా
తరపితృకోమలాంకము కృతార్థత నొందఁగనందు దూఱుమా. 14

ఆ.వె. ఎడయు హరకుమార! యీ దుశ్చ్యవను పక్ష
మరసి నీకు నీవ సరిగ సరగ
లోఁతు నీట మునుఁగు చాతఁడు దా నిన్ను
మున్న ముంచు రాతి పోత మట్లు. 15

చ. దనుతనుజేంద్రుఁ డిట్లు ప్రవిదారణధారుణి నన్న యన్నకిన్
విని యనలేక్షణాత్మజనివీరవరేణ్యుఁ డవార్యరోషకం
పనరదనచ్ఛదుం డగుచుఁ బ్రస్ఫుటకోకనదారుణాక్షుఁడై
తన ఘనశక్తి నెంచుచు స్వధన్వము గం చుచితోక్తి నిట్లనున్. 16

ఆ.వె. దితిసుతేంద్ర! యుద్ధతిని నీ వనిన దెల్ల
నీకె చెల్లు నైన నీ యురుభుజ
భూరిశక్తిఁ జూడఁ గోరు వాఁడఁ గృపాణిఁ
బూను ధనువు సజ్యమును బొనర్పు. 17

చ. అని యనువారఁ బల్కిన పురాసురవైరికుమారు తోడ నా
దనుజవరుండు రోషభరదష్టనిజాధరదంతవాసుఁడై
యనె నని కుగ్రదోర్బలమదాంధుఁడ వైతిఁక సైఁపుమా పలా
యనపరశత్రుపృష్ఠదళనాతినిశాతమదాశుగచ్ఛటల్. 18

---

కం. కర మరసి నీకు నీవే
త్వర విడువుము దుశ్చ్యవనుని పక్షంబు దిగం
బరసుత! మునుఁగు చితఁడు దు
స్తరశరనిధి మునుచు నిను దృషత్తరి కరణిన్. పాఠాంతరము. 15

మ. పరదుష్ప్రేక్షధనుఃప్రకాండము ననల్పజ్వాలతాయుక్తమై
పరఁగన్ జేసి మరుద్విరోధి గురిసెన్ వైళమ్ము వాలమ్ములన్
శరజన్మం దురురోషభీషణఫణీశప్రాయకోదండమం
దరిసందోహవిజిత్వరోజ్జ్వలకలంబౌఘంబు సంధింపఁగన్. 19

శా. ఆకర్ణాంతముగా సురారివరుచే నాకృష్టమై యెల్లచో
నాకోదండవతంస మీనిన కలంబాళుల్ చెలంగెన్ విలి
ప్తాకాశాంగణరంగముల్ పలితశోభాపాదితాశేషకా
ష్ఠాకాండంబులునై నిరంతరనిజాంచద్భాఃప్రరోహాళిచేన్. 20

మ. దితిజాధీశశరాసనేరితములై దేదీప్యమానాంశుసం
హతులన్ బొల్చు ననంతబాణతతిచే నంధీకృతంబౌ దివ
స్పతిసైన్యంబున నెందు దృష్టివిషయత్వం బొందఁ డయ్యెన్ స్వహం
కృతిసంత్రస్తసమస్తశత్రుబలుఁడౌ నీశానసూనుం డటన్. 21

మ. స్మరజిన్నందనదేవుఁ డగ్గలముగా జ్యావల్లి నెక్కించి క్రం
చర నాకర్ణము లాగి వంచిన శరాసశ్రేష్ఠమే వైరిజిత్
ఖరనారాచము లీనె నెల్లెడల సంగ్రామోర్వినా యంపఱల్
త్వరఁ జెండెన్ బొరి దానవాంబకకదంబధ్వాంతసంతానముల్. 22

మ. సకలవ్యోమచరవ్యథాకరనరాశగ్రామణీమార్గణ
ప్రకరాబ్దోదితదుర్దినంబు క్షణమాత్రన్ వారితం బైనఁ ద్ర్యం
బకపుత్త్రుం డతిమాత్రదుర్విషహధామస్తోమదామాయమా
నకనద్విగ్రహుఁడై విరాజిలె నహర్నాథప్రభాధుర్యతన్. 23

కం. హరసుతుఁ డటఁ దాల్పఁగ గురు
తరధీరతమాప్రమేయధామము నని లా
వరి మాయాకృతి దితిజే
శ్వరుఁ దురుమాయామయాహవము వెసఁ జలిపెన్. 24

చ. అలుక వెసన్ గలంగి విజితారిజగద్విజయావలిప్తుఁడౌ
బలి వికటాట్టహాసవిధిభైరవుఁ డౌచు వరాయుధాజిని
ష్ఫలము త్రినేత్రపుత్త్రునెడ వాలె మటం చెద నిశ్చయించి యు
జ్జ్వలదనిలాస్త్రముం దొడిగెఁ జాపము నందు సహేలమై తగన్. 25

శా. ఆ యస్త్రం బరిఁ గూర్చి నంతనె యుగాంతాభీలకాలోపమ
స్ఫాయద్భూతచయభ్రమావహము చంచన్నిష్ఠురోగ్రార్భటీ





ప్రాయం బాత్మసముద్ధుతామితరజస్సంఛాదితాశానభ
శ్ఛాయాకాంతము నౌచు వీచెను నభస్వంతంబు దుర్దాంతమై. 26

కం. అల గాలి నెగసి కుందధ
వళములు సురసైనికాతపత్రములెల్లన్
వెలసె ఘనాభపరాగా
విలనభమున నెగురు హంసవిసరముఁ బోలెన్. 27

మ. అల గాలిం గదుఁ దూలి యంబరమునం దాదిత్యసేనామహో
జ్జ్వలభూరిధ్వజముల్ నవస్ఫుటదుదంచన్మల్లికా కాంతులన్
పొలయించెన్ ధవళాంశుకచ్ఛలమునన్ వ్యోమస్థలంబందు ని
ర్మలగంగాసలిలోరునిర్ఝరసహస్రశ్రీసముల్లాసమున్. 28

శా. ఆ వాతూలము చేతఁ గంపితములై యత్యంతవీతంబులౌ
దేవానీకమహాకరేణుశతముల్ దీర్యత్పరిస్తోమముల్
వే వే గూలె ధరన్ సరోషనముచిద్విట్చండదంభోళిధా
రావిచ్ఛేదితపక్షతిక్షితిధరగ్రావోపమానంబులై. 29

కం. అల ఖరవాత్యఁ దిరిగి పడె
నిలపరికంపితపతద్ధయేంద్రములు పద
స్థలదురుసూతకులాగ్ర్యం
బులు తత్సురబలశతాంగపూగములుఁ గడున్. 30

కం. ధరఁ బడి రల కరువలిఁ బెలు
కుఱి యమర బలాశ్వికులు స్వఘోటకవర ము
క్కఱి పడ శస్త్రక్షతులన్
బొరయకె సురచమువు నడుమ ముక్తాయుధులై. 31

మ. వడి నాకాశతలంబు నుండి గడు దౌ వాపోవుచున్ వేలుపుం
దడపుం గాల్వురు నుక్కు దక్కి నిజహస్తస్రస్తశస్త్రాస్త్రులై
సుడిగాలిన్ వరుగాకు జోక దెసలన్ జుట్టారఁగాఁ దిర్గుచున్
వడినీ భూమితలంబునం బడిరి తద్వాత్యాత్యమోఘాహతిన్. 32

తే.గీ. అట్టు లసురవరాస్త్రవిహస్తమౌ స
మస్తసురసేనఁ గని మహామహుఁడు గుహుఁడు
స్వఃపతిరమాలతామరక్ష్మారుహుండు
మాన్పె దివిజార్తి నిజదివ్యమహిమశక్తి. 33

చ. అనుపమతత్ప్రభావమున నస్త్రవిమోచిత యౌచుఁ దేఱి యు
క్కున రణకాంక్షఁ గ్రమ్మఱఁగఁ గోల్తల సేయు నశేష దేవవా
హినిఁ గని దైత్యనాథుఁడు సమిద్ధరుషాతిశయాశ్రయాశుఁడై
తనరి కనచ్ఛిఖోగ్రశిఖిదైవతకాస్త్ర మడర్చెఁ జెచ్చెరన్. 34

శా. ప్రావృట్కాలవినీలనీరదగణాభల్ శ్యామరాజీవరా
జీవిభ్రాజితలున్ మహాంధతమసశ్రేణీప్రపూర్ణాశలున్
శ్రీవిశ్వేశ్వరకంఠసామ్యలు ఘనర్ద్ధిన్ ధూమసంఘావళుల్
ద్యోవీథిన్ బ్రసరించె సర్వమును దృగ్యోగాతిశూన్యంబుగాన్. 35

మ. గిళితాశావలయంబు లౌచు జలముగ్బృందాతిసాంద్రంబులై
మలినచ్ఛాయములై తనర్చు నవధూమధ్వాతసంఘంబులన్
బలు విస్ఫీథి విలిప్త మౌట గని బిభ్యద్రాజహంసోత్కర
మ్ములు గోరెన్ లసమానమానససరమ్మున్ జేరఁ దూర్ణమ్ముగన్. 36

మ. నలి వెల్గెన్ జ్వలనుండు నిస్తులరుచిన్ గల్పాంతవేళాసము
జ్జ్వలకీలిప్రతిమానుఁడై సురభటవ్రాతంబు నందంతటన్
దెలివిం గాంచిన సర్వదిఙ్ముఖములన్ గృత్స్నాంతరిక్షంబుఁ బిం
గలకాంతిన్ గడు వెల్గఁజేయుచు నిజోగ్రజ్వాలజాలంబులన్. 37

చ. అతులితధూమసంతతినిరంతరసంతమసప్రపూరితా
భ్రతల మతిప్రదీపితనిరర్గళహవ్యవహాత్యనారతా
ప్రతిమశిఖాకలాపమున భాసిలె మేచకమేఘమాలికా
తతచపలాలతాపరిగతంబగు నప్పటి యొప్పు దాల్చుచున్. 38

కం. కరము వెఱ దివిఁ బరువ ఖే
చరు లతిదీప్త మయి దుర్విషహ మయిన శిఖిన్
బొరిఁ గ్రాఁగి భృశాకులమై
సురపతిబల మెల్ల శంభు సుతు దరిఁ జేరెన్. 39

చ. ప్రకటమహాగ్నిచే నిటు పరాజయ మొంది గలంగఁబాఱు నా
సకలనిలింపవాహిని వెసం గని యంధకవైరినందనుం
డకుటిలహాసభాసురతరాస్యసరోరుహుఁడై స్వకీయకా
ర్ముకవర మందుఁ గ్రన్న నరివోసె నవారణవారుణాస్త్రమున్. 40

తే.గీ. ప్రతిభయతమశ్చయాభమై ప్రలయసమయ
జృంభదనలప్రబలధూమరీతిఁ జటుల



జలదగణ మేచె నింగి గర్జారవౌఘ
పాటితమహామహీధరకోటి యగుచు. 41

మ. ఉరుగంభీరభయంకరార్భటులతో ద్యోరంగమం దాడు వా
ర్ధరబృందాంతర మందు ఘోరచపలావ్రాతంబు నట్టాడెఁ బిం
గరుచిన్ దిక్కులఁ గ్రాలఁ జేయుచు నటన్ గల్పాంతకాలోచ్ఛలత్
పరమాభీలపరేతరాట్చటులజిహ్వాసంఘసచ్ఛాయమై. 42

వ. ఘనకాండబిని డంబు మీఱె సబలాకామాలమున్ నిష్ఠుర
స్తనితోగ్రంబు తటిత్ప్రదీపితహరిత్కంబున్ దురీక్షంబునై
పెను విస్ఫీథి సదంతపంక్తిభయదక్ష్వేడంబుఁ దీవ్రేక్షణం
బును దుర్దర్శము నైన కాలరజనిన్ బోలెన్ భృశాభీలమై. 43

కం. ఘనపథదిశాముఖాచ్ఛా
దనముల విశ్రాంతరసితతతిపీడితచే
తనములు వనధరగణములు
ఘనధారౌఘములఁ గురిసెఁ గరమెల్లెడలన్. 44

చ. అతిభయదాంధకారనివహాపిహితాంబరముల్ గభీరగ
ర్జితరవదుఃఖితాసురవరేణ్యము లద్భుతవారుణాస్త్రసం
భృతములునౌ మహాజలదవీథులచేత విసృష్ట మైన యా
యతులితవృష్టినాఱె జగదద్భుర మయ్యుఁ దదగ్ని చయ్యనన్. 45



శా. పాకారాత్యరిసింధురుండును రుషాభారావిలస్వాంతుఁడై
యాకర్ణాంతవికృష్టచాపవరనిర్యత్క్రూరఘోరేషులన్
వీఁకన్ నొంచెఁ గరంబు పంచశరవిద్విట్సూనుపంచాననున్
నాకేశాఖిలసైన్యబృందములు నొందన్ గాందిశీకత్వమున్. 46

చ. సమరవిలాసలాలసుఁడు సామియుఁ జెండె స్వకాండపంక్తిచేఁ
దుమురుగ దైత్యు తూపుగమిఁ దోరపుఁ జాపము తోడఁ గూడ ను
త్తమమతి యోగి యోగవిధి దాంతమనీషుఁ డమోఘవీర్యధు
ర్యమును భవార్తిమూలవిషయాళిని బోలె యమాదికంబునన్. 47

మ. అట రాత్రించరచక్రవర్తి రథ మొయ్యన్ డిగ్గి గర్జించి భ్రూ
కుటిభంగాననభీషణుం డయి మహాకోపాగ్రహోదగ్రుఁడున్
జటులాభీలకృపాణపాణియునునై సర్వంసహాస్యందనో
ద్భటపుత్త్రోత్తము మీఁదికిం బఱచె దుర్వారప్రతాపంబునన్. 48

కం. సురభటదుర్వారభుజో
ద్ధురవిభవుం డసురవరుఁ డెదురురాఁ గని ముత్
స్ఫురితాననాబ్జుఁడై పుర
హరతనయుఁడు వఱపె లయదహననిభశక్తిన్. 49

చ. స్ఫురితనిజాంశుదీపితనభోహరిదంతరమై నిశాచరే
శ్వరు హృదయంబు నందుఁ దదవారితశక్తి పడెన్ సమస్తది
క్పరివృఢమోదదృగ్జలసుధారసధారల తోడ ఘోరని
ర్జరవిమతోష్ణభాష్పజలసంతతవృష్టుల తోడ నొక్కటన్. 50

చ. ప్రలయసమీరఘోరహతిపాటితపర్వతకూటసామ్యుఁడై
యలఘుకుమారశక్త్యపహృతాసుచయుండు నిశాచరేశ్వరుం
డిలఁ బడఁ గాంచి హర్షము వహించి రెదన్ ద్రిదివాధినాథము
ఖ్యులు త్రిదశుల్ ప్రరూఢపులకోద్గమచారుశరీరయష్టులై. 51

మ. క్షయకాలావపతద్గిరిప్రవరసంకాశాత్ముఁడై యాశరా
గ్రియుఁడే కందువఁ గూలెనా యరిది యుర్వీభాగ మాగెన్ బిలే
శయమూర్ధన్యుఁడు తన్మహాభరవిశేషక్లేశితాత్మస్ఫటా
చయుఁడై క్రిందికిఁ గ్రుంగ నీయక నిజాంచచ్ఛక్తిసామగ్రితోన్. 52

మ. త్వరమైఁ దారకమారకుం డగు సుధాధామావతంసాత్మభూ
వరమౌళిన్ గగనంబు నుండి కురిసెన్ స్వర్వాహినీశీకరో
త్కరకాంతంబు సుగంధలోభమధుపగ్రామాభిసేవ్యంబునౌ
సరసామర్త్యమహీరుహోత్తమసుమాసారంబు దోరంబుగాన్. 53

ప్రభాతవృత్తము :
పగులఁగఁ గంచుకపాళి రోమహర్షో
రుగరిమ నింద్రపురోగసర్వగీర్వా
ణగణము లెచ్చఁగ నైజవక్త్రకాంతుల్
మిగుల నుతించిరి మేటిఁ దారకారిన్. 54

మంగళమహాశ్రీవృత్తము :
ఈ రహిని జిష్ణుఁ డసమేషుహరసూనువరుఁ డేడ్తెఱ సమిద్ధరణి నెంతే
నీ రస జగత్త్రితయహృద్వికటశల్యు నసురేంద్రుఁ బెకలింపఁగ వెసన్ జం
భారి మఱలంగఁ ద్రిదశాలయవిభుత్వపద మంది కడు రాజిలె లసద్బృం
దారకశిరోమణివితానపరిదీప్తపదతామరసమంగళమహాశ్రీన్. 55



తే.గీ. ఇదగుఁ దారకమథనసప్తదశసర్గ
మించుఁ గడపటి దయి కూచిమంచి సోమ
సుందర కవీంద్ర వేంగమానందనాగ్ర్య
సాంబశివకృ తాంధ్రకుమారసంభవకృతి. 56

**శ్రీమదాంధ్ర కుమారసంభవమహాకావ్యము సంపూర్ణము.**

ఓం తత్సత్. మంగళమ్ మహత్.

శ్రీశ్రీశ్రీ

---